సర్వస్వామ్యకలితము

నిడదవోలు మాలతి

ఏప్రిల్ 2017

సంప్రదింపులకు - malathini@gmail.com

నాఇతర సంకలనాలు నాబ్లాగు తెలుగు తూలిక లో "నాసాహిత్యం pdfలో" అన్న పేజీలో చూడవచ్చు. మీరు ఉచితముగా download చేసుకుని చదువుకొనవచ్చు. ఇతరత్రా ప్రచురించుట, అమ్ముకొనుట, ఇతర పుస్తకములు, వస్తువులు, అమ్ముకొనుటకు, ప్రచారము చేసుకొనుటకు సాధనములుగా గానీ చేయరాదు.

ప్రశ్నలు, సందేహములు malathini@gmail.com ద్వారా పంపవచ్చు.

నాసాహిత్యంపిడియఫ్లోపేజీకి లింకు ఇక్కడ

- నిడదవోలు మాలతి

ఏప్రిల్ 10, 2017

# కథాక్రమం

# ముందుమాట

ఈ సంకలనాల ప్రణాళికలో ఇది ఆఖరిసంకలనం. ఇంతవరకూ చేసిన సంకలనాలలో లేనిరచనలు ఈ సంకలనంలో చేర్చేను. ఇందులో వ్యాసాలలాటివి, కథలలాటివి, కాలక్షేపంకబుర్లలాటివి - అనేకవిధాలు కావడంచేత పేరుపెట్టడం కష్టమయింది. ఇదే ఆఖరిసంకలనం అనుకుంటున్నాను కనక మామూలుగా ఉత్తరాలలో ముగించే ఆచారానన్ననుసరించి, ఇంతే సంగతులు  అన్నశీర్షిక తగును అనుకున్నాను.

ఈసంకలనంలో కూడా మునపట్లాగే బ్లాగులో ప్రచురించిన టపాలు మరొకసారి సరి చూసుకుని, అవుసరమైన మార్పులు చేసి కూర్చేను. కొన్న లంకెలు కూడా ఇచ్చేను కానీ మూలటపాలలో ఉన్న అన్ని లింకులు ఇవ్వలేదు. ఒక చిన్న ధారావాహిక, మేమంతా క్షేమం, అన్న శీర్షికతో బ్లాగులో ప్రచురించేను. అది ఇక్కడ చేర్చలేదు, ఇప్పటికే సంకనలం పెద్దది అయిపోయిందన్నఊహతో. అది మరొక పిడియఫ్ చేసి నాబ్లాగులో నాసాహిత్యం pdfలో అన్న పేజీలో చేర్చుతున్నాను. ఆ పేజికి లంకె ఇక్కడ.

యథాశక్తి తప్పులు దిద్దడానికి ప్రయత్నించేను. ఇంకా ఉంటే మన్నించగలరు. మీఅభిప్రాయాలు malathini@gmail.com ద్వారా నాకు తెలియజేయవచ్చు.

నారచనలను ఆదరిస్తున్న పాఠకులందరికీ నా వందనశతము.

ఇట్లు

నిడదవోలు మాలతి

ఏప్రిల్ 9, 2017

# 1. చెప్పొచ్చేదేమిటంటే

మనలో మాట, చెప్పొచ్చేదేమిటంటే, "నీక్కనక చెప్తున్నా" అనో "నీకు మాత్రమే చెప్తున్నానం"టూ అతిరహస్యాలు చెప్పేసేవారు నీకు ఎక్కడైనా ఎప్పుడైనా తగిలేరా? "మళ్ళీ ఎవరితోనూ అనకేం" అంటూ మొదలు పెట్టి ఎన్ని కబుర్లో చెప్పేసేవాళ్ళని చూసేవా? అలా ఎవరైనా నాతో అన్నప్పుడల్లా, ఆ వెంటనే మళ్ళీ "ఎవరితోనూ అనకేం" అంటూ నాచెవిలో గుడిగంట మోగుతుంది. ఆ ఉపవాక్యం మనసులోకి వచ్చేస్తుంది దానంతట అదే. అదన్నమాట సంగతి. ఇక్కడ్నించి కొన్నాళ్ళపాటు నేనిక్కడ చెప్పబోయేవన్నీ అలాటి రహస్యాలే. ఇది మరెక్కడా వొక్కనివ్వకు అని నేను నీకు వేరే చెప్పక్కర్లేదు కదా.

ఇహ ఇక్కడ ఏం చెప్పుకుంటాం అంటే మామూలుగా నువ్వూ, నీలాటివాళ్ళూ ఆఫీసుల్లోనూ, లంచిల్లోనూ కంచిల్లోనూ తెలిసినవాళ్ళతో మామూలుగా మాటాడేవి కావు. ప్రేమాయణాలూ, నువ్వు పూజించే సినీ నాయకీనాయకులూ, చదివే నవలలూ, రాసుకునే కథలూ, ఆడిపోసుకునే రాజకీయాలూ, సతులని పతులూ పతులని సతులూ హేళన చేసే కార్టూనులూ కాదు. అంతేనా, ఇంకా ఏదైనా వదిలేసేనా? అన్నట్టు కనిపించిన ప్రతివాణ్ణీ ఆడిపోసుకునే కుచ్చితులు కూడా ఉండరిక్కడ. ఒక్కమాటలో "సామాజికచైతన్యమూ, సామాజికప్రయోజనమూ" ఉండవు. వీటివల్ల "సామాజికోద్ధరణ" ఇసుమంతయు లేదు.

మాటవరసకి నేనున్నాను. ఓ మాట చెప్తాను విను. మామూలుగా నాకు మరో పనీ పాటా లేదు కదా. అంచేత టీవీలో ఓ డొక్కు షో చూస్తూ కూర్చుంటాను. అంతలో హఠాత్తుగా మెరుపు మెరిసినట్టు ఒక గొప్ప అద్భుత కనివిని ఎరగని విషయం నామెదడులోకొచ్చేసి తిష్ఠ వేస్తుంది. చెవిలో జోరీగా చెప్పులో రాయిలాగ

ఊరుకోనివ్వదు నీకు చెప్పేసేవారకూ. అలాటివన్నమాట ఇక్కడ రాసేదాం అన్న అద్భుత ఆలోచన కలిగింది మూడ్రోజులక్రితం. ఈమధ్య మిత్రులు కూడా "మామూలు మనిషిలా ఉందూ" అన్నాక, ఇది కూడా హఠాత్తుగానే జరిగింది, మామూలుగా ఉంటూ, మామూలు మాటలే చెప్పుకుంటూ నా శేషజీవితం గడపదలుచుకున్నాను. ఇది చాలు కద పరిచయానికి.

ఇంకెందుకు ఆలస్యం, మొదలు పెట్టేస్తాను.

ఏ విషయమైనా ఒకసారి చెప్తే వింత. నాలుగుసార్లు చెప్తే కూడా బాగుండొచ్చు. ఇరవైమార్లు చెప్తే విసుగేస్తుంది. సూర్యోదయానికి ముందే మొదలెట్టి అర్ధరాత్రివరకూ టీవీలో గంట గంటకీ అదే ప్రకటన చూడాలంటే, చంపేస్తున్నార్రా బాబూ అని అరవాలనిపించదూ?

కొన్ని ప్రకటనలు సరదాగానే ఉంటాయి. ముఖ్యంగా 10, 15 క్షణాల్లో ముగించేసేవి. నాకు మందులకంపెనీల ప్రకటనలు చూస్తే మాత్రం అసహ్యంగానే కాదు అన్యాయంగా కూడా అనిపిస్తుంది. ఎందుకంటే తమ మందు ఫలానా జబ్బుకి పనికొస్తుంది అని చెప్పి ఊరుకోరు. ముందు జబ్బు లక్షణాలతో మొదలు పెట్టి, అది మనకి ఉందో లేదో కనుక్కోమంటారు. అక్కడినించీ నాకనుమానం. అవును సుమా నిన్న చేతిమీద ఏదో మచ్చ కనిపించింది. అది చర్మరోగమేమో. అన్నట్టు రాత్రి దగ్గేను కదా. కొంప తీసి నాకు క్షయ కాదు కదా. ... ఇలా లేని ఆలోచనలన్నీ వచ్చేయడం మొదలవుతుంది. ఇంతలో ఆప్రకటన డాక్టరుని సంప్రదించమంటుంది. సరే అనుకుంటుండగానే ఆమందు వికటిస్తే రాగల దుష్ఫలితాలు ఏకరువు పెడతాడు. నేను ఎలాగా డాక్టరుదగ్గరికి వెళ్ళడం అంటూ జరిగితే అక్కడ ఆ డాక్టరుబ్రహ్మ చెప్పడా ఏ మందు పనికొస్తుందో, పని చెయ్యకపోతే ఎలా వికటిస్తుందో?

టీవీలో 90 లేక 120 క్షణాలు – నాకు పావుగంట అనిపించే - ఈ కచేరీ పెట్టడం ఎందుకు? నన్ను తప్పు పట్టకు. ఏదో ఒక రోగంతో బాధ పడేవాళ్ళంటే నాకు సానుభూతి లేదని కాదు నేనీ సొద మొదలెట్టింది. మాటవరసకి చెప్తున్నా. నాకే ఏదో ఉబ్బసమో, ఆరెచ్చ్ జెబిపివో – ఏదో ఒక ఎ-టు-జీ పేరుగల రోగమే వచ్చిందనుకో.

నిజంగా నేనలా బాధ పడుతుంటే, ఆ బాధ కొంచెంసేపు మరిచిపోదాం అని టీవీ పెట్టుకుంటే, మళ్లీ అదే నొద రోజుకి ముప్పై మార్లు వినడానికి నాకు ఆనందంగా ఉంటుందా? ఆ జబ్బులక్షణాలు వాడు చెప్పేదేమిటి, నాకెలాగా ఉంది, నిజానికి వాడికంటే నాకే ఎక్కువ తెలుసు ఆ బాధేమిటో అనిపించదూ? అంచేత వాడి పాట నాకు ఏమాత్రమూ ఉపశమనం కలిగించదు. అంతే కాదు. నాకు ఆ జబ్బు లేకపోతే కూడా ఆదంపుళ్ళపాట వినడం హర్షదాయకం కాదు. ప్చ్. ఆమందులకంపెనీల వాళ్ళకి ఇంతదూరం ఆలోచించేబుర్ర లేదు. వారికి తోచదు. మేం చెప్పాలి అనుకున్నాం, చెప్పేం, అంటారంతే.

అలాగే సాయంత్రం ఎంతో ఉవ్విళ్ళూరుతూ చేసుకున్న కందిపచ్చడీ, వంకాయ వేపుడూ, గోంగూర పచ్చడీ, ముక్కలపులుసూ, గడ్డ పెరుగూ కంచంలో పెట్టుకుని మనసారా ఆనందిస్తూ తినడానికి కూర్చున్న శుభసమయంలో కడుపునొప్పి, అజీర్తి మందులు ఏవి ఎలా పనిచేస్తాయో టీవీవో రేడియోవో హోరెత్తుతుంటే ముద్ద నోట పెట్టగలమా? ఆ ప్రకటనలు ఇవ్వడానికి అదీ సమయం అని ఏ ప్రబుద్ధుడికి తోచిందో నాకు ఈ జన్మలో అర్థం కాదు. ఇంతకీ నేను చెప్పొచ్చేదేంటంటే వినదగు ఎవ్వరు చెప్పిన అన్నది ఇక్కడ వర్తించదు. టీవీ కట్టేసి మరో పని చూసుకోడమే.

ఏమాటకామాటే చెప్పుకోవాలి. కొన్ని ప్రకటనలు మాత్రం సరదాగా ఉంటాయి. ఆమధ్య ఒక కార్లకంపెనీప్రకటన చూసేను. ఒకమ్మాయిని ఇంటికో మరెక్కడికో తీసుకెళ్ళడానికి ఇంకో అమ్మాయి కారు తెస్తుంది. మొదటి అమ్మాయి "నీకారు ఎక్కడ? కనిపించడం లేదు," అంటూ సెల్లులో అడుగుతూ దిక్కులు చూస్తూ, ఒక కారు చూసి, "ఆఁ, కనిపించింది," అని పరుగెత్తుకెళ్ళి ఆ కారు ఎక్కేసి, పక్కనున్న చక్రధారివేపు చూస్తుంది. ఆ అబ్బాయి పాపం తెల్లబోయి ఆ అమ్మాయివేపు చూస్తాడు. ఆ పిల్ల ఎక్కవలసినకారు అది కాదని వేరే చెప్పక్కర్లేదు కదా. నాకు అది చూసిన ప్రతిసారీ నవ్వొస్తూనే ఉంటుంది. ఆ అబ్బాయి మొహంమీద భావప్రకటన అద్భుతం.

మందులకంపెనీలలాగే ఎన్నికల సంరంభమూను. ప్రతి భవిష్యత్తులో కాగల లేదా

కాగలను అనుకునే ప్రతి రాజకీయచతురుడూ కొన్ని లక్షలో కోట్లో తగలేస్తున్నాం కనక మీ ఓటు నాకే అంటూ గోల. దేశాన్ని ఉద్ధరించడానికి తన మహోత్తమ ప్రణాళిక ఉత్తమమే కాదు అదొక్కటే దేశాన్నీ మొత్తం ప్రపంచాన్నీ ఉద్ధరించగలది అని మొత్తుకోడం బాగానే ఉంది. ఆ ధ్యేయాన్ని ఓటర్లందరికీ తెలియజెప్పాలనుకోడం కూడా బాగుంది. కానీ ఆ ఉద్బోధని brainwash స్థాయికి తీసుకుపోవడం మాత్రం దుర్భరం. వెయ్యిమందికి తెలిస్తే వంద ఓట్లు అనుకోడం ఒక ఎత్తు. అదే పనిగా రాత్రీ పగలూ సుత్తి పెట్టడం మరో ఎత్తు. వాళ్ళు ఖర్చు పెట్టేదంతా మనతలలు తినేయడానికే. రోజుకు ముప్పైగంటలు వాగే రేడియోలూ టీవీలు నీకూ నాకూ బోధించే పరమోత్తమపాఠం ఆయన్నో ఆవిడనో గద్దె ఎక్కించమనే కదా. ఆ పైన నువ్వూ నేనూ హుష్ కాకీ అయిపోతాం. నన్నడిగితే, ఆ డబ్బు ఏ దానధర్మాలకో ఇయ్యి, నీకు ఓటేస్తాను అని చెప్తాను. నన్నడగరనుకో, అది వేరే సంగతి.

అమెరికాలో కథ ఇది. ఇండియాలో కూడా ఇలాగే ఉందో లేదో నాకు తెలీదు. కానీ మొత్తమ్మీద ప్రకటనలపేరుతో నాకు నేను ఆలోచించుకోడానికి వీల్లేకుండా చేస్తున్నారన్నది మాత్రం కఠోరసత్యం. వ్యాపారాలు అంతే రాజకీయాలు అంతే. రాజకీయవ్యాపారాలూ అంతే.

ఇవాళ్టికింతే సంగతులు. రేపు కనిపిస్తావు కదూ, ఇంకొన్ని కబుర్లు చెప్తాను.

ఉంటాను మరి.

----

(జనవరి 21, 2016)

## 2. ఔతె నివ్ కుసింత ఎక్కువ సమానంవంటవేటి?

అచ్చంగా అవే మాటలు అనలేదు సంధ్రాలు. ఏమిటందో తరవాత చెప్తాను. ముందు ఈ ఎక్కువతక్కువలగురించి కొంచెం చెప్పుకుందాం.

పిల్లని "ఇచ్చేచోట పైమెట్టూ, తెచ్చుకునేచోట కిందిమెట్టూ" చూడమంటారు. ఓ మెట్టు పైనున్నవారింట పిల్ల సుఖపడుతుంది. ఓ మెట్టుకింద అయితే అణకువగా ఉంటుంది అని. అసలు ఈ ఎక్కువతక్కువలు – చిన్నా పెద్దా, పొడుగూ పొట్టీ, బలవంతులూ అర్భకులూ, పండితులూ అపండితులూ – అన్నీసృష్టిలోనే అమర్చబడి ఉన్నాయి. పిపీలికాదిబ్రహ్మపర్యంతం అంటే చీమ నుండి బ్రహ్మాండంవరకూ అని. చీమ చాలా చిన్నజీవి కనకనే కదా చీమనించీ అన్నది. అలాగే కయ్యమూ వియ్యమూను. అవి సరి తూగాలంటారు కానీ మనం అందరం అనుక్షణమూ పైమెట్టూ కిందిమెట్టూ లెక్కలేసి చూసుకుంటూనే ఉంటాం, మాటల్లో చెప్పినా చెప్పకపోయినా.

వియ్యాల్లాటివే నెయ్యాలూను. నాకంటే ఎక్కువ తెలిసినవారితో స్నేహం చెయ్యాలని నేను ఆశ పడతాను. వాళ్ళదగ్గర్నుంచి నేను తెలుసుకోగల సంగతులు ఎక్కువ ఉంటాయి కనక. అలాగే నాకు తెలిసినపాటి అయినా తెలీనివారు నాస్నేహం కోరడంలో కూడా ఆశ్చర్యం లేదు. అంతా అలాగే అని కాదులే. వేరే కారణాలు కూడా ఉండొచ్చు. మనలోమాట చెప్తున్నా సంధ్రాలుమాటల్లో భాష బాగుంటాదని ఆమెమాటలు వింటార్ట! అలా అని విన్నాను మరి.

అయితే ఈ ఎక్కువతక్కువలు రాతిమీద చెక్కడాలు కావు. ప్రతి నెయ్యమూ సమయాన్నిబట్టీ సందర్భాన్నిబట్టీ అడుగడుగునా మారిపోతూ ఉంటుంది. ఏ ఇద్దరిస్నేహం తీసుకున్నా, సందర్భాన్నిబట్టి కిందూ మీదూ అవుతారే కానీ ఏ ఒక్కరూ పైమెట్టుమీదే తిష్ఠ వేసుకుని కూర్చోడం జరగదు. అలా జరిగితే ఆ స్నేహం

అట్టే కాలం నిలవదు.

పన్యాల రంగనాథరావుగారు "అంతస్తులు" అని ఒక కథ రాసేరు. 1952లో భారతిలో వచ్చింది. ఆ కథ ఇప్పటికీ నాకు గుర్తుండడానికి కారణం కథలో ప్రధానాంశం ఇందాకా చెప్పిన మాటే. చిన్ననాటి స్నేహితులు ఇద్దరు ప్రధానపాత్రలు. ఒకరు సాంఘికంగా అంచెలంచెలుగా పైమెట్టుకి ఎగబాకిపోయినవారు. పెద్ద ఉద్యోగం, పలుకుబడి, కారూ, మేడా అన్నీ చక్కగా అమిరేయి. పైకొచ్చేడు అన్నమాటకి మచ్చు అన్నమాట. రెండోవాడి పరిస్థితి పరమ హీనంగా ఉంది. ఉద్యోగం ఏదైనా ఇప్పిస్తాడేమోనని, మిత్రుడిని సాయం అడగడానికి వస్తాడు. ఆ మిత్రుడు మంచివాడే. మనస్ఫూర్తిగా ఆహ్వానిస్తాడు. తప్పక సహాయం చేస్తానని మాటిస్తాడు. ఉద్యోగం వచ్చేవరకూ తనఇంట్లో ఉండమంటాడు. ఆ తరవాతి కథే అసలుకథ. సాయం అడగవచ్చిన వాడికి ఆ స్నేహితుడు అన్న ప్రతిమాటలోనూ హెచ్చుతగ్గులు కనిపించి కలవరపెడతాయి. కారులో తిరుగుతున్న స్నేహితుడు తన పాత సైకిలు అతన్ని వాడుకోమంటాడు. నాకు కథంతా వివరంగా జ్ఞాపకం లేదు కానీ సహృదయంతో సాయం చేయడానికి తలపడ్డ స్నేహితుడి ప్రతి మాటా, ప్రతి వాక్యంలో తన "కింది మెట్టు" కనిపిస్తుంది ఆ కథానాయకుడికి. అతనికి అర్థం కాక కాదు. మనసు తలతో ఆడే ఆట అది. ఆ మిత్రుడికి ఉత్తరం రాసో, ముఖాముఖి చెప్పో నాకు సరిగా జ్ఞాపకం లేదు కానీ ఏదోవిధంగా కృతజ్ఞతలు చెప్పి వెళ్ళిపోతాడు. ఈ కథ నాకు అంతగా మనసులో నాటుకోడానికి కారణం మనస్తత్వాలను చిత్రించడంలో రచయిత చూపిన అవగాహన. రెండో అతనికి ఆత్మన్యూనతాభావము అంటూ తీసి పారేయకు. మనస్తత్వం లోతుగా పరిశీలించినవారికి మాత్రమే తెలుస్తుంది ఇది. "ఛీ ఛీ ఇది ఆత్మన్యూనతాభావము, నేనిలా అనుకోకూడదు, పాపం, నామిత్రుడు మంచితనంతోనే చేస్తున్నాడు కదా" అని తెలుసుకున్నా – నిజానికి కథలో అదే జరిగింది – దాన్ని కాదని సమాధానపడడం మాత్రం తేలిక కాదు.

చెప్పొచ్చేదేమిటంటే, స్నేహంలో ఈ కిందూమీదూ అడుగడుగునా సవరించుకుంటూ,

సమర్థించుకుంటూ పోవడం అవుసరం, మరియు తాటిమీద సాములాటిది. చాలా జాగ్రత్తగా ఉండాలి. చెన్నాపట్నం చెరుకు ముక్కా నీకో ముక్కా నాకో ముక్కా అని పాడుకున్నట్టు నువ్వేమారూ నేనేమారూ అని ఖచ్చితంగా చెప్పలేవు నువ్వు. నీకూ తెలుసు కదా సమయాన్నిబట్టి సర్దుకుపోతూ, రంగం చదును చేసినప్పుడే స్నేహం నిలుస్తుంది. ఇది అరుదే కానీ కలకాలం స్నేహాన్ని నిలిపేది కూడా అదే.

నేనిలా ఏవో పనికిమాలిన ఊహల్లో పడి కొట్టుకుంటుంటే, సంధ్రాలు హఠాత్తుగా ఓవేపునించి మారునిగన్న వీరభద్రునివలె వగరుస్తూ వచ్చి నాపక్కన కూలబడింది.

ఏమైందని అడగబోయేను.

"మాటాడక, నాకసలే మండిపోతన్నది," అంటూ కసురుకుంది.

నోరు ఠక్కున మూసేసుకున్నాను. మాటాడొద్దన్నతరవాత ఏమైందని మాత్రం ఎలా అడగను?

గుక్కెడు నీళ్ళు తాగితే చల్లారుతుందేమోనని నీళ్ళకోసం లేవబోయేను.

"యాడికి?" అంది మళ్ళీ ఉరిమి చూస్తూ.

నాకు ఏం చెయ్యాలో తోచలేదు. సంధ్రాల్ని ఈ అవతారంలో మున్నెన్నడూ చూళ్ళేదు మరి.

"నానూ నివ్వూ సమానవేనా?" అంది నన్ను గుచ్చి చూస్తూ.

ఇదేదో పరీక్ష కాబోలు, ఆ ప్రశ్నలో ఏదో మెలిక ఉంది కాబోలు అనుకుని ఆలోచిస్తూ సంధ్రాలుమొహంలోకి తేరి చూసేను.

"నీకు తెలీదేమిటి?" అన్నాను గోడమీద పిల్లి వాటంగా.

సంధ్రాలు పళ్ళు గిట్టకరిచి అటూ ఇటూ చూసి, మళ్ళీ రొకాయించింది, "నాను సేసీపనీ నివ్ సేసీపనీ సమానంవేనా?"

"సమానవే," అన్నాను. అందరూ అంటారు కదా అని అన్నానే కానీ నాకామాటలో నమ్మకం లేదు. నీకూ తెలుసు కదా ఈ రోజుల్లో విలువ కడుతున్నది పనికి కాదు

మనిషికి అని. అది కూడా అణాపైసల్లోనే. ఎవడిదగ్గర ఎక్కువ పైసలుంటే ఉంటే వాడే జగద్విజేత.

పావుగంట అయింది. పొగలు కక్కుతూ సంద్రాలూ, బిక్కుబిక్కుమంటూ చూస్తూ నేనూ గడిపేం.

"నీకు సెప్పిన గంద మనూర్నుంచే ఓ బొట్టొచ్చినాది అదేదో సదుగంట. మూన్నెల్లుంటాదంట," అంది ఆఖరికి గుక్క తిప్పుకుని.

"ఆహా, అలాగా."

"ఆ యమ్మవోటం నాకు మా సిరాగ్గున్నాది."

నాజాగ్రత్తలో నేనుండాలి కనక నాకు మౌనమే శరణ్యం.

"కాపీ సేస్తానా. నాకు సెయ్ ఉసుల్నేకపోతే దొరబాబు వొచ్చి తీసుకుంతరు. ఈ యమ్మ అనాగ కాదు. ఆంపె కూసున్నసోటికి నాను ఒట్టికెల్లి సేతికియ్యాలంట. బల్లమీదెట్టినా సాల్దంట, సేతికే ఇయ్యాలంట."

"ఓ," అన్నాను స్వరం బాగా తగ్గించి.

"అది గాదు. మల్ల మాటలేంవో సెప్తాది నివ్వూ నానూ అందురుంవూ సమానంవే అంటా ఒదలకండ సేవనమాసంలో ఒరసాలు కురుస్తయి సూడు అనాగే ఇడకండా రొద."

ఇప్పటికి నాకు కొంచెం ధైర్యం వచ్చింది. "పోన్లేద్దూ. ఒక్కొక్కళ్లు ఒక్కొక్క రకం అని నీకూ తెలుసు కదా" అన్నాను జంకుతూనే.

"అస్లు నివ్వూ నానూ సమానఁవే అంటది ఆయమ్మ. నాను సేసీ పనీ నివ్వు సేసీ పనీ  సమానఁవే అంటది. మరి అందురుంవూ, అన్ని పన్లూ సమానఁవే ఔతే ఆయమ్మ నొచ్చి నాయింట బొచ్చెలు కడగమను. నాసీరెలు ఉతకమను. నాకు ఆరిచ్చీ సొమ్మే నాను ఆయమ్మకిస్తను."

"హాఁ!!!" గుండె ఎగిరిపడి గొంతులో గిలగిల్లాడింది.

"ఏఁవీ? ఆరూ నానూ సమానఁవే అయితే ఆయమ్మొచ్చి నాయింట బొచ్చెలేల కడగరాదూ?"

నాకు పది నిముషాలు పట్టింది తేరుకుని ఆలోచించి సమాధానం చెప్పడానికి.

"అది కాదు. నువ్వు చేసేపని ఆవిడ చేయగలదులే. అది కష్టం కాదు. కానీ ఆవిడ చేసేపని నువ్వు చెయ్యలేవు కదా. అలా చూస్తే ఆవిడ చేసే పని ఎక్కువే కదా మరి," అన్నాను.

"ఏరవుతాది గానీ ఎక్కవెట్టైవుతాది?"

హా!!!

"హా. బాగా అడిగేవు. నిజమేలే. ... కానీ నువ్వు ... అదేలే ... మనం మరోమాట కూడా ఆలోచించాలి. మాటవరసకి ఆవిడ నీఇంట గిన్నెలు కడగడానికి వస్తుందనుకో. నువ్వు ఇచ్చే డబ్బు ఆవిడ ఇప్పుడు చేస్తున్న పనిద్వారా తెచ్చుకుంటున్న ఆదాయంతో సమానం కాదు కదా. అంటే ఆవిడకి నీఇంట పని చేస్తే, ఆ ఆదాయంలో నువ్విచ్చిన మొత్తం తీసేసినా, ఇంకా ఆవిడకే నష్టం. అంచేత ..." అంటూ నీళ్ళు నమిలేను. నాకు తెలుసు ఆ తర్కంలో లోపం. సంద్రాలు ప్రశ్న అది కాదు. కానీ ఏం చెయ్యను? ఒప్పుకోడానికి మనసొప్పదు కానీ నేనూ "ఆ గుంపులో" మడిసినే, ఆ గూటి చిలకనే. నాకొచ్చినవీ ఆ పలుకులే మరి!

"అయినా ఆమధ్య కొందరు బీదలు ఎలా బతుకుతున్నారో అనుభవించి తెలుసుకోడానికి తాము కూడా అలాటి తిండి తింటూ బతకేరుట వారం రోజులు," అన్నాను నన్నూ, నాలాటివారినీ రక్షించుకోడానికి.

"వోరం, నెలా సేస్తే ఏటి నాబం. పేపరల్లోనూ టీవీలోనూ బొమ్మలొస్తయి. అందురూ జయ్ జయ్ కొడతరు. నిజింగా ఆరికీ ఎరికే ఆ ఓరంవో నెలో అయిపోనాక బోజినాలు మమ్ములే."

నాకు మాట తోచలేదు.

సంద్రాలే మళ్ళీ అందుకుంది, "నాకస్లు ఎందుకు మంటెత్తుతాదంటె ఈలంతా కూలీ

నాలీ సేస్కునీవోల బతుకులు బాగుపడాల అని అరస్తరు. సంగ సంస్కరన్లు అంతరు. మాం మంచి సీరె కట్టినా, సెల్ఫోనులట్టుకున్న ఎక్కిరిస్తరు. మరి సమానంపే ఔతే మీనాగే మాం మాతరం అయన్నీ అనుబగించరాద? ఆ ఎకసెక్కాలేటి మల్ల?"

"అబ్బే నువ్వలా అనుకోకు. నివ్వు నన్ను కసిర్తే స్నేహంతోనే కదా. అవీ అంతే," అన్నాను సర్ది చెప్పడానికి ప్రయత్నిస్తూ.

"బుకాయించమాక. నాకు తెల్సులే. మాయప్ప కతలు రాస్తదన్సెప్పితి గద. సదూతది గూడ. అదే సెప్పింది నీలాటోల్లు కతలు కతలుగ మాకతలు సెప్పుకు నవ్వుకుంతరని."

నేను ఆలోచనలో పడ్డాను. ఔను. అందరూ సమానమే, రోజుకూలీ అయినా విశ్వవిద్యాలయాలలో ఆచార్యులైనా శ్రమ శ్రమే అంటూ గొంతు చించుకుంటారు. తీరా విలువ కట్టడానికొచ్చేసరికి అది వేరు ఇది వేరు. నేను చూసేను యూనివర్సిటీలో చెప్పే పాఠాలు ఒకటే అయినా ప్రొఫెసరు ఆయనకిచ్చే జీతంలో నాలుగోవంతు కూడా ఉండదు టీచింగ్ అసిస్టెంటుకి. అడుగడుగునా మనిషివిలువలు నిర్ణయమవుతూనే ఉంటాయి, సమానంగా మాత్రం కాదు.

కాయకష్టానికున్న విలువ బుద్ధిబలానికున్న విలువతో సమానం కాదు. తెలివి మీరిపోయిన ఆధునిక సమాజంలో ప్రతి పనికీ విలువయితే ఉంది కానీ ఆ విలువ బుద్ధిమంతుల లెక్కప్రకారమే. అది అణాపైసల్లోనే విదితమవుతుంది.

విస్కాన్సినులో రాష్ట్రప్రభువులు సిగరెట్ కంపెనీమీద దావా వేసినప్పుడు వారి న్యాయవాదులు గంటకి 2700 డాలర్లచొప్పున లెక్క కట్టేరు వారి శ్రమకి విలువ. ఆ అంకె ఎలా నిర్ణయించేరో నాకు తెలీదు కానీ మొత్తంమీద ఊళ్ళో ప్రజలు అక్కులు నొక్కుకున్న మాట మాత్రం నిజం.

000

సంధ్రాలు లేచింది వెళ్ళడానికి. నాలుగడుగులేసి, వెనక్కి తిరిగి నామొహంలోకి

చూస్తూ అంది, "మల్ల మాదొరబాబుతో అనక. ఆరికి అనాటి బుద్దుల్లేవు. ఆయ్న దరమాత్ముడు."

నేను తలూపేను దిగజారిపోతున్న గుండెలు చిక్కబట్టుకుని.

000

(జనవరి 27, 2016)

# 3. దురలవాటుకి విరుగుడు

(గమనిక: 1. తెలుగులోనే రాయాలన్న పట్టుదలతో కొన్ని కొత్తపదాలు సృష్టించడం జరిగింది. 2. మనసులో అనేక పొరలు. ఒకపొరలో కథ జరుగుతుండగా, రెండో పొరలో కలిగే ఆలోచనలు కుండలీకరణంలో ఇచ్చేను.)

ఏదైనా మప్పొచ్చు కానీ తిప్పలేం అనేది మాఅమ్మ. అలవాటవడం తేలిగ్గానే అయిపోతుంది. దాన్ని వదిలించుకోడానికే నానా అవస్థాను.  అలవాటు మితి మీరితే దానికి "ప్రతిపచ్చ ఆలోసిన సేసి" అరికట్టడానికి విరుగుడు చూడాలి అంటుంది సంద్రాలు. గంటకి 300, 400 పుచ్చుకు మందులు రాసిచ్చే వైద్యశిఖామణులు ఉన్నారు కానీ ఎవరికి వారు కొంత ఆలోచనలు చేసి అలవాట్లను వదిలించుకోడానికి ప్రయత్నించడమే మంచిది. నేను ఎప్పుడూ ముందు నాకు నేను చేసుకోగల వైద్యసహాయం చూసుకుని, నావల్ల కాదని నూటికి నూరుపాళ్ళు తెలిసినతరవాతే ధన్వంతరిని శరణు. ఈకథ విస్తరించడానికి ముందు నాదినము ఎలా మొదలవుతుందో చెప్పాలి.

కనుచీకటి ఉండగానే, లేచి మామూలు అవసరాలు గబగబ ముగించేసుకుని వేడి వేడి కాఫీ కప్పు కుడిచేత పుచ్చుకు, సోఫాలో సుఖాశీనురాలినై టీవీ, లాప్టాపూ తెరుస్తాను. టీవీలో ప్రకటనలు లంకించుకోగానే మెరుపులతో వెలిగే లేఖలూ మెరికల్లాటి కతలూ చూస్తాను. లాప్టాపు తెరవగానే తెరమీద ఎదురయేవి లంకెలమీద లంకెలూ, కొత్తగా ప్రాణం పోసుకున్న పాత "పుటోగ్రాఫులూ", సభలూ, సంతర్పణలూ, పంచుకోళ్ళూ తలమునకలుగా ప్రత్యక్షమవుతాయి. పది బొమ్మలు కనిపిస్తే, అందులో ఒక బొమ్మలో నాకు తెలిసినవాళ్ళు ఒకరు కనిపిస్తే గొప్ప. లింకులయితే అసలు అవేమిటో కూడా తెలీదు. అంచేత వాటిని కప్పదాటులేసుకుంటూ జయజయహో అనుకుంటూ ముందుకు పోవడమే. అలా

జల్లెడ పట్టడం మొదటి మెట్టు.

ఆ తరవాత మరో రెండు తెరపట్లు చూసి, నాలుగు లైకులు కొట్టేసి, టీవీవేపు తిరుగుతాను.

టీవీలో ప్రకటనలసమయమే టీవీ మూసేయడానికి కూడా తగు సమయం. వార్తలు వింటున్నంతసేపూ సరదాగానే ఉంటుంది. అంతలో ఏ అధునాతనసుందరో సినిమా తారో నా ముఖకమలం మెరుగు పరుచుకునే సాధనాలగురించి కచేరీ పెట్టిన సమయము మంచి సమయము టీవీనుండి తప్పుకోడానికి. అప్పుడు టీవీ కట్టేసి, యూట్యూబులో కర్నాటసంగీతం కచేరీ చూసుకు, రెండో మెట్టు ప్రవేశిస్తాను.

రెండోమెట్టు – ఏదో ఒక టపాదగ్గర ఓ క్షణం ఆగి "ఓహ్ అదా సంగతి" అని తెలుసుకున్నదానిపై ముందుకు సాగడం. ఈ రెండిట్లో ఏదో ఒకటి చేస్తూ మధ్యే మధ్యే పానీయం సేవిస్తాను. అట్టి సంక్లిష్టదశలో పొగలు కక్కుతున్నకాఫీమూలంగా అక్షరాలు అలుక్కుపోయి మసక మసగ్గా కనిపించడం కూడా కద్దు. అప్పుడే ఒక టపాదగ్గర వ్యాఖ్యానిస్తున్నాను అనుకుని మరో టపాదగ్గర నాజ్ఞానమో అజ్ఞానమో వెల్లడి చేసుకోడం జరిగేది కూడా.

ఈ కార్యక్రమం "నాకు అలవాటయిపోయింది" అంటే చప్పగానూ అర్థరహితంగానూ ఉంటుంది. ఇదొక జబ్బు అయిపోయిందనే చెప్పాలి. తెలుగులో దీన్ని "దుర్వ్యసనము" అంటారు కానీ నిజానికి అది తెలుగు కాదు. పైగా దుర్వ్యసనంలో దుర్ ఉపసర్గ నాకు నచ్చలేదు. ఇంగ్లీషులో addiction అంటారు. add అంటే జత చేయడం కదా. ఇది చూసినప్పుడు మాత్రం నాకు అర్థమవుతుంది జనాలు ఇంగ్లీషు భాషనే ఎందుకు వరిస్తారో. add అంటే జత కూర్చుట కదా. హీ హీ. అంటే స్వతస్సిద్ధంగా ఉన్న తత్వానికిది "యాడు" చేయబడినది అని. లేదులే. దానికే మనం అతుక్కుపోయేం తుమ్మజిగురు వేసి అతికించినట్టు అని నాకు తెలుసు కానీ నాకు నేనిచ్చుకున్న టీకే నాకు బావుంది.

"మనం దేనికీ అతుక్కుపోకూడదు" అని వేదాంతగ్రంథాలన్నీ మూకుమ్మడిగా ఘోషిస్తున్నాయి. (ముఖపుస్తకంలో కూడా ఇలాటి సుభాషితాలు రోజుకి పది

కనిపిస్తాయి. ఇవాళ ఏం వచ్చేయో, చూడాలి). అలా అతుక్కున్నదానిని "వితుక్కు"చేయడం అంటే వదిలించుకోడం చెయ్యాలి. దీనికే "విషపరిహారము" అని నిఘంటువులో అర్థం ఇచ్చేరు. అన్నట్టు "వితుక్కు" కోసం నిఘంటువులు వెతకకు. వితుష్టుడు కనిపిస్తుంది కానీ వితుకు కనిపించదు. నేనే భాషని పుష్టితరం చేయడానికి సృష్టించేను. ఏంటో మనబతుకంతా అంతే. మొదట అతుక్కునేదాకా ఆరాటం. ఆ తరవాత వదిలించుకోడానికి పోరాటం. బతుకంతా అతుకులూ వితుకులే!

ఇప్పుడు ముఖపత్రపట్టు లేదా గుప్పిట్లోంచి వితుక్కోడానికి నేనేం చేస్తానో చెప్తాను. తరవాత వీలయితే నువ్వూ నేనూ కలిసి ఒక సిద్ధాంతం తయారు చేసి ప్రచారం చేద్దాం. నువ్వు నీ మిత్రమండలితో పంచుకో. అన్నట్టు నాపేరు కూడా చేర్చాలి సుమా. ఈ ఆలోచన అచ్చంగా నాదే, నేనే శ్రీకారం చుట్టేను కనక నాపేరు కలపడం ధర్మం.

ఈ విరుగుడు నెమ్మదిగా మెట్టుమెట్టుగా సాగాలి. పైన చెప్పేను కదా మామూలుగా కాఫీ కప్పుతో టీవి తెరుస్తాను కానీ లాప్టాపు తెరవకూడదు. తెరవాలని మనసు పీకుతుంది. చేయి అటే లాగుతూ ఉంటుంది. లాప్టాపువేపు దిగులుగా చూస్తాను. ఏవైనా అత్యవసరమైనవి ఉండొచ్చు. ఎవరైనా నాగోడమీద వ్యాఖ్యలు పెడితే నేను వెంటనే జవాబు ఇవ్వకపోతే ఏం బాగుంటుందీ? లేదా రుచీపచీ లేని తెంగ్లిషులో ఎవరైనా రాస్తే వారికి నేను హెచ్చరిక వెంటనే పెట్టకపోతే, మరో నాలుగు ఆ భాషలోనే వచ్చేస్తాయి. అది అంటువ్యాధేమో అనిపించేటంతగా. అక్కణ్ణుంచి నానియమాలన్నీ గోవిందా. ...

నాకు అర్థం కాని మరో సంగతి కూడా ఇక్కడే చెప్పుకోవాలి – తెంగ్లీషు, ఇంగ్లీషులో రాసే ఆప్తవాక్యాలకి అదే భాషలో మరిన్ని వాక్యాలు పోలోమంటూ వచ్చి పడిపోతాయి, బంగాళాఖాతంలో తుపానులాగే. కానీ తెలుగులో రాస్తే మాత్రం అదే నుడికారంతో రావడం జరగదు. జరిగినా ఒకటో రెండో, అంతే! అదేం ఖర్మో మరి ...

ఇలా ఆలోచనల్లో పడి కొట్టుకుంటుండగా, ఏదైనా తినాలనిపిస్తుంది. వంటింట్లో

చూస్తే ఎదురుగా సీరియలు డొక్కూ, అరటిపళ్లూ ఇలా తీసుకు అలా తినేయడానికి నాకోసమే ఎదురు చూస్తూ కనిపిస్తాయి. ఇంకా అదృష్టం బావుంటే, మంచు బీరువాలో నిన్నటి ఉప్మావో ఇడ్లీలో కూడా దొరుకుతాయి. కానీ వాటికిది తరుణం కాదు. ఎందుకంటావా? తెలీడంలేదూ, ముఖపత్రంమీద మనసు పడకుండా ఆపాలంటే మనసుని మరోదానిమీదికి మళ్ళించాలి. అంటే పుష్కలంగా చేతినిండా పని కల్పించుకోవాలి. ఈ సూత్రం కూడా ఏదో పుస్తకంలోనో ఉండే ఉంటుంది. లేదా ఏ మహానుభావుడో చెప్పే ఉంటాడు.

సరే, తీరిగ్గా ఉల్లిపాయలు తరగడం మొదలు పెడతాను దాంతో ఏం చేస్తానో తేల్చుకోకుండానే. ఉప్మా కాదులే. చెప్పేను కదా అది మంచుబీరువాలో ఉందని. (టొమెటో పచ్చడి చేయు విధానము ముఖపత్రంలో కనిపిస్తుందేమో).

ఉల్లిపాయలతరవాత బంగాళదుంపలు (శేఖర్ ఆప్తవాక్యం పెట్టేడేమో. రేపు చూసుకోవచ్చులే!!)

తీరిగ్గా తొక్క తీసి ముక్కలు తరుగుతాను. సరే ఎలాగా బంగాళదుంపల కూర ఉంది కదా  అని పూరీపిండి కలుపుతాను. (వసంత విశాఖబొమ్మలు పెట్టెనా?).

బంగాళదుంపలకూర చేయు విధానం అంతా ఇక్కడ పెట్టను. నీకూ తెలుసు కదా మళ్ళీ ఎందుకు నొది. (అయ్యో, హైదరాబాదులో సభలూ, సమావేశాలూ ఏం జరిగిపోతున్నాయో ... అయినా వాటికి ఢోకా లేదు. నిన్న జరిగిందంటూ రేపు ఎవరో ఒకరు లంకె పెట్టకపోతారా. లేదా పంచుకోలు. ఎన్ని రోజులు చూడకపోయినా అదృశ్యం కానివి సభలూ, పుట్టినరోజులూను.)

ఇలా ఇంచుమించు పూట సాగదీస్తాను. లేదులే.  నాలుగు పూరీలు చెయ్యడానికి ఓపూటంతా పట్టదు. (ఆత్మహత్య చేసుకున్నవిద్యార్థిగురించి ఎందుకిన్ని టపాలంటూ గోల పెట్టే టపాలెన్నో!)

మూణ్ణెల్లుగా అనుకుంటున్నాను ఫోను కంపెనీ మార్చాలని. మార్చాలంటే మరో కంపెనీవాణ్ణి పిలిచి అడగాలి. అదుగో అక్కడే నాకు తంటా. అసలు కంపెనీలే కాదు

తెలిసినవాళ్ళకైనా సరే ఫోనంటే నాకు ఏడుపు. ఇవాళా, రేపూ, అన్నం తిన్నతరవాత, పడుకుని లేచినతరవాత ... అంటూ వాయిదాలేసుకుంటూ పోతాను. (పోనీ, ఒక్కమారు తెరిచి చూస్తే పోలే? ఒక వాక్యం రాస్తే వాళ్ళకి నేను ఇంకా ఉన్నానని ఋజువు చేసుకోవచ్చు).

తినడం, గిన్నెలు కడుక్కోడం, మంచినీళ్ళు తాగడం చేస్తూనే ఉన్నాను. (రాయడానికేం లేకపోతే ఏ పెద్దల సువాక్కో ఓ ముక్క గిలకొచ్చు కదా. అన్నట్టు సామెతలు బాగా చలామణీ అవుతున్నాయి.)

ఆశ్చర్యం, ఇంకా ఏం చెయ్యొచ్చో ఆలోచిస్తుండగానే అటున్న సూర్యుడు ఇటు తిరిగేడు. మధ్యాహ్నం అయిపోయింది. (సభలు, సమావేశాలు, ఆ బొమ్మల్లో ఉన్నవారి పంపకాలతో మరో మూడు తెరలు నిడివి సాగుతాయి. ఇవాళ కాకపోతే రేపు చూడొచ్చు. పోనిద్దూ)

ఏం తోచదు. అన్నట్టు అసలు ఈనాటి హడావుడి బతుకుల్లో తోచదు అన్నమాట వినిపించదు. అసలు అలాటి పదం ఒకటి ఉందని కూడా మరిచిపోయేరేమో అనిపిస్తుంది. ఎవరి నోట విన్నా, ఊపిరాడ్డం లేదు, రోజుకి 36 గంటలుంటే బాగుండు అనేవాళ్ళే. ... మళ్ళీ టీవీ వెలిగిస్తాను రాబోయే ఎన్నికల్లో కాబోయే లేదా కావాలని ఆశించే నాయకమ్మన్యులు వల్లించే ధర్మపన్నాలు ఓపికున్నంత సేపు వింటాను. వీళ్ళు మనని ఎలా ఉద్ధరించగలరో చెప్పేసంగతులకంటే, ఎదటివాడు "ఎనుమంటి యెదవో" చెప్పే కతలే ఎక్కువ. అవన్నీ ఓ పట్టిక తయారు చేస్తే, నాయకుడు అనిపించుకోగలవాడు ఒక్కడు కూడా మిగలడు. ఇహ నావోటు నాకే నీవోటు నాకే అని పాడుకోవాలి.

అన్నట్టు దుప్పట్లు కొందాం అనుకున్నాను. బయల్దేరనా? ఇప్పుడు వర్జ్యమేమో? (... ఇవాళ చూడొద్దనుకున్నాను కదా. రేపు చూడొచ్చు. నామొహంలాగే ఉంది. ఇవాళ వర్జ్యం ఎప్పుడో రేపు చూస్తే ఏం లాభం? అది కాదు, రేపు బయల్దేరేముందు ...)

అన్నట్టు నిన్న యోగసూత్రాలు చూస్తుంటే మళ్ళీ తప్పులు కనిపించేయి. అదేం

ఖర్మ ఎన్ని మార్లు దిద్దినా ఇంకా తప్పులు కనిపిస్తూనే ఉంటాయి. "విస్తరి మొర్రి సంసారం మొర్రి" అనేది అమ్మ. ఆ రెంటికీ ఎట్టి పరిస్థితుల్లోనూ మొర్రి పూడ్చడం సాధ్యం కాదని. నారాతల్లో తప్పులూ అంతే కాబోలు. నిజానికి బ్లాగు ప్రారంభించిన కొత్తలో తప్పులున్నాయని ఎవరైనా అంటే, సరేనని మళ్ళీ చూసుకుని దిద్దుకుంటూ వచ్చేను.

నాకు ఆనందం కలిగించే మంచిమాట ముందు చెప్తాను. అది - భాష చక్కగా తెలిసినవారు ఎక్కడ తప్పుందో చూపడం. ఒకొకప్పుడు ఏది ఒప్పో కూడా చెప్తారు. అందువల్ల నాభాషా పరిజ్ఞానం మెరుగు పడే అవకాశం ఉంది కనక ఆనందం అన్నమాట. అంతే కాదు, వారు నిజంగా నాకథ చదివేరు అని కూడా తెలుస్తుంది. ఇది సంతోషం కలిగించే రెండో విషయం.

పోతే, తప్పులన్నాయి అంటూ ఒక సాధారణీకరించి పారేసేవారు అలా అనడానికి కారణాలు అనేకం.

సమారుగా ఇలా ఉంటాయి. చూడు –

1. నిజంగా ఆవిడకి లేదా ఆయనకి నీకథ చదవడం ఇష్టం లేదు.

2. తప్పులెంచడం ఇవాళ్టి సంప్రదాయం.

3. "నీకామాత్రం తెలీలేదు" హీ హీ.

4. "నాకు తెలుసు" హా హా.

- ఇక్కడ మళ్ళీ చిన్న తకరారుంది. అది తప్పులు కానివాటిని తప్పులని ఎత్తి చూపడం. అప్పుడు ప్రెగడ నరసరాజు నామనమున మెదులుతాడు. నాక్కూడా తెనాలి రామకృష్ణుడికొచ్చినంత ఉత్సాహం పుంజుకొచ్చేస్తుంది కానీ నాకు ఆయనలా పద్యాలు చెప్పడం రాదు. అంచేత చాలా మర్యాదగా వారికి చెప్పుకుంటాను నేను రాసింది తప్పు కాదని.

మొదట్లో కొంతకాలం ఎవరు తప్పుంది అన్నా, ఆ మాట నమ్మి, మళ్లీ మళ్ళీ చూసుకుంటూ వచ్చేను. తరవాత ఈ క్రింది విషయాలు గ్రహించేను.

1. తప్పులు దిద్దడం నాకు పనే తప్ప ఆ తప్పుల పట్టువారికి ఏమాత్రమున్నా లెఖ్ఖ లేదు.

2. కథ చదవడానికి ఇష్టపడ్డవాళ్లు తప్పులు పట్టించుకోకుండా చదువుతున్నారు.

3. తప్పులెన్నడమే పనిగా పెట్టుకున్నవారు తప్పులు లేకుండా చూసుకుని సమర్పించినా చదవడం లేదు!! నేను రోజులతరబడి తప్పులు దిద్దుకుంటూ కూర్చున్నంతమాత్రాన పాఠకులసంఖ్య పెరగలేదు.

ఏంటీ సొద అని విసుక్కోకు. ఇది కూడా విషహరణ ఆచారంలో భాగమే. ఏదో ఒక సొద పెట్టుకుని ముఖపత్రాలమీదినించీ నాయావ మరోపేపుకి మరలించడమే ప్రధానం అని ఇక్కడ గ్రహించాలి మరి. అన్నట్టు నువ్విది ఇంతవరకూ చదువుతూ వచ్చేవంటే నీకు కూడా ఆ యావ కొంత తగ్గించేనన్న మాటే కదా.

ఇంతకీ ప్రస్తుతానికి వస్తే, నేను ముఖపత్రంమీద పడకుండా, వేరే పనులు చూసుకోడమే నా ప్రదాన కార్యక్రమం కనకనూ, వేరేవారి రచనల్లో తప్పులు పట్టుట నాపని కాదు కనకనూ, నారాతలే మళ్ళీ చూసుకుందాం అని మొదలుపెట్టేను. దాంతో మరో గంట గడిచిపోయింది. ఇన్ని ఆలోచనలతో బుర్ర వేడెక్కిపోయి నిద్ర ముంచుకొచ్చేసింది.

మొత్తంమీద సాయంత్రందాకా నెట్టుకొచ్చేసేను. ఇంకా కొంచెంసేపు సంగీతం వింటాను. కొంచెంసేపు స్క్రాబులాడతాను. నీకు స్క్రాబులాట రాకపోతే మరో ఆట చూసుకో. మనసు స్థిమితపరుచుకోడానికి అంతకంటె గొప్ప సాధనం లేదు. అసలు నాకే గొడవలొచ్చినా స్క్రాబులాడితే మనసు స్థిమితపడిపోతుంది. లేదింకా అది "అలవాటు" కాలేదు, హీహీ

దాదాపు రోజంతా గడిపేసేను కనక ఒక్కసారి, ఒక్కసారి అంటే ఒఖ్ఖసారే ముఖపత్రం చూసి ఈరోజుకి మంగళం పాడేద్దాం అనుకుంటున్నాను. అలా అన్నమాట దురలవాటుని సదలవాటుగా మార్చుకోడం.

అసలు ఈ జాలంలో పడి ఎన్ని రోజులుగా ఎన్ని పనులు వాయిదా వేసుకుంటూ

వస్తున్నావో ఓరోజు కూర్చుని ఆలోచిస్తేనే చాలు రోజు గడిచిపోతుంది.

ఇప్పటికి ఇంతే సంగతులు. ఇంకా ఏవైనా తోస్తే రేపు చెప్తాను.

ఉండనా మరి.

000

(ఫిబ్రవరి 16, 2017)

# 4. పేరు పడిపోతాదేమో బగమంతుడా!

నాజీవితంలోనే రచయితలకు పేరు పడిపోకుండా పట్టుకోవలసిన అవుసరం వస్తుందని నేను అనుకోలేదు. ఆ సమయం వచ్చిందని తెలిసేక కొన్ని సుళువులు కనిపెట్టవలసిన అవుసరం కూడా వచ్చింది మరి! ఈమధ్య వర్ధమాన మాత్రమే కాక ఓ మోస్తరు పేరు గల రచయితలు కూడా ఈ విషయం మహోద్ధృతంగా చర్చిస్తున్నారు. ఇది "పేరు తెచ్చుకోడం, నిలబెట్టుకోడం" అను ప్రక్రియకి పెరటిదారి కావచ్చు. ఏమైనా ఉడతాభక్తిగా నావంతు సేవ చేసి తరించడం అవసరమే కాదు నాబాధ్యత కూడాను.

000

కుడిచేత్తో పళ్ళబుట్టా, ఎడంచేత్తో చాక్లెట్ పెట్టే పుచ్చుకుని అడుగులో అడుగేసుకుంటూ సంద్రాలు పక్కకి చేరేను.

సంద్రాలు పక్కవాటుగా తల వాల్చి నావేపు చూసి కొంచెం అటు జరిగి తనపక్కన చోటు చేసింది నాకు.

"ఏంటి కథ?" అన్నాను కళ్ళు చిట్లించి ఆవిడమొహంలోకి చూస్తూ.

"కతేటి?" అంది సంద్రాలు అలవాటయిన అమాయకత్వంతో.

"మామూలుగా ఎందుకొచ్చేవూ అంటూ కసుర్తావు కదా."

"నివ్ మాతరం. అయేటి?" అంది సంద్రాలు నాచేతిలో సంభావనలు పరీక్షగా చూస్తూ.

అమ్. దొరికిపోయేను. మారు మాట లేకుండా తలొంచుకుని ఆవిడ చూపిన చోట కూలబడ్డాను ఉస్సురనుకుంటూ.

"ఏటయిందేటి?" అంది సంద్రాలు సానుభూతి మొహం పెట్టి. అమ్మో, ఆవులిస్తే పేవులు లెక్కేట్టుస్తుంది!

పెదిమలు బిగించి ఎలా మొదలు పెట్టాలా అని ఆలోచిస్తున్నాను.

"సెప్పులె. పర్నేదు."

ఆఖరికి నోరు పెగుల్చుకు నిదానంగానూ విచారంతోనూ మొదలుపెట్టేను. "అది కాదు, సంద్రాలూ. నీక్కూడా తెలుసు కదా. మనకి తెలిసిందేదో రాసి ఓ పత్రిక్కి పంపేసి ఊరుకునేవాళ్ళం. వేసుకుంటే వేసుకున్నారు, లేపోతే లేదు. మరి ఇప్పుడేంవో ఈ సాహిత్య సభలూ, సన్మానాలూ, అభిమానసంఘాలూ వచ్చేసి అటు పాఠకుల్నీ ఇటు రచయితల్నీ ఊపిరాడకుండా చేసేస్తున్నాయి. నా చిన్నతనంలో లేదు ఈ సంత కనక నాకు గందరగోళం అయిపోతోంది," అన్నాను.

సంద్రాలు తల అడ్డంగా ఊపింది అందులో ఆశ్చర్యం లేదన్నట్టు. "ఉప్పుడన్ని నోట్ల అంతే మరి. రాసేవోల్లే గాదు సనిమల్ల, ఉజ్జోగాల్ల అన్నిట అట్నె ఔతాది. మీదికి పోవాలంటే మందిల తిరగాల, పదిమంది కల్ల బడాల. రచీతలంద్రూ ఓరికి ఆరే పేరు నిలబెట్కోనానికి శంప పడాల," అంది.

" మహాకవులందరూ నాపేరు చెప్పుకోండి, నాపేరు రాసుకోండి అంటూ ఎవరివెంటా పడలేదు కదా. పోతనా, పెద్దనా, అచ్చమాంబగారిలాటి వాళ్ళమాట వొదిలెయ్. యాభై ఏళ్ళక్రితం కూడా పేరు ప్రతిష్ఠలకోసం ఎవరికీ ఇంత రంధి ఉన్నట్టు కనిపించదు. నామటుకు నేను కొందరిని పరిచయం చేసేను కానీ రాయి రాయి అంటూ వాళ్ళు నావెంట పడ్డంవల్ల కాదు. నాకు నచ్చేయి. రాసేను అంతే"

"మరి ఉప్పుడు ఆల్లని పట్టించుకోట్నేదని నివ్వే రాసేస్తున్నవా నేదా?"

సంద్రాలు అలా నన్ను నిలదీసి అడిగేసరికి నాకు మాట తోచలేదు. నిజమే మరి. నాచిన్నతనంలో మంచి పేరుగల రచయితలగురించి ఈనాటి పాఠకులకి అసలు తెలీను కూడా తెలీదని నేను పని వాళ్ళని గట్టుకు మళ్ళీ వాళ్ళందర్నీ తవ్వి తీసి పునః పరిచయం చేస్తున్నాను. అంటే వాళ్ళ "పేరు" నిలబెట్టాలని కాదు. వాళ్ళు

సృష్టించిన సాహిత్యం విలువైనది అని.

"నేను కూడా అదే అంటున్నానమ్మా."

నేను ఉలిక్కిపడి అటు చూసేను. అనంతంగారు! నాకు ఎదురుగా ఉన్న కుర్చీలో కూర్చున్నారు, "చాలా మంది ఉన్నారమ్మా పేరుకోసం కాక ఆశయసిద్ధికోసం, లోకకల్యాణంకోసం సాహిత్యకృషి చేసినవారు. కనుపర్తి వరలక్ష్మమ్మ, వట్టికొండ విశాలక్షి, కొమ్మూరి పద్మావతీదేవి, పేదుల మీనాక్షీదేవి, బలివాడ కాంతారావు, జి.వి. కృష్ణరావు – ఇలా ఎందరో మహానుభావులు. వీళ్ల పేర్లు విన్న పాఠకులు ఈనాడు ఎంతమంది ఉన్నారంటావు? తిరగా బోర్లా వేసి ఎన్నిమార్లు చెప్పినా ఆ చలం, ఈ విశ్వనాథ, మరో కుటుంబరావు – వీళ్ళపేర్లే మళ్ళీ మళ్ళీ వల్లిస్తారు. ఈమధ్య చాసోపేరు మళ్ళీ కొంచెం వినిపిస్తోంది. కానీ ఎందరో రచయితలు ఉన్నారనీ, వాళ్ళు చాలా మంచి కథలు రాసేరనీ చాలామందికి తెలీదు. యూనివర్శిటీ క్లాసుల్లో తెలుగు సాహిత్య చరిత్రపాఠాలు చెప్పేవారికి కొంచెం తెలుసేమో. ఏడాదికోమారు ఏదో ఓ సభ పెట్టడం, తద్దినాలు పెట్టినాట్టే. నలుగురు ఉపన్యాసాలు ఇవ్వడం. లేదా జయంతిసంచిక వర్ధంతి సంచిక అంటూ పది వ్యాసాలూ ... వాటిల్లో ప్రసంగవశాత్తు ఈ గతించిన రచయితలని స్మరించుకోడమే తప్ప ఇంకేముందు. వెనకటి సుప్రసిద్ధ రచయితల పేర్లు ఓపది చెప్పండని ఎవరినైనా అడిగితే మాత్రం తెల్లమొహంలేయడం ఖాయం," అనంతంగారు ఆ తలపులతో వచ్చిన ఆవేశాన్ని ఆచుకోడానికి ఓ నిముషం ఆగేరు. ఇంకా ఏం చెప్తారో అని చూస్తూ కూర్చున్నాను.

ఆయనే మళ్ళీ అందుకున్నారు. "అంచేత పేరు పడిపోతుందన్న బాధలో కొంత అర్థం ఉంది. కానీ నిలబెట్టడం ఎలా జరుగుతుంది? ఎవరు నిలబెడతారు? ఈనాడు మనం తలుచుకుంటున్న రచయితలని చూడు. వాళ్ళెవరు గానీ నాపేరు నిలబెట్టు బాబూ అని ఎవర్నైనా యాచించేరా? లేదు. నా అభిప్రాయం ఏమిటంటే ఆ రోజుల్లో దృక్పథంలో మార్పు."

"ఎవరి దృక్పథమండీ?" అన్నాను నెమ్మదిగా.

"రచయితలూ, పాఠకులూ – ఇద్దరిదృక్పథంలోనూ మార్పులొచ్చేయి. దానికి వెనక

కారణం స్థూలంగా సమాజంలో వచ్చిన మార్పే. రెండోది – అప్పట్లో రాసేవారు తక్కువ, రాసి ప్రచురించుకోగల వసతులు తక్కువ. చదివి ఆస్వాదించినవారే ఎక్కువ. ఇప్పుడు అనేక మాధ్యమాలు కలిగించిన వసతితోనూ, చదువుకున్నవారు ఎక్కువ అవడంతోనూ రాయడం ఎక్కువయిపోయింది. దానికి తోడు 'నేను, నాపేరు' అంటూ వ్యక్తివిజయంపేరుతో ఆత్మప్రదక్షిణలు కూడా ఎక్కువయిపోయేయి. వెనక సమాజంతోనే తను అన్న ఆలోచన, ఇప్పుడు నాతోనే సమాజం అన్న అహంకారం. ప్రతివాడికీ కేవలం తన అస్తిత్వమే ప్రధానం అయిపోయింది. ప్రతివారికీ ఆలోచనలు ఉంటాయి కాదనను. కానీ అవి పంచుకోవాలన్న ఆరాటం మాత్రం మితి మీరిందనే అనిపిస్తోంది. రోజుకు 24 గంటలు మితి ఉన్నట్టే మెదడుకి కూడా మితి ఉంది. ఒక్క చదవడమే చేసినప్పుడున్నంత ఏకాగ్రత – మరి ఏకాగ్రత అన్నమాటలోనే ఉంది కదా – ఆ శ్రద్ధ రెండూ చేసినప్పుడు ఉండే అవకాశం లేదు. పంపకాలతో కాలం ముక్కలు కాక తప్పదు. మేధ వేరు వేరు వ్యాపకాలకు పంచి పెట్టబడుతుంది. ఎవరు మాత్రం ఎంతకని చదువుతూ, రాస్తూ, ఆలోచించుకుంటూ పోగలరు కనక. పోలేరు. ఈనాడు ప్రతివారూ తాము నాలుగైదు పనులు చెయ్యగలం అని దర్పాలకి పోతున్నారు కానీ నిజంగా ఒక్క గంట ఒక్క పనిమీదే దృష్టి పెట్టి పని చేస్తే తేడా తెలుస్తుంది.

పైగా ఇప్పుడు పరిస్థితి చూడు. అచ్చు పత్రికలూ, జాల పత్రికలూ ప్రచురించే కథలు నాకు రూఢిగా లెక్క తెలీదు కానీ నెలకి కనీసం వంద అయినా పాఠకలోకంమీదకి వదుల్తున్నట్టుంది. ఉద్యోగాలూ సద్యోగాలూ చూసుకుంటూ, పిల్లా పాపా చూసుకుంటూ ఏ ఒక్కరు గానీ అన్ని కథలు చదవగలరా, పేరాశ కాకపోతే! ఇవి చాలనట్టు, బ్లాగుల్లోనూ, ముఖపత్రాల్లోనూ వచ్చేవాటిని లెక్కెట్టడం కన్నా చుక్కలు లెక్క పెట్టడం తేలిక. కోకొల్లలు. వాటిలో మళ్ళీ లంకెలూ, విడియోలూను. మొత్తమ్మీద రాసి పోసేస్తున్నారు రచయితలు. వాటిని ఎత్తి పోసేస్తున్నారు కాపీరాయుళ్ళు. వీళ్ళకి మూలరచయితలు ఏమనుకుంటారన్న బాధ లేదు. చదువుట తగ్గిపోయింది కదా అన్న ధైర్యమో, ఎవరు చూడొచ్చేర్లే అనో. ... ఇవన్నీ

చూస్తుంటే వీళ్ళలో చాలామందికి కాకపోతే సగంమందికి కేవలం తమపేరు తెరమీదో కాయితంమీదో కనిపించడమే ప్రధానం అనిపిస్తుంది. అయితే వారికి కూడా తెలుసు ఈ తెరమీదో కాయితంమీదో పాఠకుడి కళ్ళు ఉన్నంతసేపే వాటి జీవనప్రమాణం అని. ఆ తరవాత సమస్తం అంతర్ధానం. అదన్నమాట రచీతలందరూ ప్రతిరోజు ఏదో ఓ పత్రికలోనూ పేరూ కనిపించకపోతే పడిపోతుందన్న అభిప్రాయం అన్న వాదన ప్రబలడానికి కారణం."

అప్పుడే నాకు మరో చిన్న కథ గుర్తొచ్చింది. ఈ పేరు పడిపోతుందేమోనన్న పిరికితనం ఇప్పుడే వచ్చింది కాదు. 60లలోనే ఈ లేడీరచయితలు కుప్పలు తిప్పలుగా రాసి పారేస్తూ పత్రికలలో వీరవిహారం చేస్తున్నరోజుల్లోనే విన్నాను అలా కుప్పలుతిప్పలుగా రాయడం పేరు నిలబెట్టుకోడానికే అని. "పేరు పడిపోడం ఏమిటి" అని ఒక ప్రముఖ రచయిత్రి నాతో అని నవ్వడం నాకు ఇప్పటికీ మనసులో మెదుల్తూనే ఉంటుంది పేరు పడిపోడం మాట విన్నప్పుడల్లా.

"ఏటి ఆలోసిన్ల పడిపోనావ్?" సంధ్రాలు అనడంతో తేరుకున్నాను.

"అనంతంగారేదో చెప్తుంటేనూ ..." అంటూ అటు చూసేను. ఎవరూ కనిపించలేదు. "ఏంలేదులే," అన్నాను మాట మారుస్తూ, "ఏం లేదు. వెనకటిరోజుల్లో రచయితలగురించి ఆలోచిస్తున్నాను."

"ఏటని?"

"ఆరోజుల్లో ఎవరూ నాపేరు నిలపండహో అంటూ గోలెట్టలేదు కదా."

"సర్నే. ఆలిప్పుడు సేరు గద. అందుసేత ఆరికి తెలవదు ఎవురేటనుకుంతన్నరో అనుకోట్నం సేదో."

"ఇంతకీ అసలు విషయం - ఇప్పుడు అందరూ మనని మనమే ప్రచారం చేసుకోవాలంటున్నారు. అదెలాగా అని ఆలోచిస్తున్నాను."

అదా సంగతి అన్నట్టు సంధ్రాలు తలూపింది.

"నువ్వు నాలుగు దేశాలూ చూసినదానివి. ఏమైనా సలహా చెప్తావేమోనని

వచ్చేను," అన్నాను. చల్లకొచ్చి ముంత దాచడంపేల?

"ఔను. మనగురించి మనంపే సెప్కోవాల. ఏలనంటె రాసీవోరు ఎక్కువైపోనారు. కతలు యేలకి యేలు ఒచ్చి పడిపోతన్నయ్ దినదినంవూని. సదీతాన్కి ఏరికీ టయాం నేదెక్కడాను. అందుసేత మనయి సదమని పాతకులముందలికి మనఃపే తేచ్చీవాల. అదే రాసీవోల దరమం విప్పు."

సరే, సంధ్రాలు కూడా అదే అభిప్రాయానికొచ్చేసింది కనక ఇహ నాకూ అదే దిక్కు.

"అయితే ఇప్పుడు నన్నేం చెయ్యమంటావు?"

"రచీతలని కొలుసుకో. ఆరి పొత్కాలగూర్చి రాసి. ఆ యెనక ఊరూర సబలెట్టు. సంతలో సరుకు అమ్ముకొనీవోరు నాసరుకు సూడు నాసరుకు సూడు అంట పోటీ పడ్రూ, ఇదీ అట్టనే."

సరేనంటూ తలూపేను.

"గొడ్డునాగ తలూపతాపేటి. రాస్కో." నేను బుద్ధిగా రాసుకున్నాను అరచేతిలో.

"మల్ల రాజుగోరు, రెడ్డిగోరు, నాయుడుగోరు, సౌదిరిగోరు – ఆలంత సాయిత్తెం దున్నిపారేస్తన్నరు గద బారతయుద్దంలో యీరుల్నాగే. ఆరి పేపకం సంపాయిచ్చు."

"సాహిత్యం దున్నిపారేయడమా?"

"యవసాయంనాగన్న మాట సాయిత్తింవూని."

"సరే," అన్నాను నీరసంగా తలూపి. ఆ రాజుగారూ, రెడ్డిగారూ, చౌదరిగారూ వాళ్ళంతా అతిరథులూ మహారథులూను. వాళ్ళకళ్ళు నామీద పడాలంటే వారు తమ అక్షిగోళాలను అరవై డిగ్రీలు కిందకి దింపాలి. లేదా నేను వారి కనుగవస్థాయికి అంటే పదడుగుల ఎత్తుకి ఎదగాలి. రెంటికన్నా ఆకాశకుసుమాలు కోసుకురావడం తేలిక.

"నీకెవురో శాస్తుర్లు తెల్సంటివి గద."

నేను తల అడ్డంగా ఆడించేను. "శాస్త్రుర్లూ, శర్మలూ, ఆచార్లూ పనికి రారులే. వారికి అంత బలగం లేదు. అసలు వాళ్ళే ఈ రాజుగార్లకీ, రెడ్డిగార్లకీ సేవలు చేసి పబ్బం గడుపుకుంటున్నారు."

మాటలోనే తారకం వచ్చేడు.

"ఏం బాబూ ఇలా దయ చేసేవు?" అన్నాను. ఈమధ్య అతడు నన్ను నిర్లక్ష్యం చేస్తున్నట్టు నాకు అనుమానంగా ఉంది. అంచేత కోపంగా ఉంది.

"మీకేదో కోపం వచ్చినట్టుంది."

"కోపం తెచ్చుకోడానికి నేనెంతటిదాన్ని తండ్రీ. నాకేం పేరా ప్రతిష్ఠా."

"అందుకే వచ్చేనండి. మీకు రావలసిన ప్రతిష్ఠ రాలేదు. అంచేత నేనే పూనుకుని మీకు పేరు తెప్పించేదాం అనుకుంటున్నాను."

"అంటే ఏం చేస్తావేమిటి? నాపేరూ ముఖారవిందమూ ఓ వెయ్యి కాయితాలమీద అచ్చేయించి వీధీ వీధీ చెట్లమీదా, గోడలమీదా అతికించేస్తావేమిటి తప్పిపోయినవాళ్ళల్లా?"

"అది కాదండి. మీరేం చెయ్యాలంటే వారం వారం ఏదో ఒకటి రాసేస్తూండండి. నేనేమో దానిమీద వ్యాఖ్యలూ, వాటిగురించి సమీక్షలూ, వాటికి వ్యతిరేకంగా వ్యాసాలూ రాసేస్తూంటాను. అలా నాపేరుకీ మీపేరుకీ కూడా ఢోకా ఉండదు."

"అంతేనా, ఇంకా ఏమైనా ఉందా?"

"సభలండి సభలు. సభలూ సత్కారాలూ ఏడాదికోమారు సంతర్పణలూను. నెలకో సభ పెట్టి కనీసం నలుగురికి శాలువాలు కప్పాలి."

"బాగుంది. వారానికో సత్కారం అన్నమాట."

"మరి దానికి మదుపు కావాలి కదా?"

"దానిక్కూడా ఓ చిట్కా ఉంది లెండి. కొత్తగా కలం పట్టినవాళ్ళకి సత్కారం చేస్తాం అంటే వాళ్ళే ఖర్చులు పెట్టుకుంటారు. అలాగే కొందరు డబ్బు మూలుగుతున్న

సాహిత్యాభిమానులు కూడా సాయం చేస్తారు వాళ్ళబొమ్మలు పత్రికలలో పడితే చాలు."

సరే అన్నాను. ఏం చేస్తాం, కాలం నదిలాటిది అంటారు. మరి ఆ ప్రవాహంలో కొట్టుకుపోవాల్సిందే, దేవుడా ఇంత చేసేవా అనుకుంటూ.

"అన్నట్టు మరో పద్ధతి కూడా ఉందండి."

"ఏమిటది?"

"పత్రికలలోవి బ్లాగుల్లోనూ, బ్లాగుల్లోవి పత్రికలలోనూ ప్రచురించడం."

"నేను రాసినవేనా?"

తారకం విరగబడి నవ్వేడు పొట్ట చేత్తో పట్టుకుని. తేరుకున్న తరవాత, "భలే జోకులేస్తారండీ మీరు. మీవయితే నేను చెప్పేదేమిటి. బాగున్నవి అన్నాను కానీ మీవి అనలేదు కదా."

"మహా బాగుంది. అ అసలు రచయితలకి తెలిస్తే పరువు పోదూ?"

"దానికి తగ్గ దార్లు కూడా ఉన్నాయిలెండి."

నేను నెమ్మదిగా లేచేను, నా పళ్ళబుట్టా చాక్లెట్ పెట్టీ పట్టుకుని.

"ఏటి లేసిపోతన్నవు?"

సంధ్రాలు నాచెయ్యి పట్టుకు లాగి కూచోపెట్టేసింది.

"ఒకమాట సెప్త. ఇనుకో. నోకంలో ఎవురూ ఉండిపోరు. ఉప్పుడు అదే పనిగ రాసీసీనా, సబలూ సంబరాలు అంట గోలెట్టిన నివ్వు సచ్చినంక ఏటవుతాది? వప్పుడు ఈలెక్కన దినవూ నీపేరు ఎడ కనిపిస్తాది?"

నిజమే. ఇలా నారాతలు నేనే ప్రచారం చేసుకోవాలంటే, నేనున్నన్నాళ్ళు చేస్తాను కానీ తరవాత?

"నివ్వే అంటివి గద నీ కాయితమ్మీన రాసినవి సదివీవోలు ఆలకి నచ్చి సదాతన్నరు గాని నివ్వు రా రా అని పిలిస్తె రానేదు గద. అది నీకు సంతసం.

అంతే. ఇయన్ని పక్కనెట్టేసి, నీపాట్న నివ్వు రాస్కపో. నీకూ నీసేయితులకీ కూడా సుకం," అంటూ మళ్ళీ దివ్యమంత్రం ఉపదేశించింది.

నాలుగు నిముషాలు మాటాడకుండా కూర్చున్నాను. తరవాత నెమ్మదిగా లేచేను, నా పళ్ళబుట్టా, చాక్లెట్ పెట్టీ పట్టుకుని.

"తారకమంత్రం నావల్ల కాదు గానీ, రాజుగారినో రెడ్డిగారినో ఆశ్రయిస్తాను."

"అయి పట్టకపోతన్నవేటి?"

"వారిదగ్గరికి ఒట్టి చేతులతో ఎలా వెళ్తాను?"

సంద్రాలు చాక్లెట్ పెట్టె లాక్కుని, "పో," అంది.

చెప్పనేల, పళ్ళు ఎవరికీ అక్ఖర్లేదు.

000

(ఫిబ్రవరి 17, 2016)

# 5. అస్తి నాస్తి

"పూజలూ వ్రతాలూ మానేసేను," అన్నాను అనుపమతో.

"ఎందుకు మానేసేవు?" అంది నామొహంలోకి చూస్తూ.

గొప్ప చిక్కొచ్చిపడింది. నాకారణాలు నావి. నా కారణాలు నాకు మాత్రమే పరిమితం. ఆ పిల్లకి నమ్మకాలున్నాయి. ప్రత్యేకించి నేను ఇప్పుడు నానమ్మకం ఎందుకు ఎలా పోయిందో చెప్పినందువల్ల ఏమిటి లాభం? అనూ తన అభిప్రాయం మార్చుకుంటుందా? తను మార్చుకున్నా మార్చుకోకపోయినా నాకు ప్రత్యేకించి కలిసొచ్చేదేమీ లేదు. దేవుడు లేడు అంటూ గోలెట్టడం నాకిష్టం లేదు.

అసలు ముందు నేను పెరిగిన వాతావరణం చెప్తాను. మాయింట్లోనే అన్ని రకాలూ ఉన్నారు. నిప్పూ నీళ్ళూ కడిగేంత చాదస్తంనించి నమ్మకాలు ఉన్నవాళ్ళని హేళన చేసేవాళ్ళవరకూ. వీళ్ళమధ్య పెరగడంచేతేనేమో నేను ఉన్నాడనిపిస్తే ఉన్నాడు కాబోలనీ, లేడనిపించినప్పుడు లేడనీ నాకు నేను చెప్పుకుంటూ వస్తున్నాను. ఒక సందర్భంలో "ఇదుగో, దేవుడూ! దేవుడూ! మరేమో నీలోకంలో నువ్వుండి నీపనేదో నువ్వు చేసుకో. నేను నాలోకంలో ఉంటూ నాపని నేను చూసుకుంటాను, నువ్వు నాజోలికి రాకు, నేను నీజోలికి రాను" అని ఓ శ్రీముఖం కూడా ఇచ్చేసేను. చూసేరా, అలా అంటే దేవుడున్నాడని ఒప్పుకున్నట్టే కదా. మరి లేనివాడితో మాటాడేనంటే అది నమ్మకమైనా కావాలి, పిచ్చి అయినా కావాలి!

నేను రోజు నడిచేదారిలో ఈ చిన్న కట్టడం ఉంది. ఇదేమిటో తెలీదు కానీ దాన్ని చూసినప్పుడల్లా నాకు పాడుపడిన శివాలయమో ఆంజనేయస్వామి గుడో చూసినట్టుంటుంది. .



దాని ముఖద్వారం కూడా విలక్షణంగానే ఉంది. ఆ తరవాత నాకు విస్కాన్సిన్ లో పరిచయమైన ఒక తమిళావిడ గుర్తొస్తారు. ఆవిడకి సంప్రదాయాలంటే గౌరవం. పూజలూ వ్రతాలు శ్రద్ధగా చేస్తారు. ఆవిడ ఒక రోజు అన్నారు. "ఇక్కడ మనకి ఏ గుడీ లేదు. నేను రోజు ఆఫీసుకి వెళ్ళేదారిలో చర్చి ఉంది. ఆ పక్కనించి వెళ్తున్నప్పుడు అనిపిస్తుంది ఏ దేవుడైనా దేవుడే కదా అని," లెంపలేసుకుని ముందుకు సాగుతారుట. 30 మైళ్ళవేగంతో కారు నడుపుతూ. పైన నేను చెప్పిన కట్టడం చూడండి. దీపపు స్తంభాల్లా లేవూ అ నిలువు స్తంభాలు? మనం పెరిగిన వాతావరణాన్నిబట్టే మన తలపులు కూడాను మరి. అదేదో మూఢనమ్మకం అనుకోలేను నేను.

నాకు సాంత్వన చేకూర్చే ఉద్దేశంతో ఇంట్లోవాళ్ళూ పైవాళ్ళూ, చుట్టాలూ పక్కాలూ చేసే హడావుడి ఇంతా అంతా కాదు. ఆస్తికులు అదే పనిగా ఈ పుస్తకం చదువు, ఆ పూజ చెయ్యి, ఈ వ్రతమాచరించు, ఆ సాధువుని చూడు, ఈ బాబాని దర్శించుకో అంటూ వేధిస్తారు ఒక పక్క. మరో పక్క నాస్తికులు, హేతువాదులు అవన్నీ మూఢనమ్మకాలు, వేదాల్లోనూ పురాణాల్లోనూ ఉన్న కథలు అవాస్తవాలు, అభూతకల్పనలు, మట్టి బొమ్మకి ప్రాణం పొయ్యడమేమిటి, దానికి మళ్ళీ ఏనుగుతల అతికించడమేమిటి అంటూ నాకు మహోత్సాహంతో హేతువాదం నూరి పోస్తారు. గొప్ప హేతువాదిగా పేరు పొందిన రచయిత కూడా ఇలా రాయడం నాకు ఆశ్చర్యంగానే ఉంటుంది. సాహిత్యం అంతా ప్రతీకాత్మకమే. పంచతంత్రం కథల్లో కుందేలు మాటాడ్డమేమిటి, సింహం మాటాడ్డమేమిటి అని ఎవరూ అడగడం లేదు కదా. ఏ కథ ైనా ప్రతీకాత్మకంగా ఆకథలో ప్రధానాంశం ఏమిటో చూడాలి. వేదశాస్త్రాల్లో జ్ఞానం నమ్మనివాళ్ళు శాస్త్రవిజ్ఞానాన్ని నమ్మమంటారు.

విజ్ఞానశాస్త్రవేత్తలలో అనేకులు ఉన్నారు దేవుడిని, బాబాలనీ నమ్మేవారు మరి. సైతాను సైతం తనకి అనుకూలమైన ఉదాహరణలు చూపగలడు అని ఆంగ్లసామెత.

కాఫీ మంచిది కాదన్నారు ఒకప్పుడు. ఇప్పుడు రోజుకి రెండు కప్పులు తాగితే మంచిదంటున్నారు. తాగుడు మంచిది కాదన్నారు వెనక. నిన్న చూసేను రోజుకి ఒక కప్పు వైను పుచ్చుకుంటే రెండేళ్ళు ఆయుర్దాయం పెరుగుతుందిట. ప్చ్. ఇంత ఆలస్యంగా తెలిసింది. ఇప్పుడు మొదలు పెడితే నాఆయుర్దాయం ఎంత పెరుగుతుందో ఎలా లెఖ్ఖ కట్టడం? నేను లెఖ్ఖలు కట్టి తాగడం మొదలు పెట్టేక మళ్ళీ ఈ సైన్సు మరో సిద్ధాంతం చేస్తే అప్పుడేం చెయ్యడం? ముఖ్యంగా breast implants విషయంలో జరుగుతున్న తర్జనభర్జనలూ, ఆ implantsమూలంగా అనేక బాధలకు లోనైన ఆడవాళ్ళనీ తలుచుకుంటే ఒళ్ళు మండిపోతోంది. ఏమైనా నేను పురాణాలూ చదవలేదు, హేతువాద నాస్తికవాద మానవతావాద గ్రంథాలూ చదవలేదు. ఒక్కమాటలో నేను ఒఠ్ఠి పనికిమాలిన నేలబారు మనిషిని. ఏ చదువూ సంధ్యా లేని కోటానుకోట్ల జనాల్లో ఒక రేణువుని. అంచేత ఈ చర్చ ఆ మేధావులకీ, కాయితాలు నెమరేసే మేతావులకీ వదిలేసి నాకత కొనసాగిస్తాను.

స్థూలంగా నా నమ్మకాలు – 'దేవుడు ఉన్నాడు' అని నిర్దుష్టంగా నమ్మినవాళ్ళు నమ్మండి. 'దేవుడు లేడు' అని దృఢతరంగా నమ్మినవాళ్ళు అలాగే మీ నమ్మకాలు నిలుపుకోండి. ఎవరి నమ్మకాలు వారివి. నాకు తంటా అంతా అటో ఇటో నన్ను నమ్మించడానికి ఆరాటపడిపోయేవాళ్ళతోనే.

వాళ్ళందరికీ "నాబాధలు నేను పడతాను. అసలు అవి బాధలు కావు అని కూడా అనుకుంటున్నాను. అంచేత బాధలంటూ ఉంటే గింటే నేనే పడతాను కానీ నాబాధలు మీరు పడుతూ ఆయాసపడిపోకండి," అని చెప్పి నేనే వాళ్ళని ఓదార్చాల్సిన పరిస్థితి అయిపోయింది.

నేను మాఅమ్మవెనక తిరుగుతూ పెరిగేను. అంచేత ఏ భారతమో, భాగవతమో ఆవిడ చదువుకుంటూ అప్పుడప్పుడు నాకు కథలు చెప్తూండడంచేత ఆ కథలు సుమారుగా తెలిసేయి కానీ నాకు నేనయి  అవేవీ చదవలేదు. అలాగే మాటల్లో

సందర్భం వచ్చినప్పుడు చెప్పే కథలు కొన్ని ఇప్పటికీ గుర్తున్నాయి. అలాటి కథల్లో ఇదొకటి.

"మూడు జన్మల ముష్టివాడొచ్చేడు, ముష్టి వెయ్యి," అన్నాట్ట వీధి అరుగుమీద కూర్చున్న ఒకాయన లోపలిగదిలో ఉన్న ఇల్లాలితో.

ఏ సందర్భంలో అమ్మ ఈ మాట అందో నాకు జ్ఞాపకం లేదు కానీ నేను దానిమీద ప్రశ్నించడం మాత్రం జ్ఞాపకం ఉంది.

"మూడు జన్మలలో ముష్టివాడని ఆయనకి ఎలా తెలుసు?" అని అడిగేను.

"వెనకటిజన్మలో డబ్బు ఉన్నా దానం చెయ్యలేదు కనక ముష్టివాడే. అంచేతే ఈ జన్మలో ముష్టివాడయేడు. ఇప్పుడు ఇద్దామన్నా ఇవ్వడానికేమీ లేదు కనక మళ్ళీ ముష్టివాడుగానే పుడతాడు," అంది.

నేను వదిలిపెట్టలేదు. "అయితే మూడు జన్మలే ఎందుకవాలి? తరవాత కూడా అంతే కావచ్చు కదా," అన్నాను.

"మూడు జన్మలలో దానం చెయ్యనివాడు ఇంకేం చేస్తాడు? ఏ పశువుగానో పుడతాడు," అంది అమ్మ.

ఈ కథ నాకు చాలా నచ్చింది. అంటే పునర్జన్మ, పశువుగా పుట్టడం – వీటివల్ల కాదు. ఈ కథలో ప్రధానాంశం దానం. అదీ నాకు నచ్చింది. హైందవసంప్రదాయంలో మనిషి ఆర్జనలో నాలుగోవంతు దానం చెయ్యమంటారుట. అది కూడా అమ్మే చెప్పింది. తల్లిదండ్రులని పోషించడానికి ఒక వంతు – అది అప్పు తీర్చడం. రెండోవంతు పిల్లల పోషణ అప్పు ఇవ్వడం. మూడోది ఏమిటో జ్ఞాపకం లేదు. నాలుగోవంతు దానం. ఈనాడు సంఘసేవలన్నిటిలోనూ అంతర్గతంగా ఉన్ననీతి కూడా ఇదే కదా.

20 ఏళ్ళక్రితం ఇండియాకి వెళ్ళేను. ఆ ప్రయాణం అంతా కేవలం దేవాలయాలు దర్శించడానికే కేటాయించేను. 16 రోజులలో 18 దేవాలయాలు దర్శించుకున్నాను మా రెండో అన్నయ్య ధర్మమా అని. నాకు అవుసరమైన ఏర్పాట్లన్నీ చేసి, నాతో

తిరిగేడు మాఅన్నయ్య. ఇప్పుడు తిరిగి చూసుకుంటే ఆ ప్రయాణంలో నేను ఆకళింపుకున్నదేమిటో నామమాత్రంగానైనా జ్ఞాపకం రావడంలేదు. ఆ దర్శనాలన్నీ నా మనోఫలకంమీద ఎలాటి ముద్రలూ వేయలేదు. వెళ్ళినచోటల్లా తీసిన బొమ్మలు మాత్రం జాగ్రత్తగా ఓ ఆల్బంలో పెట్టేను. అవి చూసుకుని ఓహో ఇక్కడికి వెళ్ళేను అన్నమాట అనుకోవలసి వస్తోందిప్పుడు. ఇది కూడా ఒక కారణమే నమ్మకాలు అట్టే బలంగా నామీద స్థిరపడకపోవడానికి. ఇంతకీ ఈ ప్రయాణంలో ఒక అనుభవం –

చెప్పేను కదా మాఇంట్లో అన్ని రకాలూ ఉన్నారని. మా పెద్దన్నయ్య పరమ నాస్తికుడు. రెండో అన్నయ్య, నాతో తిరిగినవాడు, నమ్మకాలున్నవాడే కానీ మూఢనమ్మకం స్థాయి లేదు. ఆ ప్రయాణంలో పుణే దగ్గర ఉన్న ఏదో కొండమీద ఆలయానికి బయల్దేరేం. మంచి ఎండలు. పైగా అమెరికా వాతావరణానికి అలవాటు పడ్డానేమో నాకు మరీ కష్టం అయింది. మాఅన్నయ్య చెమటలు కక్కుతున్నాడు. "మనవల్ల కాదులే. పద, వెనక్కి పోదాం," అన్నాను. ఇంటికొచ్చేక మా పెద్దన్నయ్యతో చెప్తే, "ఏం, నీదేవుడు నిన్ను కొండ ఎక్కించలేకపోయేడేమిటి?" అని నవ్వేడు.

నాకు మంచి సమయస్ఫూర్తి కలిగిన సమయాల్లో ఇదొకటి. "ఎంతవరకూ వెళ్ళగలనో, ఎప్పుడు వెనక్కి తిరగాలో తెలుసుకోగల జ్ఞానం ఇచ్చేడు," అన్నాను. వాడు మరి మాటాడలేదు.

ఇంతకీ ఇదంతా ఎందుకొచ్చిందంటే, అనుపమకి నామాటమీద గొప్ప నమ్మకం ఏర్పడిపోయింది గత ఐదారేళ్ళలో. "మీయింటికొస్తే అమ్మగారింటికొచ్చినట్టు ఉంటుంది," అంటుంది. అలా నాకో బాధ్యత ఏర్పడిపోయింది. నిత్యవ్యవహారంలో మా మాటలూ చేతలూ అదే అర్థం స్ఫురింపజేస్తాయి. అంచేతన్నమాట నేను చిక్కులో పడ్డాను. ఏం చెప్పను? ఆ పిల్లకి తెలీదు నాకథంతా పూర్తిగా. సుమారుగా తెలుసు కానీ అట్టే వివరాలు తెలీవు. చెప్పే ఉద్దేశం నాకు లేదు.

స్థూలంగా నా నమ్మకాలు - నిజానికి దేవుడు ఉన్నాడు అని నిర్దుష్టంగా

నమ్మినవాళ్ళతో నాకు పేచీ లేదు. దేవుడు లేడు అని దృఢంగా నమ్మినవారితో కూడా నాకు పేచీ లేదు. ఎవరి నమ్మకాలు వారివి కదా. కానీ నాకు తంటా అంతా దేవుడు ఉన్నాడనో లేడనో నన్ను నమ్మించడానికి ఆరాటపడిపోయేవాళ్ళతోనే అన్నమాట.

పైన చెప్పినట్టు గుళ్ళూ గోపురాలూ తిరిగినప్పుడు నాకు అధికంగా కలిగిన అభీష్టసిద్ధి ఏమీ లేదు. పూజలు మానేసినందున ప్రత్యేకించి వచ్చిన కష్టాలూ లేవు సత్యనారాయణ వ్రతకథలోలాగ. అసలు నాజాతకంలోనే ఉంది "ఈ జాతకురాలికి భుక్తికి లోపము ఉండదు," అని. అలాగే కూటికీ గూటికీ లోపం లేకుండా జరిగిపోతోంది. ఏదో ఒక ఉపయోగం ఉన్నట్టు కనిపిస్తే తప్ప నేను ఏ పనీ చేయను. చేసినా చెయ్యకపోయినా ఒక్కలాగే ఉంటే, చెయ్యకపోవడమే నా మతమూ, అభిమతమూను. మరి ఈ రాతలెందుకూ అని అడక్కు. ఈ రాతల ఉపయోగం దినము గడుపుట లేదా కాలము పుచ్చుట.

నేను పూజలు చేయడం ఎందుకు మానీసేనో అనుపమకి చెప్పాలంటే పైకథంతా చెప్పాలి. ఇంకా చాలా వివరాలు కూడా చెప్పాలి. నేను మాఅమ్మని అడిగినట్టే అనూ కూడా నన్ను అడుగుతుంది కదా. అప్పుడు నేను వాటన్నిటికీ జవాబులు చెప్పాలి. అలా చెప్పుకుంటూ పోవడంలో "నాకు నమ్మకం లేదు కనక నువ్వు కూడా నమ్మకు" అని ఆ పిల్లని నమ్మించే ప్రయత్నం చేస్తున్నట్టు కనిపించదూ? కనిపించి తీరుతుంది. అది కూడా నాకు సమ్మతం లేదు. అంటే నానమ్మకాలకి విరుద్ధం!

"ఆదివారం వినాయకచవితిట. జాలంలో చూసేను."

"పూజ చేస్తున్నావా?"

"నాకు తెలీదు ఎలా చెయ్యాలో. నువ్వేమో పూజలు మానీసేనంటున్నావు," అంది నిష్ఠూరంగా.

"నేను చెయ్యనన్నాను కానీ నిన్ను చెయ్యొద్దు అనలేదు కదా. నేను చేయిస్తాలే. కావలసిన సంభారాలు సమకూర్చుకు రా," అన్నాను.

ఎవరికి ఏం చేస్తే మనశ్శాంతి కలుగుతుందో అది వారు చెయ్యడమే మతములలోకెల్ల ఉత్తమ మతము అని నా మతము. మిగతావన్నీ ఉట్టుట్టి మాటలే.

000

(జనవరి 20, 2016)

# 6. వంటింటి సంబరాలు!

గ్రామము చేత నుండి పరికల్పిత ధాన్యము నింట నుండి శ్రీ
రామ కటాక్ష వీక్షణ పరంపరచే గడతేఱె గాక మా
రామయమంత్రి భోజన పరాక్రమ మేమని చెప్పవచ్చు నా
స్వామి యెఱుంగు దత్కటళ చాతురి తాళ ఫల ప్రమాణమున్.

ఇది శ్రీనాథుని చాటువు. తెలుగువారు భోజనప్రియులు అని ఎక్కడో విన్నాను. ఆ మాటకొస్తే భోజనప్రియులు కానివారెక్కడున్నారు కనక? ఏ ప్రియులైనా కాకపోయినా భోజనప్రియులవడం మాత్రం నిశ్చయం ఏజాతి అయినా గానీ. తిండికి తిమ్మరాజు పనికి పోతరాజు అని ఎందుకన్నారంటే భోజనంలో లోపం చెయ్యడనే. ఏమో, ఆలోచిస్తే తిమ్మరాజుని ఎందుకనడం అని కూడా అనిపిస్తోంది.

ఇంతకీ నాతిండి మాటకొస్తే, నాకు రెండు ఆనవాయితీలు ఉన్నాయి. మొదటిది – నేరుగా తినగలిగింది కూడా దానికి మరేవో నగిషీలు చెక్కకుండా తినలేను. ఆపిలుందనుకో. చాలామంది దాన్ని కడిగి చొక్కాకి రుద్దుకుని – ఇదెందుకు చేస్తారో నాకు తెలీదు కానీ చాలామంది అలా చెయ్యడం చూసేను – కొరుక్కు తినేస్తారు. జాంపండయినా అంతే. నేను మాత్రం తీరిగ్గా ఓ కత్తీ, చిన్న పళ్ళెం తెచ్చుకుని బల్లదగ్గర కూర్చుని, ఆ ఆపిలు తొక్క తీసి, ముక్కలు కోసి, ఆ ముక్కలమీద కొంచెం పంచదారా దాల్చినచెక్క పొడి చల్లి మైక్రోవేవులో పావుగంట ఉడికించి కాని తినలేను. ఈ పద్ధతి సుమారుగా Apple pie లాగే కానీ నాపద్ధతిలో చేసేను కదా. రెండోది – కృష్ణశాస్త్రిగారికి ఉగాదులూ ఉషస్సులూ లేవు. నాకు కొలతలు, తయారీ విధానాలూ లేవు. నాపెనక తరతరాలుగా ఎవరూ ఇన్ని కప్పులు, ఇన్ని గ్రాములూ, ఇంతసేపూ, ఇంత వేడి అంటూ లెఖ్ఖలు కట్టలేదు కదా. చారెడు పప్పు ఉడకబెట్టి చిటికెడు ఉప్పేసి, ఆవాలూ మినప్పప్పూ ఓ మిరపకాయా, ఇంగువా

పోప్పెట్టేస్తే పప్పయిపోయింది. మళ్ళీ పోపేసి కూరముక్కలు ... ఇలాగే కదా. ఇందులో ఉన్న గొప్ప సౌకర్యం ఏమిటంటే ఏ కూరకీ ఒకరోజు ఉన్న రుచి మరో రోజు ఉండదు. ఎప్పటికప్పుడు కొత్త రుచే. అనుపమ రెండేళ్ళగా నావంట తింటోంది కానీ ఒక్కమారైనా సరదాకైనా ఈ కూరేంటి కిందటిమాటు తిన్నకూరలా లేదు అనలేదు. ప్రతి సారీ అబ్బ ఎంత బాగుందో అంటుంది.

ఇంతకీ ఇవాళ తీపీ, కారం వంటకాలు కొలువుకి పూనుకున్నాను. కొంతకాలం క్రితం ఎవరో "రాగిపిండి బలం, తిను" అంటే సరేనని కొనుక్కొచ్చేను. దానికోసం రెండు మూడు దుకాణాలు తిరిగినప్పుడే గ్రహించేను ఏ పొట్లాం చూసినా మిలెట్ పొడి అనే ఉంటుంది కానీ తరవాత తెలిసింది సజ్జ పిండి, రాగిపిండి, జొన్న పిండి అన్నిటినీ వాళ్ళు మిలెట్ అనేస్తున్నారని. ఇంత అకటావికటపు మనుషుల్ని నేనెక్కడా చూళ్ళేదు అని నాలుగు నిముషాలపాటు చిరాకు పడ్డాను. కొన్నిటిమీద రాగి పొడి అని ఉంటుంది ఇంగ్లీషులోనే. ఇహ పోతే నేను చూసిన రోజున ఏది కనిపిస్తుంది అన్నది గ్రహస్థానాలను బట్టీ నా జాతకాన్నిబట్టీ ఉంటుంది. అసలు నిజం - నాకు ఈ గోల్మాలంతా తెలీనినాడు మిలెట్ ఫ్లోరు అని ఉన్న పొట్లం కొనేసేను. తీరా చూస్తే అది సజ్జ పిండిట. తేడా ఏమిటంటే దీనికి చిరుచేదు ఉంది. ఈ విషయమై అనంత పరిశోధనలు చేసీ, అంతర్జాలంలో అనేక ప్రాణమిత్రుల సలహాలు సంగ్రహించీ కొన్ని కొత్త తయారీ పద్ధతులు తెలుసుకున్నాను.

ప్రధానంగా పిండి ముందు వేయించాలి. తరవాత 1. దోసెపిండిలో ఎత్తుకెత్తు కలిపి దోసెలేసుకోవచ్చు. 2. అలాగే అల్లం, పచ్చిమిరపకాయలు, ఉల్లిపాయ, జీలకర్రా దంచి కొట్టి సజ్జపిండిలో కలిపి పకోడీలు చేయవచ్చు. 3. గోధుమపిండిలో కలిపి పూరీ చెయ్యొచ్చు.

నా ప్రయోగాల్లో మొదటిది సజ్జపిండితో తీపి పదార్థాలు చెయ్యడం. కొంచెం వెన్న కాచి, పంచదార పాకం పట్టి అందులో శనగపిండి, సెజ్జ పిండి కలిపి మైసూరుపాకులా తిప్పడం మొదలు పెట్టేను. అది చూడ్డానికి మరీ మట్టిరంగులో ఉంది. తినడానికి ఎలా ఉంటుందో ఇంకా తెలీదు. మందేం పోయింది అక్కడక్కడా

అమావాస్యనాడు చుక్కల్లా తెలుపు కనిపిస్తుంది అని ఓ గుప్పెడు కొబ్బరికోరు వేసి మరోమారు కలిపి దింపేసేను.

అంతా దగ్గర పడ్డాక, పొయ్యిమీంచి తీసి పక్కన పెట్టేను. ఓ అరగంట ఊరుకుని చూస్తే, ఉండలు చెయ్యడానికి తగినంత వేడిలో ఉంది. సరే ఉండలు చేస్తున్నాను కదా, పంటికింద పలుకు తగులుతుంది, ఆరోగ్యం కూడాను అని నువ్వులు అద్దేను.

అన్నట్టు చెప్పడం మరిచేను పళ్ళు ఉన్నంత కాలం వాటికి పని పెట్టాలనే నా అభిమతము. అవి ఊడిపోయేక ఎలాగా గంజినీళ్ళే కదా గతి అని నమలడానికి వీలుగా తీపయినా కారం అయినా చేస్తాను. "చేయు విధానము"లో వాళ్ళు చెప్పినా చెప్పకపోయినా నేను పప్పులు కూడా కలిపేస్తూంటాను.

మరో రకం. పాకం తీసి అందులో పాలపొడి వేసి కోవా చేసేను. ముందురోజు చేసిన సజ్జ మైసూరుపాకుమీద ఈ పాలపాకం పరిచేను చూడ్డానికి రెండు రంగులతో కన్నులపండువు, జిహ్వకి విందూ అని.

 తీపి అయిపోయింది మరి కారం చెయ్యకపోతే ఏం బాగుంటుందీ అని ముప్పై ఏళ్ళగా మూలపడి మూలుగుతున్న బూందిచట్రాలు తీసేను. దుమ్ము దులిపి, తుప్పు కడిగి, శనగపిండి కలిపి పూస కొట్టడం అయేక, జంతికలు చేయ్యకపోతే ఎలా అని జంతికలు చేసేను. పన్లో పని వేరుశనగ గింజలు వేయించి కలిపేను. అవన్నీ చక్కగా ఓ గిన్నెలో వేసి కలిపితే కరివేపాకు లేని లోపం కొట్టొచ్చినట్టు కనిపించింది. కరివేపాకు లేని మిక్స్చరు అంటే నవ్విపోరూ అనుకుని హడావుడిగా బజారుకెళ్ళి కరివేపాకు కొనుక్కొచ్చేను. ఆ ఆకులు కడిగి, తుడిచి, వేయిస్తుంటే ఘుమఘుమలు ఇల్లంతా వ్యాపించేయి. బహుశా పొరుగువారికి కూడా తగిలే ఉంటుంది కానీ ఆ సుమధుర తావి ఆపను ఎవరి తరం అని ఊరుకున్నాను.



నిజంగా ఇది నేను నా వంటింట్లో చేసిన మిక్స్చరు ఈ బూందీచట్రాల సాక్ష్యంగా.

000

(ఫిబ్రవరి 25, 2016)

# 7. బరువు బరువు!

ఏంటో బరువు అనగానే నాకు ఠక్కున గుర్తుకొచ్చేది ఫ్రోయింపకోయి మురళి కృష్ణా ఫ్రోయింపకోయి, తీయతేనియబరువు ఫ్రోయలేదీ బ్రతుకు అన్నపాట. చిన్నప్పుడు రేడియోలో వినేదాన్ని ఎంతో ఇష్టంగా. ఇప్పుడు ఆ బరువుల్లేవు.

ఇప్పుడంతా బరువు బరువంటూ బరువుగురించి పడే ఆవేదనలే ఎక్కడ చూసినా. నేను ఇంతవరకూ బరువుమీద రాయలేదు కొంతవరకూ అరువుమీదా కరువుమీదా రాసేను, అరుపులమీద కూడా కొంచెం గిలికినట్టున్నాను కానీ ఈ బరువుమాట మాత్రం ఇదుగో ఇప్పుడే మొదలు. నిజానికి నాకు ఈ బరువుమీద రాయాలంటే కొంచెం భయం. "నీకేం హాయిగా చీపురుపుల్లలా ఉన్నావు కనక ఎన్నిమాటలేనా చెప్తావు" అని కోపగించుకుంటావు నువ్వు. రెండు మేడలూ, నాలుగు వాహనాలూ, మునిమాపువేళ మూడుగుర్రాలసేవా నోచుకున్న మహారచయితలు బీదల బాధలగురించి కవిత్వాలు రాసినట్టే అని కూడా దెప్పుతావు. హీహీహీ అద్సరే గానీ పుల్లలా అంటే అను గానీ చీపురుపుల్ల ఏమిటి ... ఛీ. సరేలే. అసలు సంగతి నీకు తెలీదు కానీ నాకూ ఉంది బరువు ... నీకు కనిపించనిచోట. అంచేత ఆ ఊసెత్తెకు నాదగ్గర.

మాటవరసకి చెప్పేను కదా బరువులు పలు రూపములలో వచ్చునని - పరువు బరువు, అరువు బరువు, కరువు బరువు. ఆడవారికి నగలే అందం అని కొందరంటే నగలు బరువు అనేవారూ ఉన్నారు. ఎవరిబరువులు వారివి.

వాటన్నిటిసంగతీ ఇప్పుడొద్దు కానీ ఒళ్లుబరువు మాట కొంచెం చెప్పుకుందాం. అసలు నిజం చెప్పాలంటే నాక్కూడా చిరాకే "అందం మనసులో ఉండాలి కానీ మొహంమీద కాదం"టూ ఓదార్చేవాళ్ళని చూస్తే. ఇలా అనేవాళ్ళందరూ ఓ

మోస్తరుగా అందంగా ఉన్నవాళ్ళే. లేదా ఉన్నాం అనుకునేవాళ్ళే అయిఉంటారు. వాళ్ళు కూడా గంటకోమారు బాగున్నానా ఇంకొంచెం చివరి తీర్పులు అవుసరమా అనుకుంటూ అద్దమును సంప్రదించకుండా ఊరుకోరు. చాలామంది విషయంలో అది అసంకల్పంగా జరిగిపోతుంది కూడాను. అందుకే ఆమాట వదిలెయ్

నేనూ ఒప్పుకుంటాను కొందరివిషయంలో స్థూలశరీరం అనేక కారణాలమూలంగా బాధాకరం అవుతుంది. వాళ్ళని నేను తప్పు పట్టను. వాళ్ళు తగు చర్యలు తీసుకుంటే మంచిదే. కానీ పొద్దు పొడిచీ పొడవకముందే లేచి ఆ బరువుమెషీనుకి అతుక్కుపోయి పౌను తరిగేను, పౌను పెరిగేను అంటూ లెక్కలు చూసుకోడం మాత్రం ఆరోగ్యం కాదనే నా అభిప్రాయం.

అసలు బరువూ, ఉరువు గొడవ తెచ్చిపెట్టినవాళ్ళెవరో తెలుసా మరే పనీ పాటూ లేనివాళ్ళు. ఆడవాళ్ళని నిండుకుండమీద మరో కుండ బోర్లించినట్టు ఉండాలనీ, నీటిగడియారంలా ఉండాలనీ తీర్పులు చెప్పింది ఏ మహరాజు ప్రాపకంలోనో పూటుగా ముప్పొద్దులా మూడు కంచాలు చెల్లించి, తూగుటూయలలో ఊగుతూ అరమోడ్పుకనులతో ఆ కాంతామణులని దర్శించుకుని వారిమీద పద్యాలు రాసిన కవులు కాదూ? కళ్ళు అర మూసుకుపోడంచేత ఎదట నిలిచి కప్పురవిడెములు అందించే అన్నులమిన్నలు సగమే కనిపించేరేమో వారికి మరి. మరీ అలిపిరిగా ఉండి ఆ ఆడవాళ్ళు వారి అర కన్నులకి ఆనలేదేమో. అంచేత అలా తమ వర్ణనలతో ఆడవారి ఉరువు వంకరటింకరగా పెంచేసేరు. ఇంకా కొందరు అందగత్తెలంటే సన్నగా చువ్వల్లా గట్టిగా గాలేస్తే ఎగిరిపోయేలా ఉండాలన్నారు. వారిపెంట పడి పాఠకమహాశయులు దానికి వంత పాడేరు. ఇంతలో జెన్నీ క్రేగ్ కంపెనీలు తగులుకున్నాయి. ఇహ ఓప్రా విన్ఫ్రీలు చేరి ఆ సంగీతమే మరింత పైస్థాయిలో కాకలీస్వనంలో పాడుతున్నారు.

అంతెందుకూ, మన గుడిగోడలమీద నాట్యకత్తెలూ గర్భగుడిలో అమ్మవారూ అందరికీ - అవే బరువులు కదా. ఆ శిలామూర్తులేవీ గాలికి ఎగిరిపోయేట్టుండవు. గుడిలో మూలపీఠం అధిష్ఠించిన రాజరాజేశ్వరీ విగ్రహం పటిష్ఠంగా గంభీరంగా

వర్ణనలకందనంత హుందాగా ఉంటుంది కానీ రివటలా కాదు కదా. కొన్ని శిల్పాలు చూస్తే జపాను సుమో మల్లయుద్ధవీరులని జ్ఞాపకం తేవూ? బాలాత్రిపురసుందరి, కన్యాకుమారి - వీరివి సూక్ష్మశరీరాలేలే. సూక్ష్మంగా ఒక్కమాటలో గత రెండు వేల సంవత్సరాలలోనూ గాలిబుడగలా అనన్యసామాన్య వంపులు పుంజుకున్న సౌందర్యము యొక్క చరిత్ర ఇదీ.

మాటవరసకి అడుగుతున్నాను. తెల్లారి లేచి మొహం కడుక్కుని, కాఫ్యాదులు సేవించి వీధిలోకి బయల్దేరేముందు ఎవరైనా ఆడ గానీ మొగ కానీ మరోమారు అద్దంలో చూసుకోకుండా వెళ్తున్నారా లేదా? ఎందుకంటే ఎలా కనిపిస్తాం అన్నది ప్రధానం. అయితే దానికోసం అన్నపానాదులు మానేసి రాత్రీ పగలూ దిగులు పడిపోతూ కళ్ళబడ్డ ప్రతి ఉపాయం, వినిపించిన ప్రతి సలహా అనుసరించాలా అన్నప్రశ్న ప్రస్తుతం ఆలోచించాలి. ఈ విషయం మనం అందరం సుదీర్ఘంగా కొన్ని నెలలపాటు మహోధృతస్థాయిలో తర్కవితర్కాలూ సాగించాలి. అలా తర్కించడంలోనూ, తర్కించడానికి ఉద్యుక్తులవడంలోనూ బుద్ధీ కాలమూ వెచ్చించబడి, బరువుమీంచి మన మనసు మరలిపోతుంది. ఇది ఒక ఉపాయము.

మాటొచ్చింది కనక నా డైటు ప్లానులు కూడా చెప్తాను.

మొదటిది - నాకు తినాలనిపించినప్పుడు పుష్కలంగా నిర్మొహమాటంగా నెయ్యీ పంచదారా ఉక్కిరిబిక్కిరి చేసేంతగా వేసి చేసిన తీపిమిఠాయిలు తనివి తీరా తినేస్తాను. అప్పుడు మొహం మొత్తేసి మళ్ళీ ఆర్నెల్లపాటు వాటివేపైనా చూడ్డానికి మనసు రాదు.

రెండోది - ఈ ఉపాయం చాలామందికి చాలా తేలిక అనే అనుకుంటున్నాను. నన్ను ఓ మనిషి నొప్పించేడనుకో. వాణ్ణీ వాడి ప్రవర్తననీ ఒక్కమారు తలుచుకుంటే చాలు మరింక ఆ దెబ్బతో అన్నపానీయాలు సయించవు. ఆ మహానుభావుడే నా డైటు ప్లాను. నిన్ను నొప్పించినవాడు ఇంకా పుట్టలేదంటావా. సరే. నామటుకు ఎవడో ఒకడు ఎక్కడో అక్కడ పుట్టే ఉంటాడనే నా నమ్మకం.

మరీ అంత కరువైతే, ఓ జాలమందలోనో చేరిపో. ఇనుమిక్కిలి ప్రసిద్ధుడైన మహా

రచయితనో నాయకుడినో వినాయకుడినో విమర్శపేరుతో ఓ పుల్లవిరుపుమాట పారేస్తే సరి. క్షణాలమీద కొంపలంటుకుపోతున్నట్టు ముప్ఫైమంది బరిలోకురికి ఈకకి ఈక పీకి నిన్ను ఉతికి ఆరేసేస్తారు. అంటే తలా తోకా లేని ఒక వితండవాదము మొదలు పెట్టాలి. ఇదీ రెండో ఉపాయము.

అయ్యో, ఎక్కడో మొదలు పెట్టి ఎక్కడో తేలడం మ్ నాకిది మామూలయిపోయినట్టుంది. బరువుగురించి బరువైన ఆలోచన చేసి, మిడిమిడి పాండిత్యం ఒలకబోస్తూ ఏవో రెండు అద్భుత సూచనలు ఇద్దాం అని మొదలు పెట్టేనా ప్చ. బహుశా చెప్పడానికేం లేకపోవడంచేత అనుకుంటా ఇలా పనికిమాలిన కబుర్లు దొర్లుకొచ్చేయి. క్షమించవలెను.

000

(మార్చి 7, 2015)

# 8. నేనూ రాసేను ఓ పద్యం!

నాకిది మరో ప్రస్థానం. చాలా కాలంగా పద్యం ఎలా రాయాలి అన్న అంశంమీద ఏ బ్లాగులోనో జాలపత్రికలోనో వ్యాసాలు కనిపించినప్పుడల్లా ఒస్ ఇంతేనా అనుకుని ఓ రెండ్రోజులు కుస్తీ పట్టడం, తరవాత చూద్దాంలే అనుకుని వదిలేయడం జరుగుతూ వచ్చింది. సాధారణంగా ఏ పనైనా చేతనయినవారికి ఆ పని చేయలేనివారి బాధ అర్థం కాదు. వ్యాసాలు ఒస్ ఇంతేనా అనిపించేలా ఉంటాయి కానీ చేతకానివారికి అదొక యజ్ఞం. ఇది నిత్యసత్యం.

ఈమధ్య ఇటు బ్లాగులోనూ అటు ముఖపుస్తకంలోనూ పద్యాలు విపరీతంగా కనిపిస్తున్నాయి. వాళ్ళందరూ అవలీలగా మంచినీళ్ళప్రాయంగా రాసేస్తున్నట్టు అనిపించి, నాకు మాత్రం ఎందుకు రాదూ అని పౌరుషం పొడుచుకొచ్చింది. ఇక్కడ మరోసంగతి కూడా ఒప్పుకోవాలి. నాకు ఏ సాహిత్యతెగులు తగిలినా నాముఖపత్రంలో చెప్పుకుంటే తెలిసినవారు చక్కని చిట్కాలు ఇస్తారు సాదరంగా.

ఆ విధంగా నా సరదా తీరింది పది రోజులక్రితం. నా ముఖపత్రంలో "సూర్యగణం, చంద్రగణం, యమాతారాజభానస లాటి సూత్రాలఊసు లేకుండా పద్యం రాయడానికి అడ్డదార్లేమైనా ఉంటే చెప్పమ"ని అడిగేను. నాసంగతి తెలిసినవారు మంచి సూచనలు కొన్ని ఇచ్చేరు. కందపద్యం, తేటగీతికి కావలసిన ఛందస్సు సూక్ష్మంగా ఇచ్చేరు. సుమారుగా ఓ టెంప్లేటు అనుకోవచ్చు. వేమన, సుమతి శతకాలు, పోతన భాగవతంలో పద్యాలు చదివి నడక ఎలా సాగిందో పరీక్షించి చూసుకుంటే తేలిక అవుతుందని కూడా చెప్పేరు.

మళ్ళీ జీవితంలో రెండోసారి "ఒస్ ఇంతేనా" అనుకుని పన్నెండోసారి పద్య అక్షరాభ్యాసం చేసేను లాపుటాపు ఒడిలోకి తీసుకుని. అప్పుడూ అసలు కిటుకు

తెలిసింది. అదేమిటంటే నాకు కథలూ, కబుర్లూ, వ్యాసాలూ రాయడం కదా అలవాటు. అంచేత ఏ విషయంమీద పద్యం రాయబోయినా ... అసలేం జరిగిందంటే, చెప్పొచ్చేదేమిటంటే లేదా అనగా అనగా ఒక ఊళ్ళో - ఇలా వస్తున్నాయి వాక్యాలు. కథకి క్లుప్తత కావాలంటారు కానీ పద్యానికి ఇంకా చాలా చాలా క్లుప్తత కావాలి. ఒక పాదం రాసేననుకుని చూసిన ప్రతిసారీ కథకి పనికొచ్చే వాక్యమయి తేల్తోంది.

పద్యం మొదలు పెట్టడం అలా కాదని తెలుసుకోడానికి రెండు పూటలు పట్టింది. ఇది ప్రథమ తప్పు. రెండోది ఏ అంశంమీద రాస్తాం అన్నది కూడా చాలా నిశితంగా పరీక్షించి చూసుకోవాలని తెలియడం. చెప్పేను కదా ఏ విషయం తలుచుకున్నా చెప్పవలసింది బోలెడు ఉండి కనీసం ఒక పేజీ పట్టేటట్టుంది. అది నాలుగు పాదాల్లో ఇరికించడం ఎలా? స్వతస్సిద్ధంగా కవులయినవారికి ఇది చాలా తేలిక కావచ్చు. కానీ నాలాటి కొత్త బిచ్చగాళ్ళకి మాత్రం కొంత శ్రమ తప్పదు ఏ కబురు నాలుగు పాదాల్లో ఇరికించగలం, అది చదివేవారికి కొంతలో కొంతైనా ఇంపుగా ఉందునా లాటివి గ్రహించడానికి.

సరే ఈ పద్యరచన సంగతి ఇంకొంచెం ఎక్కువ తెలుసుకుంటే మంచిది అనుకుని అంతర్జాలంలో వెతికేను. చాలా వ్యాసాలు ఒస్ ఇంతేనా అనిపించేలాగానే ఉన్నాయి. రాత మొదలు పెట్టేసరికి కథ మామూలే. అలా కొన్ని కుస్తీపట్లు పట్టి ఓ పద్యం పూర్తి చేసేను. కానీ అది సరిగా ఉందో లేదో తెలియాలి కదా. కిటుకులు చెప్పిన స్నేహితులనే మళ్ళీ అడగడానికి మొహమాటం. ఏదో చిట్కాలంటే చెప్పేం కానీ నీ పద్యాలన్నీ దిద్దుకుంటూ కూర్చోడానికి మాకేం పన్లేదా అని వారు అనరు కానీ వారిని అలా అనిపించవలసిన స్థితిలో పెట్టడం నాకే భావ్యం కాదు.

అలా ఆలోచిస్తూ మళ్ళీ జాలంమీద పడ్డాను. ఇదేదో నాకోసమే అన్నట్టు ఒక మంచి వనరు దొరికింది పేదకు పెన్నిధివలె. ఆ సైటు http://chandam.apphb.com/. పద్యరచనకి కావలిసిన అనేక అంశాలు సూక్ష్మంగా వివరించడమే కాక రాసిన పద్యాలను సరి చూసుకోడానికి వసతి ఏర్పాటు చేసేరు. అంటే మనం రాసిన పద్యం అక్కడ పెట్టెలో పెడితే, గణాలలెక్క, గురువులూ, లఘువులూ అన్నీ ఎక్కడ సరిగా

లేవో స్పష్టంగా ఎత్తి చూపుతుంది. ఆ పెట్టెలోనే మనం దిద్దుకుంటూ సరిచూసుకుంటూ పోవచ్చు. నిజంగా ఈ సైటు నాకొక వరమే. ఆ సైటు నిర్వాహకులకు నమోవాకములు.

అలా మిత్రులు ఇచ్చిన కొండగుర్తులతో నాలుగు పాదాలు రాసి, పైన చెప్పిన ఛందస్సు సైటులో సరి చూసుకుని పద్యం రాసేసేను అనిపించుకున్నాను. ఇది నామొదటి పద్యం.

అల సాగినశాఖ కొనలు

వాలిచి శిఖ అందుకొమ్మనె మధు రుచితరము

పులకము చేరె ముదమునన్

అల ఆతిథ్యము అందముగా అమరె గదా

ఈ పద్యానికి స్ఫూర్తి నేను రోజూ నడిచే దారిలో కనిపించిన ఒక మొక్కా, దానిమీద తిరగాడుతున్న తేనెటీగలూ. ఎటొచ్చీ మర్నాడు నేను కెమెరా పుచ్చుకు ఆ బొమ్మ తీద్దాం అని చూస్తే, తేనెటీగలు శలవులో ఉన్నట్టున్నాయి ఒక్కటి కూడా కనిపించలేదు.

నా తొలిపద్యం ముఖపత్రంలో ప్రచురిస్తే మిత్రులు బాగానే ప్రోత్సహించేరు. నాకే అంత తృప్తిగా లేదు. అంచేత నా ప్రయత్నాలు కొనసాగించడానికే నిశ్చయించుకున్నాను.

నా రెండో పద్యం

చెన్నుమీరంగ నీపోస్టు చదవకున్న

కన్నులారంగ బొమ్మలు చూడకున్న

అన్న చక్కని గానము చేయకున్న

ఎన్ని పోస్టులు పెట్టిన పెతయె గాదె

పేరే చెప్పక్కర్లేదు కదా ఇది ముఖపుస్తకంగురించే అని.

ఈ రెండు పద్యాలూ అయేక ఇంక రాయనవనుకున్నాను కానీ ఛందస్సు సైటు చూస్తే మాత్రం నాకు భలే సరదాగా ఉంది. ఆ హుషారులోనే మరో రెండు కూడా రాసేసేను.

ఎందుకొచ్చిన రంధి యమ్మే బియేలు
పొందుగ చదువు ముఖపుస్తకం టపాలు
చెప్పును కథలూ కవితలూ చూపు పూలు
మీరు ఇచ్చిన ఒక లైకు మోదము మరి

కానీ, మరోమాట కూడా ఇక్కడే చెప్పుకోవాలి. ఇలా గణాల్లోనూ యతిప్రాసల్లోనూ గురువులూ లఘువుల్లోనూ నాఆలోచనలు ఇలా ఇరికించేడం అంతగా నచ్చలేదు.

నాకెలా తోస్తే అలా రాసుకుపోవడమే హాయిగా ఉంది. అవి చదివి ఆమోదించేవారు ఉండడం నా అదృష్టం.

చిన్న సూచన. కొత్తగా పద్యరచన చేయాలనుకునేవారికి మరో మంచి వనరు కంది శంకరయ్యగారి http://kandishankaraiah.blogspot.com/. ఇక్కడ చాలా చక్కగా వివరించేరు శంకరయ్యగారు. వారికి నమోవాకములు.

---

(మార్చి 12, 2016)

# 9. పరువు తీసీసినాది బాబో!

గల గల నవ్వుతూ వచ్చింది సంధ్రాలు.

"ఏంటి సంగతి, అంత నవ్వుతున్నావు?" అన్నాను.

"ఆ బాబు," అంటూ మరి కొంచెంసేపు నవ్వి, "ఆరి పరువు పోనాదంట," అంది, నాపక్కనే చతికిలపడుతూ.

"అసలేంవయిందో చెప్పరాదా," అన్నాను చిరాకు నణుచుకుంటూ.

"ఏటయినాదంటే మామావ అదె మా అప్పమొగుడు ఆడిసేత ఆర్నెల్లు సాకిరీ సేయించుకు కూలీయినానికి గింజుకుంతన్నడాబాబు."

"ఇస్తార్లే. ఇవ్వకేం చేస్తారు, కాస్త ముందూ వెనకా అంతే," అన్నాను సద్ది చెప్తూ.

"ఉన్నోళ్ళందురికీ అదే రోగం. మస్సేత పనేంవో సేయిచ్చుకుంతరు సిటవంత దోకా రారాదందల. పన్సేయిచ్చుకోనానికున్న ఉసారు డబ్బులిదల్చనానికుండదు. మనకే నిరవాకం సేత్తున్నట్టె నానుస్తరు." అవును. నేనూ చూసేను ఈ ధోరణి. వాళ్ళపని కావల్సినంతసేపూ ఉత్తరాలమీద ఉత్తరాలు గుప్పిస్తారు "ఏదీ, ఇంకా కాలేదా, ఇంకా కాలేదా?" అంటూ. నేను కూడా పడ్డాను అలాటివాళ్లవాత. వాళ్ళవంతు పని వాళ్ళు చేయడానికి, అదే డబ్బు ఇవ్వడానికీ మాత్రం ఎక్కడలేని ఆటంకాలూ ఎదురవుతాయి.

"అసలేంవయింది?" అనడిగేను మళ్ళీ.

పెద్ద మేస్త్రీ సంధ్రాలు అక్కమొగుడిచేత ఆర్నెల్లు పని చేయించుకున్నాడు. పని పూర్తి చేసి మరో ఆర్నెల్లయింది. మొదట్లో ఓ నెలరోజులపాటు ఇదుగో అదుగో

అంటూ బులిబుచ్చికబుర్లు చెప్పి కాలక్షేపం చేసేడు. ఆ తరవాత కిమిన్నాస్తి. అయిపు లేకుండా పోయేడు. ఇంటికెళ్తే ఇంట్లో ఉండీ లేడని చెప్పిస్తాడు పెళ్ళాంచేత. ఆఫీసుకెళ్తే కాంపుకెళ్ళేడంటారు. ఊళ్ళో మరెవళ్ళో పెద్దోళ్ళొచ్చేరు, వాళ్ళకి తైనాతి పనుల్తో సరిపోతోంది, నాకష్టాలు ఇన్నిన్ని కావంటూ ఎదురు ఆయనగారి కష్టాలు కచేరీ పెడతాడు.

"మాకు రావాల్సిన రొక్కం మాకీడం మాత్తరం ఆరి పని గాదా అంటాది మాయప్ప," అంది సంధ్రాలు.

"ఇంతకీ నవ్వెందుకొచ్చిందో చెప్పేవు కావు."

"ఏటంటే మాయప్పకి మాసెడ్డం కోపం వచ్చీసినాది. ఆర్నెల్లూరుకున్నారిద్దరూను. ఎంతకాలం ఊర్కొంతరు ఎవురు మాత్తరం. మాయప్ప కత రాసీసినాది. దాంత తల తరిగి నోట్లోకొచ్చినాదంట ఆ బాబుకి. పరువు పోసాదంట తైతక్కలాడతన్నడంట," అంది సంధ్రాలు మళ్ళీ గలగల నవ్వుతూ.

"అందులో నవ్వడానికేం ఉందీ?" అన్నాను నేను చిరాకునణుచుకుంటూ.

సంధ్రాలు వెంటనే మొహం గంభీరంగా పెట్టి, "అంతేలె నవ్వానికేంవుంది. నవరాదు," అంది.

సంధ్రాలు మొహం చూస్తే నాకు నవ్వాగలేదు.

"నీకు నవ్వులాటగా ఉంది కానీ పాపం ఆబాబుకి మిగతా ఉద్యోగులముందూ. ఆయనచేతికింద పనిచేసేవారిముందూ అవమానం, పెద్దోళ్ళదృష్టిలో చిన్నతనం అయిపోదూ," అన్నాను ఆ పెద్దమనిషిని తలుచుకుని జాలి పడుతూ.

"సూడు బుల్లెమ్మా. నీకోపాలి సెప్పేను. నామాట గాదులె. మీయమ్మ అంటా ఉండీది. జలమెత్తినాంక పెతివోడికీ ఓ దరమం ఉన్నాది. ఎనకటి టయాం ఏరు. నీకింకా తెలవదు, వొప్పట్ల ఎవురిపని ఆరు సేసుకుపోడంపే. నీపనీ నాపనీ అన్నేదు. ఎవురికి ఏది సేతనైతే అది సేసీవోరు. అందురూ సుకంగా ఉండీవోరు. ఒకమ్మకో ఒకబ్బకో కస్టం వొస్తే అందురూ తలో సెయ్యీ ఏసి కాసుకునీవోరు.

ఉప్పుడేంవో డబ్బే నోకంవయిపోనాది. ఆబాబు వెందుకు అలా గిలగిల్లాడిపోనాడు. ఆరిజోటులనుంచీ ఇయట్నేదు గంద. నాను సెప్త. ఆబాబుగోరి పరువేదో డామీజీ అయిపోనాదన్నాడంట. పరువూ సేదు సింతకాయా సేదు. ఓరయిన పెస్నిస్తె ఏమి సెప్తరో నాకు తెల్దేటి. మాయప్పకి అరదం కానేదంతరు. బేంకు కాతాల ఏదో తకరారొచ్చినాది, అందుసేత ఆలీసం అయిపోనాదని సెప్తన్నరు బయటోల్లతోనీ. మాక్కూడ సెప్పినర్లే తకరారొచ్చినాది, నీకు డాపుటిస్తం అనీ. నిజం ఏటంటే ఆ డాపుటు బేంకోల్లు ఈరికిచ్చి రెన్నెల్లు పయినయిపోనాది. ఆడాప్టు తలకిందెట్టుకుని తొంగున్నారు రెన్నెల్లగ. మాయప్ప కత రాసీసీనాంకే పతిర్కల అందురూ సదివినాంకే మాకు ఆ డాపుటిచ్చినారు. ఎనకటికి ఈయన్లాటి పెద్దమ్మే ఏలిమీన గోరు మొలిసింది ఏరుండు మగడా అందంట. ఈరు సెప్పే వొంకలు అనాగుంటయి. నాననీదేటంటె కూలిపని సెయ్యం మాదరమం అవుతె ఆ పనికి ఇలువిచ్చి పైసలు మాసేతల ఎట్నం ఆరి దరమం. కూటికి లేనెదవ ఆడేటి సేస్తడులె అని మమ్ముల్ని నిర్లచ్చెం సేసేస్తె మాం ఊరుకుంతం అనుకున్నడు. ఊరుకున్నం ఓపినంత కాలం. కానీ మాం మాత్తరం వెంతదనుక కుక్కిన పేలల్ల పడుంటం. తీరటం సేదని ఆరు జీతం డబ్బులు తీస్కోనం మానీసేరేటి? టంచనుగ నెల తిరిగీతలికి ఉచ్చుకోనం సేదా? ఆరి అవుసరాల్లాటియే మా అవుసరాలూ గాదా?”

సంద్రాలు గుక్కతిప్పుకోడానికి ఆగింది. నాకు ఆవిడ మాటలు సబబుగానే ఉన్నాయి. మరేవో పనులొచ్చేయనడం సబబు కాదు మరి. పది రోజులు కాకపోతే నెల రోజులయితే సరే అనుకోవచ్చు. ఆర్నెల్లపాటు ఉలుకూ పలుకూ లేదంటే ఎవరికి మాత్రం మండదు?

“అసల్కి మాయప్పకి మహా కోపం వెందుకొచ్చీసినాదంటే ఊర్ల పెద్దలొస్తన్నరు. ఒందమంది వస్తరు. ఆరందరికీ అరణ్యమెంటులు సేస్తన్నం. అందుసేత టయాం లేదన్నారంట. ఆరి పెద్దరికం ఆరికే ఉణ్ణి. మాకు రావాల్సినయి మాకీడం కూడా అనాటి పనే అని ఆరికి తెలియాల. ... సంద్రంలో ఎన్నో సేపలు సూసినా సిన్నయీ పెద్దయీ గూడ. నివ్వూ సూసినవ్ గద. ఎంత సిన్న సేపయిన గేలానికి సిక్కితే

గిలగిల్లాడతాది. అది గిలగిల్లాడితే అలల్లేస్తయి. అలల్లేసినయని నివ్వు లబలబాడితె ఏటి నాబం. ఎంత సిన్న సేపయినా గిలగిల్లాడిత అలల్నేస్తయి. అది నివు మనసున ఎట్టుకోవాల," అంది లేచి వెళ్ళిపోతూ.

సంధ్రాలు మొహం అటు తిప్పుకుని ముసిముసి నవ్వులు నవ్వుకోడం నాదృష్టి దాటిపోలేదు. అవును మరి, ఎంత చేపయినా అలలు రేపగలదు. అలా అలలు రేపగలిగినందుకు మురిసిపోగలదు కూడా. దాని అస్తిత్వానికి అదే బలం మరి!

000

(మార్చి 3, 2016)

# 10. కుట్టుమిసను యవ్వారం!

కుట్టుమిషను చూస్తే నాకు పుట్టింటికెళ్ళినట్టే ఉంటుంది. నాచిన్నతనంలో ఆడపిల్లలున్న ఇంట్లో వీణా వైయొలినులాగే కుట్టుమిషను కూడా సర్వసాధారణమైన పరికరం. కుట్టుమిషను అవతారించే మరో చోటు కథలు. బతుకుతెరువుకోసం కుట్టుమిషను పెట్టుకునే ఆడవాళ్ళూ, ఆరుగులమీద కుట్టుమిషను పెట్టుకునే సాయిబులు కూడా చాలా కథల్లో చూస్తాం. మాయింట్లో నాచిన్నప్పుడు మాఅక్కయ్య నా పరికిణీలూ, గౌన్లూ కుట్టేది. పెద్దయాక నాకంటూ ఓ ఇల్లు కుదిరేక నాజాకట్లన్నీ నేనే కుట్టుకుంటూ వచ్చేను. మళ్ళీ మాఅమ్మాయికి మూడేళ్ళవరకూ కొన్ని గౌనులు కుట్టేను. ఆ తరవాత బజారులో షోకైన డ్రెస్సులు (ఇక్కడ గౌను అనరు, డ్రెస్ అనే అనాలి) కనిపించేక అవి మాత్రమే వాడుతూ వచ్చేను.

కొన్ని దశాబ్దాలయేక ఇప్పుడు మళ్ళీ కుట్టుమిషను తీసేను. మళ్ళీ అని ఎందుకంటున్నానో తరవాత చెప్తాను.

మొదట మీకు జ్ఞాపకం చేయవలసింది ఇంట్లో ఏ వస్తువు కనిపించినా దాన్ని ఏదో ఓ రకంగా మార్చకపోతే నాకు చెయ్యి విరుచుకున్నట్టుంటుందని. ఉన్నదాన్ని ఉన్నట్టు ఉంచలేకపోవడం నా దౌర్బల్యం.

ఆర్నెల్ల క్రితం ఓ బొంత కొన్నాను. కొన్నవెంటనే చూడలేదు కానీ క్రమంగా కొన్నాళ్ళకి అర్థం అయింది నేను నాకు కావలసినదానికంటె చాలా పెద్దది కొన్నాను అని. ఇక్కడ ఇదో బాధ. ఏ వస్తువు చూసినా చాలా సూక్ష్మంగా ఏదో ఒక్క వాడుకకి మాత్రమే ఉండేలా తయారు చేయబడి ఉంటాయి. వంకాయకో కత్తీ, ఉల్లిపాయకో కత్తీ, అల్లం తరుక్కోడానికి మరోటీ, దారం తెంపుకోడానికి కత్తి కాదులే మరేదో ...

ఇలా ఉంటాయి. అంచేత నేను నాకు కావలసిన మట్టు గొంగళీ కనిపించిందని కొనేసేను కానీ అది నామంచంకంటె పెద్దసైజుకి కూడా పనికివచ్చును అని గ్రహించలేదు. అయితే ఏం అని అడుగు చెప్తాను.

రోజు పొద్దున్న లేచేక, దుప్పట్లు, తలగడాలూ మళ్ళీ చూడచక్కగా అమర్చుకోవాలి కదా. నాచిన్నప్పుడు పరుపు చక్కగా చుట్ట చుట్టేసి ఓ మూల పెట్టేసేవాళ్ళం. హాయిగా క్షణాలమీద అయిపోయేది. ఇప్పుడలా కాదు. ... సరేలే ఇప్పటి కర్మకాండ నీకు కూడా తెలుసు కదా. ఆ దుప్పట్లూ, తలగడాలూ సరి చేసి, ఈ బొంత సరిగా దానిమీద పరిచేవేళకి నాకు పావుగంట బస్కీలు తీసినంత పనవుతోంది.

"బాగే. కండ పడతాది."

హాహాహా కండ పట్టకేం, నాకసలే ఆకలెక్కువ. ఆరు గంటలనించి పన్నెండువరకూ తింటూనే ఉంటాను. నీమాటే సరి అనుకుంటే నేను పక్క సర్దడం పన్నెండు తరవాతే కావాలి.

"మిసనుమాట చెప్పేదున్నాదా ఇప్పట్ల, పైయేటిదనుకా సాగుతావా?"

అయ్యయ్యో, లేదు, లేదు. చెప్తాను. మళ్ళీ మిషను తీసేను.

"మల్ల అంటన్నవు, మునుపో పాలి తీసేవేటి?"

ఆఁ. తెచ్చేను ఆగదిలోంచి ఈగదిలోకి ఈగదిలోకీ ఆగదిలోకీ, ఢిల్లీనించి దేవగిరికీ దేవగిరినించి ఢిల్లీకీ ..

"పిచ్చి తుగలకునాగా."

నువ్వు మరీ అలా మాటల్లో చెప్తే బాగులేదు. నేనేం చేసినా ఓ పద్ధతిగానే చేస్తాను.

"సర్లో. ఏటా పద్దతి?"

అలా కుట్టుమిషను ముందుగదిలో బల్లమీదకి తీసుకురావడం ఒక మెట్టు. సత్యవారాయణవ్రతవిధానంలాగే ఈ కుట్టడం కూడాను. దానికో పద్ధతి ఉంది. మొదట సంకల్పం. ఏదో ఒకటి కుట్టాలి అనుకోడం. ఆ తరవాత మిషను తెచ్చి

ముందుగదిలో బల్లమీద స్థాపన చేయడం. మామూలుగా ఏమిటి కుట్టడం అన్నది కూడా ఈ మెట్టుతరవాతే జరుగుతుంది కానీ ఈమాటు మాత్రం మొదట్లో చెప్పిన బొంత పొడుగు తగ్గించడం అన్నది నిర్ణయం అయిపోయింది.

అలా ఆ మిషను, బొంత ముందుగదిలో భోజనాలబల్లని తాత్కాలికంగా కుట్టుమిషనుబల్లగా మార్చి కాఫీ తరవాత, భోజనం చేసిక, ముఖపుస్తకంలో రెండు తెరపట్లు చూసిక, వీధిలో కొంచెంసేపు తిరిగొచ్చి, పొద్దున్న మధ్యాహ్నం. సాయంత్రం అనుకుంటూ రెండు రోజులు గడిపేను. ఆఖరికి, నేను మిషనుముందు కూర్చుని కుట్టుపని మొదలుపెట్టే ముహూర్తం వచ్చింది.

బొంత కత్తిరించేక అంచు మడతపెట్టి కుట్టాలి కదా. అంత మందం నామిషను కుట్టగలదో లేదో అనుకుంటూ మొదలు పెట్టేను కానీ నన్ను ఆశ్చర్యపరిచేసి, మిషను తేలిగ్గా వంకాయమీద కొత్తకత్తిలా సురసుర జారిపోయింది. మొత్తం పని మూడు నిముషాల్లో అయిపోయింది. ఒస్, ఈమాత్రానికేనా ఇన్ని రోజులు ఆరాటపడ్డాను అని కొంచెంసేపు విచారించేను.

ఆ ఊపులోనే కత్తిరించేసిన రెండో ముక్కవేపు చూసేను. ఆ ముక్క నన్ను ఊరికే పారేస్తావా అని జాలిగా నావేపు చూసింది. నా మనసు గోదావరిలా ద్రవించేసింది ఆ చూపుతో. కొంచెం ఆలోచించి రెండు చిన్న తలగడాలు అవుతాయి, చేతికి దన్నుగా పనికొస్తాయి అని నిర్ధారణ చేసేను. మరి తలగడ అంటే దాన్లో కూరిపెట్టడానికి దూది కావాలి కదా. టార్గెట్టులో హస్తకళలకి పరికరాలు ఉంటాయని వెళ్తే దూదికట్టలు లేవు. ఇదేం ఊరో అనుకుంటే తిరుగుతుంటే తలగడాలు కనిపించేయి. పట్టుకు చూస్తే మెత్తగా బాగున్నాయి. సరే ఓ తలగడా కొనుక్కొచ్చి, అది చింపేసి ఆ దూదితో రెండు చిన్న తలగడాలు తయారు చేసేసేను. ఇవన్నీ గబగబా అయిపోయేయి.

ఇప్పుడు మరో చిన్న ముక్కలు రెండు మిగిలేయి. వాటిని పరిశీలించి చూస్తే ఒక టీకోజీ తయారు చేయొచ్చు అనిపించింది.

"నీకు టీముంత సేదు గద, అదెందుకు?"

ఏం చేస్తాం, టీముంత కొనుక్కోవాలంతే.

"గోసీపాత పదిలం సేస్కోనానికి లంపటాలు తగిలిచ్చుకున్న సన్నాసినాగ," సంధ్రాలు నవ్వింది.

సంధ్రాలు నవ్వితే నాకు ఉక్రోషం వస్తుంది. టీకెటిలు కొనుక్కుంటే తప్పేంటి, ఎవరైనా ఇంటికొచ్చినప్పుడు పనికొస్తుంది కదా.

"నివ్వు ఎవుర్నీ రానీవు గద."

చటుక్కున మరో ఆలోచన వచ్చింది. టీకెటిలు కాదు. ఇక్కడ చలికాలంలో ఇంట్లో హీటు పెట్టుకున్నా, ఇడ్లీ పిండి పులియడంలేదు. ఈ ముక్కలు ఆ గిన్నెమీద టీకోజీలగే కప్పితే వెచ్చగా ఉండి పిండి పులుస్తుందేమో అనిపించింది.

ఆ తరవాత మిషను మళ్ళీ పక్కగదిలో యథాస్థానానికి మార్చడానికి మరో నాలుగు రోజులు పట్టింది. అలా దానిస్థానం మార్చేలోపున మరో విషయం గుర్తొచ్చింది. దాదాపు పదేళ్ళగా నా దుస్తులలో పొడుగు తగ్గించుకోవలసిన కాళ్ళూ, చేతులూ, తొలగించుకావాలనుకున్న కాలర్లు - వీటికి కూడా కాలం వచ్చిందని నిర్ణయించి ఆ పనులు మొదలు పెట్టేను. ఏదైనా ఆరంభించడం కష్టం కానీ ఆ తరవాత అవి పూర్తి చేసేవరకూ తోచదు నాకు. మొత్తంమీద అవి కూడా అయిందనిపించేసి, కుట్టు మిషనుని యథాస్థానానికి తరలించేసను. బహుశా మరో పదేళ్ళవరకూ దానివంక చూడకపోవచ్చు నేను.

000

(మార్చి 28, 2016)

# 11. మర్యాదా మప్పితమూ

మనకి మర్యాదలు ఎక్కువ అనుకుంటాం. కనీసం అనుకునేవాళ్ళం. పిల్లలు పెద్దలకి ఎదురు చెప్పకూడదు. పిల్లలని పెద్దలు ప్రేమాభిమానాలతో బుద్ధులు గరుపుతూ పెంచాలి కానీ కసుర్లూ విసుర్లూ కూడదు. కానీ ఆ రోజుల్లో కసురుకున్నా విసుక్కున్నా అభిమానంతోనే, వాళ్లమంచి కోరే అంటూ సమర్థించుకుంటారు.

కానీ ఈమధ్య బహుశా గత ముప్పై ఏళ్ళలో ఆధునీకరణ ప్రపంచీకరణ పెచ్చు మీరినకొద్దీ ఆ ఆలోచనలకి గంట్లు పడుతూ వస్తున్నాయి. ఇప్పుడు పిల్లలు పదేళ్లు దాటీ దాటకముందే అమ్మనీ నాన్ననీ నువ్వెంత అనే స్థితికి ఎదిగేరు. ఏమంటే ఇంగిలీసు బళ్ళలో ఇంగిలీసు బొక్కులు చదువుకుని నేర్చుకున్న పాఠాలు అంటారు గిట్టనివాళ్ళు. ఇంగిలీసు పుస్తకాలు చదవడం తప్పని కాదు నాఅభిప్రాయం. వాటివిషయంలో పూర్తి అవగాహన ఉంటే బాగుంటుంది. లేకపోతే పులిని చూసి వాతలు పెట్టుకున్న నక్క చందమగును.

నాఆలోచనలు ఈ ధోరణిలో సాగుతుండగా మరో ఆలోచన వచ్చింది. అది ఆడవాళ్ళని ఎలా సంబోధిస్తాం అన్నది. నాచిన్నతనంలో అంటే 40, 50 దశకాల్లో ఒకే కుటుంబంలోనూ ఉమ్మడికుటుంబాల్లోనూ అది, వాడు, ఒరే, ఒసేయ్ సర్వసాధారణం. అలాగే మొగుడూ, పెళ్ళాం, (మా, వాళ్ళ) ఆవిడా ఆయనా కూడా మామూలే. అంతే కాదు. ఈనాడు గొప్ప తప్పు అయిన ముండ అన్న పదం కూడా ఆరోజుల్లో కొంచెం తేలిగ్గానే వాడేరు. అమాయకంగా ఉంటే ఆడపిల్లని "పిచ్చిముండ, దానికేం తెలీదు, ఎలా బతుకుతుందో" అని వ్యాఖ్యానించడం ప్రేమతోనే. పనిమనిషిని ఇంకా రాలేదా ఆ ముండ అనడంలో కూడా ఏ దురద్దేశం లేకుండానే. మా అమ్మాయిని అది అనడం నాకు బాగానే ఉంటుంది. ఎదటివారు ఏమనుకుంటారో అని తను అంటున్నాను ఇప్పుడు. నిజానికి నాకు ఇలాటి

మర్యాదలు ఎంత అలవాటయిపోయేయంటే నాలుగేళ్ళక్రితం నాకు 5వఫారం స్నేహితురాలు అమెరికా వచ్చేనని ఫోను చేసి, "ఏమిటే, రావే ..." అంటూ మాటాడితే నాకేమిటో కొత్తగా ధ్వనించింది. గత 15, 20 ఏళ్ళలోనూ పనివాళ్ళనే కాక చిన్నపిల్లలని కూడా ఆవిడ అని సంబోధించడం చూస్తున్నాను. అలాగే నా వెనకటి టపా స్వయంప్రతిపత్తి సాదించుకున్న పాత్రలు లో అడిగిన ప్రశ్నకి ఒకాయన "పక్కింటి లావుపాటి పెళ్ళాం" అన్నారు.  "పక్కింటి లావుపాటి పిన్నిగారు" అంటున్నారేమో అనుకున్నాను కానీ ఆయన బాపూగారి వ్యంగ్యచిత్రాలు చూపించేరు. అది ఆయనకలా ఎందుకనిపించిందో కానీ ముళ్ళపూడి వెంకటరమణగారు సృష్టి, బుడుగు పక్కింటావిడని పక్కింటిలావుపాటి పిన్నిగారనే అంటాడు కానీ పెళ్ళాం అనడు. అంటే అది బుడుగుకోణంనుంచి మాత్రమే. బుడుగు చిన్నవాడు కనక ఆవిడని పిన్నిగారు అనడమే సమంజసం.

నేనిలా రాస్తున్నానని ఇది స్త్రీవాద టపా అనుకోకండి. మగవాళ్ళవిషయంలో కూడా బహుశా తక్కువేమో కానీ ఉన్నాయి వాడు, అతను, ఒరేయ్, ఏరా వంటి సంబోధనలు వాటివిషయంలో వచ్చిన మార్పులు కూడా ఎవరైనా రాస్తే నేను వినడానికి సిద్ధంగా ఉన్నాను..

మాటొచ్చింది కనక నువ్వు, మీరు సంబోధనలగురించి కూడా చెప్పుకుందాం. ఇంగ్లీషులో మీరు బాధలేదు. పిడుక్కీ బియ్యానికీ అంటే అరవడానికైనా బతిమాలుకోడానికైనా ఒకటే పదం. మనకి  నువ్వూ మీరూ పదాల ప్రయోగంలో సందర్భం మాత్రమే కాదు, కులాలు, ప్రాంతాలూ కూడా గణనలోకి వస్తాయి. తూర్పున ముఖ్యంగా రాజులకుటుంబాల్లో మీరు, అండి వాడకం ఎక్కువ. మరేనండి, ఆయనేమోనండి, నన్ను రమ్మన్నారండీ అంటూ అండీలమీద అండీలు పేర్చుతారు. చిత్తూరుప్రాంతంలో పెద్దలని అన్ని విధాలా చిన్నవాళ్లు నువ్వు అంటూ మాటాడతారు. అందులో తప్పూ లేదు, అవమానమూ లేదు.

ఈ పదప్రయోగాల తాలూకు పరిణామక్రమం కొంతవరకూ కథల్లో చూడొచ్చు. ఉదాహరణకి కుటుంబరావుకథల్లో ఇలాటి ప్రయోగాలు ఉన్నాయి. నాకు

తెలిసినంతవరకూ శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారికథల్లో కనిపించవు. క్రమంగా కొన్ని ప్రయోగాలు స్త్రీని కించపరిచేవిగా గుర్తించడం జరిగింది. ఎప్పుడు ఎలా మొదలయిందో నేను చెప్పలేను కానీ కొంతవరకూ స్త్రీవాదం కారణం కావచ్చు. నేను మాత్రం ముందే చెప్పినట్టు ఆ కోణంలోనుండి చూడడం లేదు.

మరోమాట కూడా చెప్తాను. ఈనాటి కథల్లో మరొకవిషయం కూడా కనిపిస్తోంది. అయితే ఆధునీకరణపేరున జరిగే ఈ ప్రయోగాలు పెదవులమీదా కాయితంమీదా మాత్రమేనేమో అనిపిస్తోంది. అనేక కథల్లో స్త్రీలు మానసికంగానూ భౌతికంగానూ పడే బాధలే చిత్రిస్తున్నారు కదా. మరి ఆ నేపథ్యంలో అది అనడానికి బదులు ఆవిడ అనేసరికి, ఆహా ఆయనకి నేనంటే ఎంత గౌరవం అనుకుంటూ మురిసిపోతారా? అందుకే అంటాను ఈ పదాల ఆర్భాటం మానేసి నిజంగా మనిషిని మనిషిగా చూడ్డం నేర్చుకోవాలని. ఎప్పుడు నేర్చుకుంటారో అని నీరసపడిపోతాను కూడాను. పేదవాడికోపం కన్నా హీనం ఈ పదాడంబరం. ఇందుకే అంటారు కడుపులో లేనిది కౌగలించుకుంటే వస్తుందా అని.

నా ఆలోచనలను మొదట నా ముఖపత్రమిత్రులతో పంచుకున్నాను. కొన్ని పదాలు ఇచ్చి వారిని ఒక చిన్న సన్నివేశం చిత్రించమని అడిగేను. ఆ పదాలు ఇవి - భార్య. పెళ్ళాం, పిన్నిగారు, మాఆవిడ (వాళ్ళావిడ), పనిది, పనావిడ, పనమ్మాయి, లేదా అసలు పేరు.

నాకోరికమేరకు, కొందరు చిన్న చిన్న సన్నివేశాలు రాసి పంపేరు. అవి ఇక్కడ పెట్టడం భావ్యం కాదు. ఆసక్తి గలవారు నా బ్లాగు, తెలుగుతూలికలో చూడవచ్చు, http://tethuika.wordpress.com

ooo

(ఏప్రిల్ 6, 2016)

# 12. కార్యమునంటి కారణముండొచ్చు ...

కార్యకారణన్యాయము అని ఒక న్యాయం ఉంది. ఏ కార్యానికైనా వెనక కారణం ఒకటుంటుందని. కాకతాళీయం అంటే కొబ్బరిమట్టమీద కాకి వాలితే, కాయ రాలిపడింది అని ఒక సామెత. కానీ ఇక్కడ ఉన్నది కారణకార్యన్యాయం కాదు. కాకి వాలకపోయినా పండు రాలిపడేది అన్న అర్థంలో ఈ కాకతాళీయం వాడతాం. ఆమాట అలా ఉంచుదాం ప్రస్తుతానికి. ధైర్యమువలనను సాహసమువలనను లక్ష్మి చేకూరును అని మరో సుభాషితం. కానీ తన్మూలంగా వచ్చే పరిణామం మరొకటి దాన్ని వెన్నంటి ఉండగలదు. సాధారణంగా ఆ మాట చెప్పరు.

నేను అమెరికా రాకముందు, వస్తానని కలలో కూడా అనుకోకముందు, ఓ ఆచార్యులవారు అమెరికనువ్యవస్థని ఎంతో మెచ్చుకుంటూ ఓ చిన్నకథ చెప్పేరు. వారి ఆఫీసులో ఓ గుమాస్తా స్థాయి ఉద్యోగికి (ఇక్కడ administrative asssitant లాటి శ్రవణానందకరమైన పేర్లు పెడతారు చిన్నా పెన్నా ఉద్యోగాలకి కూడా) మేనేజరుధోరణి నచ్చలేదు.

సాటివారితో చెప్తే, చాలామంది విని ఊరుకున్నారు. కొందరు నిజమే బాగులేదంటూ తలలూపేరు. "ఆయనతోనే చెప్పేస్తాను, నాకేం భయం," అన్నాడు గుమాస్తా. "చెప్పొచ్చు," అన్నారు వారు సందిగ్ధంగా.

మర్నాడు ఆ గుమాస్తా నేరుగా మేనేజరుదగ్గరికి వెళ్ళి, "నువ్వు నాకు చెప్తున్న పనులు న్యాయం కాదు. నేను చెయ్యను," అని చెప్పేసేడు.

"అదే మనదేశంలో అయితే అయ్యగారు ఏపని చెప్పినా చేసేసి, తరవాత వెనక సణుక్కుంటాడే తప్ప కానీ ఆయనమొహమ్మీద చెప్పగలడా?" అన్నారు ఆచార్యులవారు నాతో ఎంతో గొప్పగా. అప్పట్లో నేను కూడా ఆహా, ఓహో, అవును

సుమా అనే అనుకున్నాను.

అమెరికా వచ్చేక తెలిసింది. అలా చెప్పడానికి గుమాస్తాలకి స్వేచ్ఛ ఉంది. అలాగే వారి యజమానులకి కూడా స్వేచ్ఛలున్నాయి. పైన చెప్పినట్టు గుమాస్తాగారు ఎంతో ధైర్యంగా తనమనసులో ఉన్న విషయం వెల్లడించేసేక, ఆ యజమానిగారు ఆ గుమాస్తా చిత్తశుద్ధిని ఎంతో మెచ్చుకుని, "బాగుంది. నువ్వు చెప్పింది నిజమే. చాలా బాగుంది. నువ్వు ఎంతో చిత్తశుద్ధితో నీమనసులో మాట సేరుగా నాతోనే చెప్పినందుకు నాకు చాలా సంతోషంగా ఉంది. ఏ పనికైనా చిత్తశుద్ధి ముఖ్యం. నీచిత్తశుద్ధిని మెచ్చుకుంటూ నీకు మంచి కితాబు కూడా రాసి ఇస్తాను. నువ్వు రేపట్నుండీ పనిలోకి రానక్ఖర్లేదు. నీ ఉద్యోగం ఈరోజుతో సరి," అని చెప్పడానికి అవకాశం ఉంది. అలాగే చేస్తాడు కూడాను.

ఏ పని చెయ్యడానికైనా నీకు స్వేచ్ఛ ఉంది. ఆ వెనక రాగల ఫలితాలకి కూడా ఒడి పట్టి సిద్ధంగా ఉండడం కూడా స్వేచ్ఛ అనుకో, హక్కు అనుకో, ధర్మం అనుకో, కర్మ అనుకో అది కూడా ఉంటుంది. నిప్పు పట్టుకుంటే చెయ్యి కాలినట్టే. నిప్పు పట్టుకోడం నువ్వు సంపూర్ణమైన అవగాహనతో అంటే ఒంటిమీద తెలివి ఉంచుకుని చేసిన పని. ఫలితం మాత్రం "అబ్బే నేనిది కోరుకోలేదు," అంటే చెల్లదు. అలాగే మాటాడ్డమూను. నరం లేని నాలుక ఎటు తిరిగితే అటు తిరగనిచ్చి మాటలు తూటాల్లా వాడేసేయడం నీ అధీనంలోనే ఉంటుంది కానీ పరిణామం మాత్రం నీ చేతిలో ఉండదు. అది అనుభవించక తప్పదు. దానికి కూడా సిద్ధపడితే నీఇష్టం వచ్చినట్టు వాగొచ్చు.

ఈమధ్య ప్రతివారూ హక్కులగురించి మాటాడ్డం ఎక్కువయిపోయింది. హక్కులంటే ఉన్న హుషారు కర్తవ్యం అంటే ఉండకపోవడమే నాకు ఆశ్చర్యం కలిగించే విషయం. మన ఇళ్ళల్లో తరుచూ వినిపించే పదం ధర్మం. వ్యక్తిధర్మం, స్వామి (కుటుంబయజమాని) ధర్మం, సాంఘికధర్మం, ... ఇలా మనకి దర్మం పేరున చెల్లుతున్నవి అనేకం ఉన్నాయి. అసలు మనలో హక్కులకంటే ధర్మానికే ప్రాధాన్యం ఎక్కువ. ఆమాటకొస్తే హక్కులూ స్వేచ్ఛలూ బొమ్మా బొరుసూ

అనుకుంటాను.

అమెరికాలో రిపబ్లికనుల మూలసూత్రం "నీకు ఏం కావాలన్నా అది సంపాదించుకోడానికి పాటు పడాలి" అని. అది మంచి సూత్రమే. అయితే ఏమి సంపాదించడానికి ఎలాటి "పాటు" పడుతున్నారు అని ప్రశ్నించుకుంటే, జరుగుతున్నది చూస్తుంటే చాలా బాధగా కాకపోతే అయోమయంగా ఉంటుంది. ఒళ్ళొంచి పని చేసేవాళ్ళకి దొరికేసొమ్ముకి ముప్పై రెట్లు ఉంటోంది తెలివితేటలుపయోగించి వారిచేత పని చేయించుకునేవారికి. ఒకసారి మా పెద్దన్నయ్య అన్నాడు, "కష్టపడి పని చేయడం కాదు, తెలివిగా పని చేయడం తెలియాలి," అని. అంటే కాయకష్టం కాదు, "తలకాయకష్టం" అని. అంటే ఇతరుల కాయములతో నీ తలకాయ ఉపయోగించి చాకిరీ చేయించుకోడమే అని తరవాత తెలిసింది నాకు. అది "పాటు పడి" సంపాదించుకోడం కాదు. ప్రస్తుతం రిపబ్లికను అభ్యర్థిలా వాక్కుతో పాటు పడడం మాత్రమే. చాకిరొకరిదీ, సౌఖ్యమొకరిదీ అని ఏదో సినిమాలో ఎవరో రచయిత చెప్పినట్టు.

కాయకష్టం ఘనత పాశ్చాత్యదేశాలు మాత్రమే గుర్తించేరనుకోడం భ్రమ. ఇలా మాటాడుతుంటే నాకు అసందర్భంగానే చిన్నప్పుడు చదివిన కథ ఒకటి జ్ఞాపకం వస్తోంది. ఒక స్వామివారు ఊరిశివార్ల ఒక ఎత్తైన పీఠంమీద నిలబడి తలతో పని చేయడంలో గల ఔన్నత్యంగురించి గంటలతరబడి ఉపన్యాసం ఇస్తున్నాడుట. పాపం ఆయన ఉపదేశిస్తున్న సుభాషితాలు అర్థం కాక ఈయన ఎప్పుడు అసలువిషయానికి వస్తాడా అని ఎదురు చూస్తున్నారు అమాయకంగా శ్రోతలు. అలా కొన్ని గంటలో రోజులో అయేక ఆయన శోషొచ్చి తలా కాళ్ళూ లుమ్మలు చుట్టుకు పోతూ మెట్లమీంచి దొర్లుకుంటూ కిందకి పడిపోయేడు. ఏం జరిగిందో అర్థం కాని ప్రేక్షకులు ఓహో తలతో పని అంటే ఇదే కాబోలు అనుకున్నారుట.

వాక్చాతుర్యంతో ఎదటివారిని బుట్టలో పడేసి సొమ్ము చేసుకోడానికున్న విలువ కాయకష్టం కంటె అధికతరంగా చెల్లుతోందిప్పుడు. ఇలా ఆలోచిస్తే కారణకార్యన్యాయం సరిగా పని చేయడం లేదని అనిపిస్తోంది నాకు. ఎందుకంటే

ఒకడు గొప్పవాడు కావడానికి వేరేవాడు పని చేయడం జరుగుతోంది.

ఇంతకీ చెప్పొచ్చేదేమిటంటే హక్కులు హక్కులంటూ చేస్తున్న ఆర్భాటం కూడా నిజంగా హక్కులకోసమూ కాదు. ఆ హక్కులవల్ల చెప్పలేనంత సుఖశాంతులో వ్యక్తిగౌరవమో వచ్చేస్తాయనో కాదు. ప్రస్తుతం జరుగుతున్నది ఆ పేరు పెట్టి కొందరు పబ్బం గడుపుకోడమే. ఇక్కడ కార్యకారణసంబంధం ఏమిటంటే కారణం ఒకడూ కార్యం ఒకడూ అనుకోవాలేమో మరి.

సూక్ష్మంగా నామాట - స్వేచ్ఛ చాలు బాధ్యతలమాటెత్తకు అనడం అన్యాయం. అమెరికాలో కోర్టులలో జరుగుతున్న మరో వితండవాదన కూడా నాకు అర్థం కాదు.

ఒకడు ఏమీ తోచడం లేదనో మరేదో అలాటి కారణంతోనో మరొకడిని కాల్చి చంపేస్తాడు. అలా చంపడం నేరం కనక అతడికి పౌరహక్కులు కూడా వెంటనే రద్దు అయిపోతాయనే నా నమ్మకం. చట్టాన్ని వ్యతిరేకించేవారికి ఆ చట్టం రక్షణ ఇవ్వడం అర్థరహితం. కానీ ఇక్కడ నేరస్థులతరఫున న్యాయవాదులు అలాటి కుంటిసాకు ఏదో చెప్పి వాళ్ళని విడుదల చేయించేస్తున్నారు. ఇది కూడా కార్యకారణన్యాయాన్ని సమర్థంచేదిగా లేదు.

000

(మే 13, 2016)

# 13. తాళాలు దొరికేయి

అవును, ముందు పోతేనే తరవాత దొరకడం. రెండు వారాలక్రితం పోయేయి కానీ పోయేయని మొదలు పెడితే, అయ్యో పోయేయా, ఎక్కడ పోయేయి, ఎలా పోయేయి, అవే పోయేయా, నువ్వు పారేసుకున్నావా … అంటూ నువ్వు గాభరా పడిపోతూ నన్ను కొరుక్కు తినేస్తావేమోనని మొదటే సుఖాంతమేలే అని నీ మనశ్శాంతికోసం అలా మొదలు పెట్టేను. సరే, ఇప్పుడు ఎలా పోయేయో చెప్తాను. అసలు అవి పోయినప్పుడు చాలా డీలా పడిపోయేను. ఎందుకంటే అంతకుముందు జరిగిన మరోసంఘటన చెప్పాలి.

అది చెప్పేముందు ఇదంతా రాయాలని ఎందుకనిపించిందో చెప్తాను. ఇందాకా కూరా నారా కొనుక్కుని చెకౌట్ చేసుకుంటుంటే, నా పక్కనుంచి పోతూన్న అమ్మాయి చటుక్కున ఆగి, నీతాళాలు పారేసుకున్నావు అంటూ వంగి నాకాళ్ళదగ్గరున్న తాళాలు నాచేతిలో పెట్టి వెళ్ళి పోయింది. నేను ఉలిక్కిపడి, మళ్ళీనా అంటూ తాళాలు అందుకుని, అవి నావి కావని గ్రహించి, హలో అని ఆ అమ్మాయిని పిలిచేను కానీ అప్పటికే ఆవిడ చాలా దూరం వెళ్ళిపోయింది. హుమ్, నా నిజతాళాలు పోయినప్పుడు ఇలా ఎందుకు జరిగి ఉండకూడదూ అని విచారిస్తూ అక్కడున్న క్లర్కుకి ఆ తాళాలిచ్చేసి బయట పడ్డాను. అప్పుడన్నమాట ఇదంతా రాసుకోవాలనిపించింది నాకు.

తాళాలెలా పోయేయో చెప్తాను. రెండు వారాల క్రితం బజారుకెళ్ళి పాలూ, కూరలూ బండిలో వేసుకుని బయటికొచ్చేసేను. ఇంటికొచ్చి చూసుకుంటే ఇంటితాళాలు కనిపించలేదు. హయ్యో అని హడావుడిగా మళ్ళీ దుకాణానికెళ్ళేను. అదృష్టవశాత్తు కారు తాళాలు విడిగా ఉంచుకున్నాను కనక వెళ్ళగలగేను. అదృష్టం అవునో కాదో … ఎందుకంటే అన్ని తాళాలూ ఒకే గుత్తిలో ఉంటే కారు కదిలేది కాదు కదా.

అప్పుడు తాళాలకోసం వెంటనే అక్కడిక్కడే వెతుక్కుని ఉండేదాన్ని. కానీ విడిగా ఉండబట్టే కదా కారు తోలుకు ఇంటితాళాలసంగతి ఆలోచించకుండా వచ్చేసేను. సరేలే, అదో యక్షప్రశ్న. మొత్తమ్మీద దుకాణానికైతే మళ్ళీ వెళ్ళగలిగేను కానీ తాళాలజాడ మాత్రం కనుక్కోలేకపోయేను. ఇలాటప్పుడే నాకారు స్వయంచోదక వాహనం కానందుకు సంతోషం కలుగుతుంది. లేకపోతే తాళాలు లేనందున నేను దిగాలుపడి దిక్కులు చూస్తుంటే కారు దానంతట అది ఇంటికి పోయేదేమో అనుకుంటాను!!

సరే ఇంటికొచ్చి ఇంటర్కంలో మేనేజరుబటను తట్టేను. ఆవిడ తలుపు తెరిపించేక, నేను నావాటాలోకి వెళ్ళి ఆలోచిస్తూ కూర్చున్నాను. ఇక్కడ మరోమాట కూడా చెప్పాలి. అది రహస్యమే కానీ అమెరికన్ దొంగకి తెలుగు రాదు కదా అన్న దీమాతో చెప్పేస్తున్నా. నువ్వు మళ్ళీ ఎవరితోనూ అనవని కూడా ధైర్యం. నేను ఇంటితలుపు తాళం వెయ్యను. ఎందుకంటే సింహద్వారానికీ నావాటా ముఖద్వారానికీ చాలా దూరం. దొంగ ఎవరైనా బిల్డింగులో ప్రవేశించినా అనేక వాటాలు దాటుకుని నావాటాకే వెతుక్కుంటూ వస్తాడని అనుకోను. ఒకవేళ వచ్చినా నావాటా ప్రవేశించి, కలియజూసి, "హయ్యో రామా, ఇదేమిటి అయ్యవారి నట్టిల్లులా … పాపం ఎలా బతుకుతోందో," అని జాలి పడి మరో ఇంట్లోంచి దొంగిలించి తెచ్చుకున్న వస్తువులు నాకొదిలేసి పోతాడని నా నమ్మకం.

ఇంతకీ మేనేజరుతో తాళాలు పోయేయని ఎలా చెప్పడమా అని ఆలోచిస్తున్నానని చెప్పేను కదూ. నేను అంత సుదీర్ఘంగా ఆలోచించడానికి అంతకుముందు జరిగిన మరో సంఘటన చెప్పాలి. నెల రోజులయిందేమో, underground garageలో దొంగలు పడి ఒకటి రెండు ట్రక్కులలో రేడియోలూ అవీ తస్కరించుకు పోయేరుట. బహుశా ప్రత్యేకమైన మోడల్ కోసం చూస్తున్నారు కాబోలు ట్రక్కులు మాత్రమే తడిమేరుట. ఏమైతేనేం, ఆ కారణంగా మొత్తం బిల్డింగు తాళాలన్నీ కొత్తవి వేయించేరు.

తెలిసింది కదూ నా వెరపుకి కారణం. ఇప్పుడు నేను తాళాలు పారేసుకున్నందుకు

ఆవిడ, "మొన్నే కదా కొత్త తాళాలు వేయించాం, ఇప్పుడు మళ్ళీ నీవల్ల ... " అంటూ ఎగిరి పడుతుందేమోనని. కాని ఏం చేస్తాం, ఖర్మ అనుకుంటూ నెమ్మదిగా ఫోను తీసి, "తాళాలు పోయేయి" అన్నాను గొంతు బాగా తగ్గించి.

"ఓ, అలాగా. సరే మరో గుత్తి ఇస్తాను," అందావిడ. నేను ఆశ్చర్యపోయేను కానీ ఆమాట ఆవిడతో అంటే కొరివితో తల గోక్కున్నట్టే కదా అనుకుని ఊరుకున్నాను.

ఇంతకీ ఇప్పుడు ఎక్కడున్నాం చెప్మా? తాళాలు ఎలా పోయేయో చెప్పడం అయిపోయింది కదా. ఇంక ఎలా దొరికేయో చెప్పేస్తే సరిపోతుంది. ఇందాకా చెప్పేను కదా నావి కాని తాళాలెవరో నాకు అందించేరని. అప్పుడు తోచింది మరోసారి ఆ స్టోరు క్లర్కుని అడిగితేనో అని. ఎందుకంటే ఎవరికైనా దుకాణం బయట ఆవరణలో దొరికిఉంటే మళ్ళీ పని గట్టుకు లోపలికెళ్ళి స్టోరుక్లర్కుకి ఆ తాళాలు ఒప్పగించే సమయమూ ఓపికా ఉండవు. అలాటివారు మళ్ళీ బజారు చేసుకోడానికి వచ్చినప్పుడు ఆ తాళాలు తెచ్చి ఇవ్వొచ్చు అని ఆశ.

అలా ఆలోచిస్తూ నిలబడిపోయేను. అక్కడున్న క్లర్కుఅమ్మాయి ఏం కావాలంది. రెండు వారాలక్రితం నాతాళాలు ఎక్కడో పడిపోయేయి అన్నాను.

ఉండు చూస్తాను అంటూ ఆ అమ్మాయి గబగబా డెస్కు వెనకనున్న సొరుగు లాగి చూసింది. నీ తాళాలెలా ఉంటాయో తెలుసా అంది. రెండు రింగులు జోడించేను, మొత్తం ఐదు తాళాలున్నాయి అన్నాను. రెండు రింగులు ఎందుకు జోడించేనో చెప్తే ఈ కథ మరీ సాగదీసినట్టుంటుంది. అంచేత అదిప్పటికి వదిలేద్దాం. ఇంతకీ అలాటివేవీ కనిపించలేదంది.

సరేలే, ఎవరికి మాత్రం పట్టింది ఇలాటివి అనుకుని బయటికి నడిచేను నా బండి తోసుకుంటూ. ఇంతలో మరో అమ్మాయి పరుగెత్తుకుంటూ వచ్చి, నువ్వేదో పారేసుకున్నావుట అంది.

ఇంకా ఏమున్నాయి పారేసుకోడానికి అనుకుంటూ లోపలికెళ్ళేను. హాహోహాహో ఏమని చెప్పుదు నా ఆనందము! నా తాళాలు ఎత్తి పట్టుకుని ఇవేనా అని

అడుగుతూ దర్శనమిచ్చింది మొదటి క్లర్కు. పట్టలేని ఆనందముతో కృతజ్ఞతలు చెప్పి. దేవుడు నీకు మేలు చేయుగాక అని దీవించి, ఇంటికొచ్చేసేను.

ఇంటికొచ్చేక తోచింది నిజంగా ఆ తాళాలు ఎవరికి దొరికేయో, ఎవరు అంత శ్రద్ధగా పని గట్టుకుని ఆ తాళాలు డెస్క్ క్లర్కుకి ఇచ్చేరో వారికి కృతజ్ఞతలు చెప్పుకోలేదు. చెప్పడానికి వారెవరో తెలీదు. ఇప్పుడే కాదు ఎప్పటికీ తెలీదు కదా!!!

ఇందలి నీతులు రెండు.

1. ఎప్పుడు మంచి ఏ రూపంలో జరుగుతుందో మనకి తెలీదు. మనకి ఎవరు సాయం చేసేరో తెలియకపోవడం కూడా జీవలక్షణమే.

2. ఈ కథ చెప్పినతీరు. మన ప్రాచీనసాహిత్యంలో చాలా కథలు ఇలాగే ముందుకీ వెనక్కీ పోతూ సాగుతాయి. ఇలా కూడా కథ చెప్పొచ్చు.

ఇంకా ఒక ప్రశ్న కూడా ఉంది. అదేమిటంటే ఈ ధోరణి గందరగోళంగా ఉందా? ఉంటే మరేం అనుకోకు. నాకు చేతనయినట్టు చెప్పేనంతే. నువ్వు మరో పని చెయ్యొచ్చు. నీకు నచ్చినట్టు నీమాటల్లో మళ్ళీ రాసుకో. లేదా మరో కథ కూడా రాసుకోవచ్చు. ఏమంటావు?

000

(మే 20, 2016)

# 14. అసలు సుఖంపెక్కడున్నాది?

“కులాసాగా ఉన్నావా?”

“అంటే?”

"సుఖంగా ఉన్నావా, బాగున్నావా, మరే చిరాకుల్లేవు కదా ... ఎలా అడగమంటావు?"

ఎలా అడిగినా ఒకటే. జవాబూ అంతే. బాగున్నాను. బాగానే ఉన్నాను. ఏదో జరిగిపోతోంది ...

నిట్టూర్చేను అప్రయత్నంగానే.

ఏమిటా సుఖం? ఎలా కొలుస్తావు? భగవంతుణ్ణి నమ్ముకుంటే, తపస్సులూ, పూజలూ చేస్తే సకల సౌభాగ్యాలు కలుగుతాయి. సౌభాగ్యం అంటే? శ్రీకృష్ణుడు మూడు గుప్పెళ్ళ అటుకులతో కుచేలుడికి అష్టైశ్వర్యాలూ ప్రసాదించేడుట. కుచేలుడు దినము జరుగుబాటుకోసం బాల్యమిత్రుడిని సాయం అడిగేడు కానీ అష్టైశ్వర్యాలూ కోరినట్టు కనిపించదు. అసలు కుచేలుడు అంటేనే ఆగర్భదారిద్ర్యానికి మారుపేరు. మరి ఆయనకి అష్టైశ్వరాలు వచ్చేస్తే, “కుచేలుడు” కాడు. పైగా అష్టైశ్వర్యాలూ వచ్చేసిన తరవాత ఆయన జీవనవిధానం మారిందా? ధోరణి మారిందా? తెలీదు. ఆ సకల సంపదలూ అనుభవించాలంటే మారాలి కదా. మారకపోతే అవి ఉన్నా ఒకటే లేకున్నా ఒకటే. కేమన్ దీవుల్లోనూ స్విస్ బాంకుల్లోనూ సంపదల్లా. సరే సరే నాకూ తెలుసు ఆ కథలో ప్రధానం స్నేహం, భక్తీ అని. భక్తికీ సంపదకీ లంకె పెట్టకుండా ఉంటే బాగుండు అనిపిస్తోంది. ఏదో అసంతృప్తి, గందరగోళం.

అసలు సంతోషం అంటే ఏమిటో. డబ్బుతో ఆనందం కొనుక్కోలేం అంటూ కథలూ

ఉపన్యాసాలూ కోకొల్లలు. మరోవేపు ఆ ఆనందంకోసమే సంపాదనలు. ఆ సంపాదనకోసం రాత్రింబవళ్ళు ఆరాటం. అసలు డబ్బు ఎవరు కనిపెట్టేరో. ఈ డబ్బు కనిపెట్టకముందు సుఖం లేదా?

అసలు సుఖం అంటే ఏమిటి? ఇల్లు లేకపోతే ఇల్లు, ఇల్లుంటే ఇంకొంచెం పెద్దిల్లు, సైకిలుంటే స్కూటరు, స్కూటరుంటే కారు, కారుంటే ఇంకొంచెం ఖరీదయిన కారు, ఒక కారుంటే రెండు కార్లు … ఎన్ని ఉన్నా అంతకన్నా ఇంకొంచెం ఎక్కువ కావాలన్న తపన, పై అంతస్థుకి ఎగబాకాలన్న రంధి.

దేశదేశాలు సందర్శించడం మాట వస్తే దేశాటనం అంటే మునుస్వామయ్యగారు గుర్తొస్తారు. నాలుగేళ్ళయిందనుకుంటా కలిసి. అప్పట్లో 70 దేశాలు చూసేం అన్నారు. వాటిగురించి రాయండి అన్నాను. ఎక్కడ గుర్తుంటాయండీ అన్నారాయన. ఆవిడ చూపిన ఫొటోలు చూస్తే నాకు తమాషాగా అనిపించింది. కొన్ని బొమ్మల్లో అయితే వెనకున్న దృశ్యం కన్నా ఆ దంపతులే ప్రముఖంగా కనిపించేరు. వాళ్ళు అక్కడి తిన్నెలు సంచరించేం అని గుర్తుగా కాబోలు. ఆ బొమ్మలు పెట్టుకుని రాయొచ్చు కదా అన్నాను నేను ఒదలకుండా. ఆయన తల అడ్డంగా ఆడించేరు. ఏదో రోజులు గడవడానికే తిరిగినట్టుంది కానీ ఆ దేశసంంస్కృతి తెలుసుకుందాం అని కాదేమో. అయినా దేశంలో నెలరోజులు గడిపినంతమాత్రాన ఏం తెలుస్తుంది? … ఏమీ తెలీదని నాకు ఈమధ్య బాగానే అర్థం అయింది అమెరికా వచ్చి వెళ్ళినవాళ్ళు ఈ దేశసంపదనీ, నీతినియమాలనీ మెచ్చుకుంటుంటే. హ్మ్.

అద్సరే గానీ అసలు ఏదైనా తెలుసుకున్నతరవాత ఏం చేస్తాం? … ఇలా అడిగితే బాగుండదులే.

సుఖమూ అంతే. రిమోట్ లేని రోజుల్లో టివీ దగ్గరికి వెళ్ళి ఛానెలు మార్చవలసి వచ్చేది. ఇప్పుడు రిమోటు లేకపోతే క్షణం గడవదు. ఇప్పుడు ఎంచక్కా ఆరడుగులదూరంలో సోఫాలో విలాసంగా వెనక్కి వాలి ఛానెలు తరవాత ఛానెలు కుప్పిగెంతులేసుకుంటూ పోవచ్చు. మరి సుఖంగా ఉందా? నిజంగా మనస్సాక్షిగా చెప్పాలంటే సుఖం కంటే నష్టమే ఎక్కువ. ఆ సౌకర్యంవల్ల స్థిమితంగా ఒక ఛానెలు

పూర్తిగా చూసే అలవాటు పోయింది. ఎంత ఇష్టమైన కార్యక్రమం అయినా అవతల మరో చానెలులో ఏం మునిగిపోతోందో అన్న యావే. అక్షరాలా మతిస్తిమితం లేకుండా పోయింది! ఒక విషయంమీద దృష్టి నిలపడం లేదిప్పుడు. చిన్నవిషయమే కానీ ఏ విషయం తీసుకున్నా ఇలాగే అనిపించడం లేదూ? మాలుకెళ్తే మెట్లెక్కం ఎస్కలేటరో ఎలివేటరో ఉంటే. నిజానికి ఒంట్లో ఓపికున్నవాళ్ళు మెట్లెక్కితేనే ఆరోగ్యం కదా. వీధిచివరున్న దుకాణానికి కారేసుకునే వెళ్తాం. కాలినడకన వెళ్లే ఎన్ని పువ్వులూ కాయలూ, నోగరెమ్మలూ చూసేవాళ్ళో! కారులో తిరగడంవల్ల వారికి అనుభవంలోకి రాకుండా పోతున్న సృష్టి అందాలు ఎన్నో. నేను రోజూ నడుస్తూ చూసే ఎన్నో మొక్కలూ, పువ్వులూ ... వాటిని పెంచుతున్నవారు ఎక్కడో ఆఫీసుల్లో మగ్గుతున్నారు. లేదా మరో దేశసౌందర్యం చూడ్డానికి వెళ్తారు. నేనో మరి? వాటికి చేస్తున్నదేమీ లేదు. చీడ పట్టిందా, ఎరువు కావాలేమో అన్న తహతహ లేదు. తీరిగ్గా వాటిపక్కనుండి పోతూ, ఆగి రెండు నిముషాలపాటు వాటిసౌందర్యం మనసారా తిలకించి ముందుకు సాగిపోతాను. నాకు ఇల్లు లేదు. తోటలూ దొడ్లూ లేవు. మరి లేదన్న చింతతో సతమతమవనా? కనిపిస్తున్నవి చూసి ఆనందించనా? నాకు రెండోదే బాగుంది. అందుకేనేమో కవి అన్నాడు

స్వర్గమ్మునుగూర్చి నాకు సర్వమ్ము తెలియు

మనసు సంతసపడుటకు మంచి యూహ (గాలిబ్ గీతాలు).

స్వర్గసుఖాలు అంటారు కానీ ఆ సుఖాలు మరి ఇక్కడే దొరికితే వేరే స్వర్గంకోసం తాపత్రయపడడం ఎందుకూ అని ఆయనభావం. అందమైన అమ్మాయికోసం ఆయన పడే వేదన చూస్తే అనిపిస్తుంది ఆయనకి స్వర్గసుఖాలకంటే ఆ వేదనే ఎక్కువ అభిమతమేమేమో. ఈ ఊహ ఎలాటిదయి ఉండాలి - ఎక్కడో ఎప్పుడో చిక్కగలదిగానా, ఇప్పుడు ఎదురుగా కనిపిస్తున్నదానితో తృప్తి చెందేదిగానా?

సుఖం మాటకొస్తే, ఏదైనా ఇంతే. ఇన్ని సౌకర్యాలు లేని రోజుల్లో ఉన్నచోట ఉండి తిన్న చోట తింటూ బతుకు గడుపుకున్న రోజుల్లో కంటే ఇప్పుడు ఎక్కువ సుఖంగా ఉన్నాం అని చెప్పగలమా? ఏమో, బహుశా ఆరోజుల్లో సుఖానికి వేరే నిర్వచనం

ఉండేదేమో. అదేమయిఉంటుంది?

సంతోషమూ సుఖమూ ఒకటేనా? రెండూ ఒకటి కాదు. మరి సంతోషానికి సుఖానికీ సంంధం ఉందా?

ఆమధ్య టీవీలో ఒక వార్త చూసేను. ప్రపంచదేశాలన్నీ తమదేశపు భాగ్యం (GDP)తో కొలుస్తుంటే భూటాన్ రాజు ప్రజల సుఖసంతోషాలు (GDH) కొలమానంగా నిర్ణయించేడుట నాలుగు దశాబ్దాల క్రితమే. అక్కడినుండి ఏదేశంలో ఆనందం ఏస్థాయిలో ఉందో పరిశోధనలు మొదలయేయి. ఎలా కొలుస్తాం అంటే ఇదుగో ఈ 8 అంశాలు ప్రాతిపదికగానట - ఆరోగ్యం శారీరకంగానూ మానసికంగాను, కాలక్షేపాలూ, సాంఘిక సామాజిక బలాబలాలు, విద్య, జీవన స్థాయి, బాధ్యతాయుత ప్రభుత్వం, పర్యావరణ. ఇవన్నీ బాగానే ఉన్నాయి కానీ వీటికీ డబ్బుకీ సంబంధం కూడా ఉంది కదా. మరి GDP అంటే ఉత్పత్తి అనే సాధారణ అర్థం అయినా ఆ ఉత్పత్తివలన అందుకునే డబ్బే నిజంగా లెక్కలోకి వచ్చేది. అంచేత ఆ GDPకి వెనక మళ్ళీ ఉన్నది డబ్బే. ఎలా చూసినా డబ్బు ఏలిన్నాటి శనిలా పట్టుకునే ఉంటుందనిపిస్తోంది.

ప్రపంచం మొత్తంలో తమదే మహోన్నతదేశం అని ఎలుగెత్తి చాటుకుంటున్న (చాటుకొను క్రియాపదం గమనించవలె) అమెరికా ఆ ఆనందంకొలతల్లో 13వ స్థానంలో ఉంది.

అసలు అమెరికా ఆనందంలో అనేక వైరుధ్యాలు కనిపిస్తాయి తరిచి చూస్తే. ఉదాహరణకి, ఏ పని అయినా తమకి ఆనందం కలిగించేదిగా ఉండాలంటారు. Fun. చదువు, ఉద్యోగం ఏదైనా సరే ఫన్నుంటేనే మిన్న. లేకున్న దానిఉనికి సున్న.

మామూలుగా సుఖం అంటే తినడానికి తిండీ, కట్ట బట్టా, తల దాచుకోడానికి ఓ గూడూ ఉంటే సుఖంగా ఉన్నట్టే లెఖ్ఖ. ఆ మీదట గంజినీళ్లకంటే కూరా పచ్చడీ, గడ్డ పెరుగూ కొత్తావకాయ ఘాటుగా ఉంటే సుఖమే కాదు సంతోషం కూడా. ఆరోగ్యం మాట వేరే చెప్పఖ్ఖర్లేదు కదా. కానీ ఇదంతా చాదస్తంగా కూడా కనిపిస్తుంది ఈ రోజుల్లో. ఆమాత్రం లేనివాళ్ళుంటారా, అదీ ఓ బతుకేనా అని విరగబడి నవ్వేవాళ్ళు

కూడా ఉన్నారేమో.

పంది బురద మెచ్చు కానీ పన్నీరు మెచ్చునా అని తీసిపారేస్తాం కానీ భూటాన్రాజు లెక్కలో చూడు. ఆనందం కొలతలో నీకు పన్నీటి జలకాలు ఏ స్థాయి ఆనందం కలిగిస్తాయో పందికి బురదలో పొర్లినప్పటి ఆనందం కూడా అదే స్థాయిలో ఉండదని ఋజువేదీ? పందికి నువ్వు పన్నీటి జలకం ఏర్పాటు చేస్తే, అది ఆనందించదు అన్నది నీ అభిప్రాయమే కానీ పందితో ఈ విషయం చర్చించిన జాడలు లేవు కదా. అంతే కాదు. బురద ఆరోగ్యకరం అన్నది కూడా గమనించాలి. ఒంటినొప్పులకి బురద పట్టు వేస్తారని తెలుసు కదా. అంటే ఏమిటీ, పంది ఆ బురదలో పొర్లి ఆరోగ్యంగా ఉంటోంది అని.

నిన్న రాత్రి నువ్వేం చేసేవు. మంచంమీద తలగడామీద తలగడా సద్దుకుంటూ, ఈ తలగడా కాదు ఆ తలగడా, పట్టుదుప్పటీ కాదు నూలు దుప్పటీ, ఈ పక్క కాదు ఆ పక్క అంటూ మార్చుకుంటూ, దొర్లుతూ, మెలికలపాములా గిలగిల్లాడుతో ఎంతసేపు గడిపేవు? అలా అర్ధరాత్రివరకూ విలవిల్లాడి సరీఘ్ఘా అనువు కుదిరేక మరి ఆ మంచంమీంచి లేవగలిగేవా నాలుక పీక్కుపోతున్నా, కడుపుబ్బిపోతున్నా? లేదు. ఎందుచేతా అలా పడుకోడం నీకు అంత సుఖంగా ఉంది గనక. అప్పటికి అంతకి మించిన సుఖం లేదు.

నిన్న పక్కవాటాలో పిల్ల కుడికాలు మడమకి కట్టుతో ఊతకర్రలతో కనిపించింది. ఏమయిందంటే ఎత్తుమడమలజోడుతో నడుస్తూ బోర్లి పడిందిట, మడమ బెణికింది. ఎందుకొచ్చిన అవస్థంటే పొడుగ్గా కనిపించడంకోసం. నిజానికి అందరికీ తెలుసు ఆ అది భ్రమే అని. అసలు ఈ మడమలచరిత్ర చూడు. మొదట ఒకంగుళంతో మొదలయి, రాను రాను రెండూ, మూడూ, ప్రస్తుతం నాలుగంగుళాలు అయింది. చదునుగా మొదలయిన మడమ సూదిమొన అయింది. ఆ సూదిమొనమీద సర్కస్ చేయలేక, దానికి మళ్ళీ మరో ప్లాస్టిక్ కప్పు తయారు చేయడం మొదలు పెట్టేరు. ఆ కప్పులు ఆ సూదిమొనని పట్టుకుని ఉండవు. అవి ఊడి ఎక్కడో పడిపోతాయి కనక మరో రెండు కొని దాచుకుంటారు. ఎందుకొచ్చిన బాధ ఇదంతా.

బహుశా వీళ్ళు గాలిబ్ గీతాలు కంఠతా పట్టి ఉండాలి. ఎందుకంటే నొప్పి లేకపోతే ఆనందం ఎలా తెలుస్తుందంటాడు గాలిబ్. ఇంతకీ పక్కింటి పిల్ల మాట - ఎందుకంటే ఆ జోళ్ళు వేసుకున్నపేళ తానేదో చాలా పొడుగన్న అపోహ. నిజం. అపోహ మాత్రమే. దాంతో ఇదీ అని నిర్వచించలేని ఆనందం. నీజోళ్ళు బావున్నాయి అని మరో అమ్మాయి మెచ్చుకుంటే అదో ఆనందం. ఇవన్నీ ఆ క్షణానికే కదా. కాదేమోలే. నాపేరు నాలో భాగం అయినట్టే ఆ జోళ్ళు ఆ అమ్మాయిలో భాగమేమో.

ఒకమాట మాత్రం నిజం. కావలిస్తే మళ్ళీ చెప్తాను ఇవన్నీ ఏమంత ఏడ్చి మొత్తుకునే మాటలు కావని. కానీ వాటివిషయంలో నీ స్పందన ఎలా ఉంది, ఆ క్షణంనించి తరవాతి క్షణానికి ఎలా ప్రయాణిస్తున్నావు అన్నవే నీ జీవితాన్ని నిర్దేశిస్తాయి అని చెప్పడానికే ఈ సోది అంతాను. ఎత్తుమడమలజోళ్ళు "ఇవాళ ఒకరు మెచ్చుకుంటే పోనీ, రేపు మరొకరు మెచ్చుకుంటారు" అని ముందుకి సాగుతావా, "అయ్యో ఇంత డబ్బు పోసి కొన్నాను, ఇన్ని అవస్థలు పడ్డాను వాటితో నడవడానికి" అంటూ కుళ్ళి కుమిలిపోతూ రాత్రంతా గడుపుతావా అన్నది నీచేతుల్లో ఉంది. నీకర్మకి నువ్వే కర్తవి కాదూ?

నా స్నేహితులంతా జీవితం లెక్కప్రకారం సాగించుకుపోయేవారే - చదువు, ఉద్యోగం, పెళ్ళి, కొత్త మేడా, పిల్లలు, మళ్ళీ వాళ్ళ చదువులూ, అమెరికాలో ఉద్యోగాలూ, పెళ్ళిళ్లూ, వాళ్ళ పిల్లలూ, కొత్త మేడా, మళ్లీ వాళ్ళ పిల్లలు … జారుడుబండమీద చిన్నారిలా సాఫీగా ఆనవాయితీప్రకారం సాగిపోతుంది. నాకు ఒక్కటీ అలా జరగలేదు. అంచేతేనేమో ఈ తలతిక్క ఆలోచనలు.

అన్నట్టు ఇందాకా పేరుమాట చెప్పేను కదూ. పేర్లసంగతి వస్తే తప్పకుండా కథల్లో పేర్లసంగతి మాటాడాలి. మునుపు పిల్లలకి తాతతండ్రులపేర్లూ దేవతలపేర్లూ పెట్టేరు కానీ ఇప్పుడు పోగ్గా, ప్రత్యేకంగా ఉండాలంటున్నారు కదా. సంతానం సంగతి నేనేం చెప్పలేను కానీ కథల్లో పేర్లు మాత్రం సాధారణంగా రచయితలు పాత్రలకి తగ్గపేర్లే పెడతారు, అన్వర్థకంగా కానీ వ్యంగ్యంగా కానీ. ఏమైనా పేర్లు ఆ జాతి సంస్కృతిని తెలిపేవిగా ఉండేవి కానీ ఇప్పుడు మనదేశంలో మాత్రం అలా లేదు. అంచేత

అనువాదాలు చేస్తున్నప్పుడు కూడా ఇష్టం వచ్చినట్టు మార్చేస్తున్నారు. ఇదుగో ఇక్కడే అసలు సంగతి, నామాట ....

చేసిన పాపం చెబితే పోతుందంటారు. అవునో కాదో తెలీదు కానీ నేను కథలు అనువాదం చేయడం మొదలు పెట్టిన కొత్తలో కథల్లో పేర్లగురించిన సందేహం వచ్చింది. నా అనువాదం ఎలా ఉందో చూడమని అమెరికను స్నేహితులని అడిగినప్పుడు ఒకరిద్దరు ఆ పేర్లు మార్చమని సలహా ఇచ్చేరు. వారిమాట విని ఒకటి, రెండు కథల్లో మార్చేను కూడాను. కొంతకాలం అయేక అర్థమయింది. పదిమందిని సలహా అడిగితే పది రకాల సలహాలు చెప్తారు. ఒక సలహా ప్రకారం మార్చడం మరొకరికి చూపడం, వాళ్ళు మరో సలహా ... ఇలా కొంతకాలం అయేక గ్రహించేను. సలహాలు అడగొచ్చు కానీ పాటించవలసిన అవుసరం లేదు. ఎన్నిసార్లు మార్చినా, అది నచ్చనివారు ఉంటారు. ఆ రోజుల్లోనే Roots లో ప్రధానపాత్రని పేరు మార్చుకోమని హింసించడం చూసేను. అప్పుడర్థమయింది ప్రతిఒక్కరికీ బారసాలనాడు పెద్దలు పెట్టినపేరుకి ఏ సంస్కృతిలోనైనా ఎంత బలమైనస్థానం ఉందో. ఆ తరవాత మార్చడం మానేసేను. మనం రాసింది కొందరికి నచ్చుతుంది. కొందరికి నచ్చదు అన్నది ప్రధానసూత్రం చేసుకున్నాను అప్పట్నుంచీ. ప్రతి ఒక్కరికీ నచ్చడం ఏనాటికీ జరగదు కనక నేను ప్రతి ఒక్కరినీ సలహాలు అడిగి లాభం లేదు. నాకు ఏది బాగుందో అదే నా అనువాదం. అదే నేను. అంటే నాపేరుమీద వచ్చిన అనువాదాల్లో పేర్లు మూలంలో ఉన్న పేర్లే ఉంటాయి.

ఏమిటో ... నేనిలాటి అవకతవక ఆలోచనలు చేస్తాను కనకే నాకు ఎవరితోనూ పొత్తు కుదరదు అనుకుంటా. ఈ పాటికి బహుశా నువ్వు కూడా లేచి వెళ్ళిపోడానికి సిద్ధమవుతున్నావేమో. సరేలే, మళ్ళీ నీకు వినాలనున్నప్పుడు కనిపించు.

సర్వే జనాః ఎవరిపద్ధతిలో వారు సుఖినో భవంతు!

ooo

(మే 30, 2016)

# 15. నువ్వా? మీరా?

తెలుగులో ఉన్నన్ని సంబోధనలు ఇంగ్లీషులో లేవు. మనకి "నువ్వు", "మీరు" తేడాలతో వాటిని అంటిపెట్టుకు ఇతరవిధాల సంబోధనలు కూడా అనేకం. వీటితోపాటు అమ్మా, అక్కా, అన్నా, బాబూలాటి మాటలు కూడాను.

బ్లాగులోకంటె ముఖపుస్తకంలో కబుర్లకి అవకాశాలెక్కువ. పైగా ఎదురెదురుగా కూర్చుని మాటాడుకున్నట్టే. సామీప్యం ఉన్నట్టే ఉంటుంది కనక అప్పుడప్పుడు ఎవరో ఒకరు "మీరనకండి" అంటారు. ఈ సూచనలు పదే పదే కనిపించడంతో సరదాగా అడిగేను "ఎవరిని మీరు అనాలి, ఎవరిని అనక్ఖర్లేదు, మీరే చెప్పండి," అని. "నన్ను నువ్వు అనకూడదు" అని ఎవరూ అనలేదనుకో. ఎవరిని అనాలన్నమాట ఎలా ఉన్నా వచ్చిన జవాబులు సరదాగా ఉన్నాయి. అంచేత ఆ మాట నీచెవిని కూడా వేదాం అని ఇక్కడికి మోసుకొచ్చేను. లేదులే అక్కడితో సరి పెట్టేయను. ఈ విషయంలో నావిషయం - నాకేది సమ్మతమో - కూడా చెప్తాను. అప్పుడు బ్లాగు చదువరులకి కూడా తెలుస్తుంది కదా "ఇదీ నావరస" అని.

అసలు మన మర్యాదలతీరే వేరు. ఒకొక ఇంట్లో ఒకొక ఆనవాయితీ అంతే గానీ హట్ హూట్ నన్ను నువ్వంటావా, కళ్ళు నెత్తికెక్కేయా అంటూ ఎగిరి పడడం తక్కువే. లేకపోలేదు కానీ తక్కువే అంటున్నా. కొందరిళ్ళల్లో ఆలుమగలిద్దరూ ఒకరినొకరు నువ్వూ నువ్వూ అనుకుంటే కొందరిళ్ళల్లో ఇద్దరూ మీరనే సంబోధించుకోడం చూస్తున్నాం. క్షత్రియకుటుంబాలలో పూర్వమే కాదు ఇపుడు కూడా దంపతులు ఒకరినొకరు మీరనే గౌరవించుకుంటారు. గుంటూరు ప్రాంతంలో వైదికకుటుంబాల్లో ఇద్దరూ నువ్వు అనుకోడం ఉంది. పాటకజనంలో అందరూ నువ్వూ నువ్వూ అనే పిలుచుకుంటారు. పల్లెల్లో పాలేర్లు భూస్వాములని నువ్వు అనడం తప్పు కాదు.

ప్రాంతాలనిబట్టి కూడా ఆనవాయితీలలో తేడాలుంటాయి. ఒకాయన నాతో, "మేం చిత్తూరోల్లం. మాకు ఈ అండీ గిండీ అలవాటు లేదు. మీరేం అనుకోబాకండి," అన్నారు. తిరపతిలో ఉన్నప్పుడు ఒకతను నాతో, "ఏరా అంటాడు నన్ను, నేనేం ఆయన బామ్మర్దినా?" అన్న తరవాత కానీ నాకు తెలీలేదు ఆ ప్రాంతాల్లో "రా" అనడం ఎంత తప్పో. విశాఖపట్నంలో స్నేహితులు ఒరే, ఒసే అనుకోడం మామూలే. అందులో తప్పు లేదు.

ఇవే ధర్మసూత్రాలు, వీటినే విధిగా పాటించాలి అనడం లేదు నేను. ఇలా ఆలోచించుకుంటూ పోతే, ఎవరు ఎవర్ని "రా"కొట్టొచ్చు అన్నది అంత తేలిగ్గా తీర్మానాలు చేయలేం అనే.

అడిదము సూరకవి పద్యం నీకు గుర్తుందా సీతారామరాజుని మెచ్చుకుంటూ "నీకు నీవే సాటి" అన్నాడు. సభికులు మెచ్చుకున్నారు. రాజుగారు మెచ్చుకున్నారు కానీ నొచ్చుకోకుండా వుండలేకపోయారు తనంతటి ప్రభువుని నువ్వు అంటూ ఏకవచనంలో సంబోధించినందుకు.

సూరకవి వెంటనే,

క. చిన్నప్పుడు రతికేళిని

నున్నప్పుడు కవితలోనన్ యుద్ధములోనన్

వన్నెసుమీ 'రా' కొట్టుట

చెన్నగునో పూసపాటి సీతారామా!

పిల్లలవిషయంలో, పడగ్గదిలో, కవిత్వంలో, యుద్ధాలలో ఏకవచనం తప్పు కాదు అంటూ రాజుగారిని సమాధాన పరిచాడు.

ఇప్పుడు మనం ఆ జాబితాలో ముఖపుస్తకమిత్రులని కూడా చేర్చుకోవాలేమో. నెలరోజులక్రితం నాకో వినతిపత్రం వచ్చింది నా మిత్రమండలిలో చేర్చుకోమంటూ. నేను ఒప్పుకున్నాను. వెంటనే నా ఉత్తరాలపెట్టెలో "నువ్వు ఒప్పుకున్నందుకు సంతోషం చెల్లీ" అని కబురొచ్చింది. అది నాకు కొత్తగా అనిపించి, ఎందుకైనా

మంచిదని తాత్సారం చెయ్యకుండా వెంటనే, నాకు "ఈ వావివరసలు ఇష్టం లేదనీ, నారాతలు చదివి అక్కడే తమ అభిప్రాయాలు చెప్తే సంతోషిస్తాన"నీ జవాబిచ్చేను. మర్నాడు నాతపాల్పెట్టిలో మళ్ళీ ఈ అన్నాచెల్లీ వరస కలిపి  తనకి అదే ఇష్టం అంటూ వ్యాఖ్య పెట్టేరాయన. నేనింకేం చెప్పలేక నామిత్రమండలిలోంచి ఆయనపేరు తొలగించేసేను.   కయ్యానికీ, వియ్యానికీ, సెయ్యానికీ కూడా ఒకే అభిప్రాయం రెండుపక్కలా ఉంటేనే చెల్లేది. నాకు ఈ చెల్లి సంబోధన అలవాటు లేదు. మాయింట్లో మేం అందరం పేర్లతోనే పిలుచుకుంటాం.

ముఖపుస్తకంలో చూస్తున్నాను చాలామంది అన్నా, అక్కా, తమ్ముడూ అనుకోడం. క్రమంగా ఒకరిళ్ళకి ఒకరు వెళ్ళడం, ఆతిథ్యాలు స్వీకరించడం, స్నేహం మరింత బలపరుచుకోడంలాటివి. స్వతహాగా నేను ఎవరికీ పేగిరం దగ్గర కాలేను. నాబ్లాగు మొదలుపెట్టిన కొత్తలో కొందరు ఇలాగే దగ్గిరయి, స్వవిషయాలు మాటాడుకునే స్థాయికి పరిస్థితి చేర్చి, మళ్ళీ అదే క్రమంలో ఆస్నేహాలకి మంగళహారతి పాడేరు. ఇలాటివి తగినన్ని అయేక, సుమారుగా ఒక ఏడాదిక్రితం ఈ వ్యక్తిస్నేహాలకి నేనే మంగళహారతి పాడేశాను. ఫోనులో కూడా మాటాడనని నిర్ణయించేసుకున్నాను. ఇంగ్లీషులో ఒక నానుడి ఉంది చూడూ "ఏ ఒక్కజీవీ ఏకాంతదీవి కాలేడు," అని. నేను మాత్రం వాస్తవజీవితంలో దాదాపు ఆ స్థాయికి చేరుకున్నాను. కనీసం ఆ పొలిమేరల్లో తారట్లాడుతున్నాను.

అంతర్జాలంలో స్నేహాలు virtual స్నేహాలు. అవి నారాతలకే పరిమితం. నారచనలు ఆధారంగా ఎవరైనా నన్ను ఒక విధంగా ఊహించుకుంటే అది ఊహ మాత్రమే అని. నిజజీవితంలో నాబతుకేమిటో నా స్థితిగతులేమిటో తెలుసుకోడం నీకు నిజంగా సాధ్యం కాదు. నేను రెండస్థులమేడగురించి కథ రాస్తే నాకు రెండస్థులమేడ ఉందనుకోడం అమాయకత్వమే కదా. ఈమధ్య నాకు సెల్లు లేదు ఇల్లు లేదంటే ఆశ్చర్యపోయినవారిని చూసి ఆశ్చర్యపోవడం నాకో ఆట అయిపోయింది.

నా పరిచయాలన్నీ సాహిత్యరంగానికే పరిమితం అన్నాను కదా. నాకంటె పెద్దవాళ్లు నలుగురు ఉన్నారు కానీ వాళ్ళందరూ నన్ను మీరనే అంటారు. అంచేత నాకు ఆ

పదమే బాగా అలవాటయిపోయింది. వెనకటిపరిచయాలు తప్పిస్తే కొత్తగా పరిచయమైన వారెవరైనా నువ్వు అంటే నాకు ఎబ్బెట్టుగానే ఉంటోంది మరి. అట్టే వివరాలకి పోను కానీ మొత్తమ్మీద ముఖాముఖి కలవడం, మాటాడుకోడంద్వారా సొంత విషయాలు మాటల్లోకి వస్తాయి అనిపించింది. నాకు అది ఇష్టం లేదు అని చెప్తే వినిపించుకోనివాళ్ళే ఎక్కువ. ఇది ఆడవారిలోనే అంటారు కానీ మగవాళ్ళు కూడా తటస్థపడ్డారు నాకు. బహుశా ఇది కూడా నాప్రత్యేకతేనేమో. ఇంతకీ నేనేదో చాలా గొప్పదాన్ని, మీరందరూ నాకు మంగళారతులు పట్టాలి సదా అని కాదు. నాకు అదే అలవాటు అయిపోయిందీ, అంచేత నేను అలాగే జరుపుకుంటాను అంటున్నాను. అంతే.

పోతే, నేను ఎవరిని నువ్వు అనొచ్చు అన్నవిషయంలో కూడా జాగ్రత్తగానే ఉంటున్నాను. వారికి వారయి చెప్తే తప్ప స్వతంత్రించి నువ్వు అని నేను అనను.

సూక్ష్మంగా నాపద్ధతి ఇది -

1. "నువ్వు" అనమని నాకంటె చిన్నవాళ్ళు అడిగితే సరేనంటాను.

2. నాకంటె చిన్నవారయినా విజ్ఞతలో విద్వత్తులో నన్ను మించినవారిని "నువ్వు" అనమన్నా అనలేను. జ్ఞానానికి విద్వత్తుకి ఇవ్వవలసిన గౌరవం ఇవ్వడం మన సంప్రదాయం.

3. "అమ్మా" అన్న పిలుపు మనసంప్రదాయంప్రకారం బాగుంది కానీ అక్క, చెల్లి, అన్న, తమ్ముడు వంటివి ఇప్పుడు కొత్తగా అలవాటు చేసుకోడం నాకు కష్టమే మరి.

4. అన్నిటికంటె ముఖ్యమైన సంగతి - చాట్ చెయ్యను. వ్యక్తిగతవిషయాలతో ప్రైవేటు మెసీజీలు పెడితే నాకు సమ్మతం కాదు.

ఏకవాక్యంలో **నా స్నేహాలన్నీ సాహిత్యానికే పరిమితం.**

000

(జూన్ 3, 2016)

# 16. అతిథులే ఆచార్యులు

మనవాళ్ళు అతిథి దేవో భవ అంటారు. ఆచార్య దేవో భవ అంటారు. మరి గణితంలో చూస్తే, ఒక వస్తువు మరో రెండు వస్తువులకి విడివిడిగా సమానం అయితే, ఆ రెండు వస్తువులూ కూడా ఒకదానికొకటి సమానం అని కదా సిద్ధాంతం. ఆలెక్కన అన్నమాట అతిథి దేవుడితో సమానం అయితేనూ, ఆచార్యుడు దేవుడితో సమానం అయితేనూ, అతిథి ఆచార్యుడితో సమానం అని.

ఇప్పటికి చాలామార్లే చెప్పి ఉంటాను మాయింటికి వచ్చేవాళ్లు తక్కువని. అంచేత నాకు అతిథిమర్యాదలు అట్టే పట్టుబడలేదు. అంటే ఇష్టం లేదని కాదు. చెయ్యాలనే ఉంటుంది. చాలా తాపత్రయపడతాను కూడా. ఎవరేనా ఓ పూట, ఓ గంటసేపే అయినా వస్తారంటే, నేనేం చెయ్యాలి వారిని సంతోషపెట్టడానికి అని మూణ్ణెల్ల ముందునించీ ఆలోచిస్తాను. అదేలెండి మూణ్ణెల్లముందే వారు వస్తున్నారని తెలిస్తే. లేకపోతే, వారు వస్తున్నాం అని చెప్పినదగ్గర్నుంచీను.

ఇద్దరు ముగ్గురున్నారు అలాటి స్నేహితులు నాకు. ఇంటిముందునించో వీధిచివర్నుంచో, "ఎక్కడికో వెళ్ళి వస్తున్నాం. మీయింటిదగ్గరి రెండు నిముషాలు ఆగి నిన్ను పలకరించి పోదాం అనుకుంటున్నాం," అని చెప్తారు. అంటే అభ్యాగతులు అన్నమాట. వారికి నేను చెయ్యగలిగేదేమీ ఉండదు సాధారణంగా. నాలుగైదుమాట్లు చెప్పేను, "మాయింటికే అని కాకపోయినా ఇటు వస్తున్నారని మీకు ముందే తెలుసు కదా. అది నిర్ణయించుకున్నప్పుడు కాకపోతే కనీసం మీ ఉళ్ళో బయల్దేరుతూ ఓమాట నాచెవిని వేయవచ్చు కదా, నాకు కొంత వెసులుబాటు ఉంటుంది," అని.

నేను ఎన్నిమార్లు చెప్పేనో అన్నిమాట్లూ వాళ్లు, "అయితే ఏం అయిపోయిందిలెద్దూ,

నువ్వేదో మాకోసం చెయ్యాలని కాదు కదా మీయింటికొచ్చేది," అంటారు. "చారూ అన్నం పెట్టినా చాలు," అని కూడా నన్ను ఓదారుస్తారు.  ఆమాట అనడానికి బాగానే ఉంది కానీ మనకలా ఉండదు కదా. అదే మాట నేను వాళ్లింటికెళ్ళినప్పుడు అంటే చెల్లదు. కుర్చీకి నన్ను కట్టేయరు కానీ అంత పనీ చేసి అప్పటికప్పుడు రెండో మూడో కూరలూ పచ్చళ్ళూ చేసి, తినేవరకు వదలరు.

అసలు విషయం - నాలాటి అక్కుపక్షులు అంటే నాలుగు మెతుకులు ఉడకేసుకు ఏ గోంగూర పచ్చడితోనో గడిపేసే రకాలకి ఫ్రిజునిండా దట్టించి పెట్టిన ప్లాస్టిక్ డబ్బాలలో కూరలూ నారలూ ఉండవు. మరి ఎంతో దూరంనించి ఎన్నో ఏళ్ళతరవాత ఇంటికొచ్చినవారికి కొంతలో కొంతైనా, నా శక్తికొలదీ చెయ్యాలనే ఉంటుంది కదా.

మరో బాధ కూడా ఉంది. లేడికి లేచిందే ప్రయాణం అన్న సూక్తి అక్షరసత్యం నాపట్ల. ఏదో పని చేసుకుంటూనో చేసుకోకుండానో అలా తిరిగొద్దాం అనిపిస్తే ఠపీమని లేచి వీధిలోకి వెళ్ళిపోతాను. అంటే వాళ్ళు ముందు చెప్పకపోతే వాళ్ళు వచ్చేవేళకి నేను ఇంట్లో ఉండే అవకాశం లేకపోవచ్చు కూడాను. అలా కాక ఊళ్లోకొచ్చి మరెవరింట్లోనో భోజనాలూ మంతనాలూ ముగించుకుని, వెనక్కి వెళ్ళబోతూ నన్ను పిలిచేం అంటే, "మేం పిలిచేం మీరింట్లో లేరు" అంటే అది కేవలం "మేం పిలిచేం, నువ్వు ఇంట్లో లేవు," అని చెప్పుకోడానికి మాత్రమే పనికొస్తుంది. నేను దాన్ని మొక్కుబడి చర్య అనే అంటాను.

మొత్తమ్మీద అతిథులు మాయింటికి రావడం జరుగుతుందనుకుందాం కథ కొనసాగాలి కనక.  నేను లంచి అంటాను కానీ వాళ్ళు మొహమాటపడుతూ, "లంచీ కంచీ ఎందుకులెద్దూ, ఊరికే వస్తాం, కొంచెంసేపు కూచుని కులాసాగా కబుర్లు చెప్పుకుందాం," అంటారు. ఎన్నో ఏళ్లగా తెలిసినవాళ్ళు కనక నేను కూడా అట్టే పట్టు పట్టకుండా, అలాగే, "నీకు ఎలా ఇష్టమయితే అలాగే చేద్దాం," అంటాను.

అలాటి శుభముహూర్తంలోనే నాకు మరోసంగతి గుర్తొస్తుంది. ఎన్నో  ఏళ్ళకిందట వారింంట్లో ఉల్లిపాయ పకోడీలో, మిరపకాయ బజ్జీలో చేస్తే మహా ఇష్టంగా తిని

ఉంటాను. అంచేత హడావుడిగా వంటింట్లో ఏం ఉన్నాయో చూసుకుని, గ్రహములన్నీ అనుకూలంగా ఉండి, బజ్జీలు చేయగల మిరపకాయలు కనిపిస్తాయి. ఆహా, నాభాగ్యము అనుకుని "వస్తాం అని చెప్పేసి మాయింటిముందు ప్రత్యక్షమయిన అతిధులకోసం" మిరపకాయబజ్జీలు చేసేస్తాను. టీ తాగుతారో, కాఫీ తాగుతారో మర్చిపోయి ఉంటాను. రెంటికీ వీలుగా నీళ్లూ, పాళ్ళూ సిద్దం చేసి ఉంచుతాను. మిరపకాయ బజ్జీలు కాకపోతే కాకరకాయ కూర అనుకోండి లంచి కుదిరితే. ఏదో ఒకటి - ఇలా హడావుడి పడిపోవడం జరగడం నిశ్చయం.

తెలుగుదేశంలో కొంతకాలం గడిపిన ఒక అమెరికను ప్రొఫెసరు నాతో అన్నారు, "కనిపించిన ప్రతివారూ మాయింటికి రా మాయింటికి రా అని పిలిచేస్తారు. నాకు వీలు కాదంటే ఊరుకోరు. కాదూ కూడదూ తప్పకుండా వచ్చి తీరాలి, ఒక్క ఐదు నిముషాలు అలా వచ్చి పొండి. తెలుగు భోజనం తినకుండా వెళ్ళడానికి వీల్లేదు … అలా సరే వస్తా అనేవరకూ వదల్రు. తీరా వెళ్తే వస్తారనుకోలేదన్నట్టు చూస్తారు," అన్నారు.

మనం అతిథిమర్యాదలపేరున బలవంతం చేసేతీరు అనుభవైకవేద్యం. ఈమధ్య ఇది అంతగా కనిపించడంలేదు. అవతలివారు వద్దు అన్నా వీల్లేదన్నా సరేనని ఊరుకుంటున్నారు.

నేను ఇండియాలో ఉన్న రోజుల్లో అంటే 40 ఏళ్ళక్రితం ఈ మర్యాద ఇంకా ఉంది. ఓసారి ఒక ప్రొఫెసరుగారు భోజనానికి పిలిచేరు. నేను సందేహిస్తూనే వెళ్ళేను. ఆయనధర్మపత్ని కాస్త పాతకాలపు ఆచారాలు తెలిసినమనిషి. నేనేమో అట్టే తినగలమనిషిని కాను. ఆవిడ ఒక్కటేస్తాను ఒక్కటేస్తాను - అమ్మ పెట్టే రెండూ కాదు, గారెలే - అంటూ వడ్డించేస్తుంటే నాకు నానా అవస్థ అయింది. నాముందున్న అరిటాకుమీదకి వంగి రెండు చేతులూ అడ్డం పెట్టి, నేనింక తినలేనండి అంటూ కళ్ళనీళ్ళతో విన్నవించుకోవలసి వచ్చింది. ఆవిడకి మాత్రం నాపద్ధతి నచ్చలేదు. చిరాకు ఏమాత్రం దాచుకోకుండా, "మొండితనం," అంది. ఆమాట నాకూ నచ్చలేదు. ఆవిడది మాత్రం మొండితనం కాదూ?

ఇంతకీ వెనకటి కత - నేను వీలయినంతలో ఏవో చేసేసి, మూడుగంటలకి వస్తాం అన్నవారికోసం ఒంటిగంటనించీ ఎదురు చూస్తూంటాను. వాళ్లు మధ్యాన్నం లంచికీ సాయంత్రం భోజనానికీ కాకుండా మధ్యస్థంగా నాలుగున్నరకి తేల్తారు. దారిలో ఇంకెక్కడికో వెళ్ళి మరేవో పనులు చూసుకుని, ఇంకెవరింట్లోనో లంచి తిని ... అలా అలా సాగుతూ ఆఖరికి మాముంగిట తేలేరన్నమాట.

నేను చేసినవి చప్పగా చల్లారిపోతాయి. లేకపోతే, అతిథులు కారం తినడం మానేసి ఉంటారు. లేదా, లంచి ఆలస్యంగా తినడంచేత జీలకర్ర పోటకైనా చోటు లేదు కుక్షిలో అంటారు. ఆ తరవాత హాయిగా కబుర్లు మొదలవుతాయి. నేనెలా ఉన్నాను, వాళ్లెలా ఉన్నారు ... మీ అబ్బాయి, మాఅమ్మాయి, మా అల్లుడు, మీ అమ్మాయి, మాకోడలు, మీ మనవడు ... తరవాత ఇక్కడ చలి, అక్కడ ఎండలు, ఇక్కడ నాయకులు, అక్కడ వినాయకులు, ఇప్పటి కతలు, వెనకటి వ్యతలు... గంటన్నర గడిచిపోతుంది. మళ్లీ మరోచుట్టు మీ అమ్మాయేం చేస్తోంది, మాఅబ్బాయి ... గా ఉన్నాడు, మీ అమ్మాయి ... మరో పది నిముషాలు, అన్నట్టు సూపర్ బౌలు మీరు చూడరా? ఆఁ? మీరు చూస్తారా, టీవి పెడతాను, ... కొంచెం సౌండు పెంచండి, ... ఆఁ ... ఏమిటీ ... వినపడ్డంలేదు, టీవీగోలలో ... అలా నాస్వరమూ, టీవీ స్వరమూ పెంచుకుంటూ పోతాం ఓ మరో గంటసేపు. నాకు నోరు నొప్పెట్టి, వారినో ప్రశ్న అడిగి ఊరుకుంటాను. ఒకొకప్పుడు ఆ ఒక్కప్రశ్నకి సమాధానం ముప్పావుగంట సాగదీయబడుతుంది. ... మీరు కథలు రాస్తున్నారా? ... ఏదో గిలుకుతుంటా ... ఇండియాలో పత్రికలకి పంపిస్తారా? ... లేదు, ఈమధ్య నేను ఎక్కడికీ పంపడంలేదు. ...

ఇలా మరో గంట గడిచేక, ఇంక వెళ్తాం అంటారు. అప్పటికి భోజనాల వేళ. అంచేత ఉండండి. ఎలాగా భోజనాలవేళ అయింది కదా. తిని వెళ్దురు గాని అంటాను.

లేదులే, రాజుగారింటికొస్తాం అని చెప్పేం. ఓమాటు అటు తొంగిచూసి వెళ్ళిపోతాం. మళ్ళీ ఆలస్యం అయితే రోడ్డుమీద రద్దీ, కష్టం, మరోసారి వస్తాంలే అంటూ లేస్తారు.

వాళ్ళు వెళ్ళేక, అదేమిటి, ముప్ఫైయేళ్ళగా తెలుసంటున్నావు, మరి ఇప్పుడు

కొత్తగా అడుగుతారేమిటి కతలు రాస్తున్నావా అని? అంటుంది అంతసేపూ మొత్తం నాటకం తిలకిస్తున్న మాపొరుగు అమ్మాయి..

వాళ్ళని సాగనంపి, టీవీ కట్టేసి, అదంతేలే … ఏదో ఒకటి మాటాడాలి కదా … వాళ్ళకీ నాకూ కూడా కావలిసింది పొద్దు గడవడమే కదా అంటాను తగ్గుస్వరంలో.

మరో తరగతి నాకతలు చదివినవారు. కథలు చదివేం అన్నారు కనక మిమ్మల్ని చూడాలనుకుంటున్నాం అంటే కథలగురించి మాటాడుతారనుకుంటాను. పోనీ నావి కాకపోతే తమకి నచ్చిన మరో రచయితకథలు. తీరా వచ్చేక మాటలెలా ఉంటాయో పేరేటపాలో రాసేను. పిల్లలు ఉన్నవాళ్ళయితే వాళ్ళని తీసుకొస్తారు. దురదృష్టవశాత్తూ మాయిల్లు పిల్లలవినోదాలకి అనువైనది కాకపోవడంచేత మరింత ఇరకాటం అవుతుంది. వాళ్ళకి ఏవో తాత్కాలిక కాలక్షేపం కల్పించడం, వాళ్లగురించి మాటాడడంతో సరిపోతుంది. నేననుకున్నట్టు సాహిత్యం కబుర్లేం ఉండవు. మరి నామటుకు నేను రచయితలని కలుసుకున్నప్పుడు వాళ్ళింటికబుర్లూ మాయింటి కబుర్లూ మాటాడుకోలేదు.

మీరనొచ్చు మామూలుగా అందరూ ఎల్లవేళలా సాహిత్యమే మాటాడరు. తెలుగువాళ్ళం ఏవో కబుర్లు చెప్పుకోడం మామూలే అని. నిజమే. నాకు మాత్రం కొరతగానే ఉంటుంది. ఏం చెయ్యను? నాకు అలా ఉండదు మరి.

ఇంతగా ఇదంతా ఎందుకు రాస్తున్నానంటే ఏడాది క్రితం ఒకావిడ నాట్లాగు చూస్తుంటాననీ మిమ్మల్ని కలుసుకోవాలని ఉందనీ అంటే సరే అన్నాను. పైన చెప్పినట్టే నేను కథలగురించి మాటాడాతారనుకోడం, అలా జరక్కపోవడం జరిగింది. ఆ తరవాత నేను ఓ మెయిలిచ్చేను కానీ ఏ జవాబూ లేదు. ఇప్పుడు, ఇంతకాలం అయేక, మొన్న ఆవిడదగ్గర్నుంచి నాకు మెయిలొచ్చింది చాలాకాలం అయింది కలిసి మళ్ళీ వస్తాను కబుర్లు చెప్పుకుందాం అని. నాకు చెప్పలేనంత ఆశ్చర్యం కలిగింది. ఆనాడు పిల్లలతోనే గడిచింది కానీ ఆహా మంచిచర్చ జరిగింది అని కానీ కొత్త విషయాలు తెలుసుకున్నాను అని నాకు అనిపించలేదు ఆనాడు. ఇప్పుడు మళ్ళీ కలవాలనుందంటే ఏమనుకోవాలి!

"ఔతే అతిదులు ఆసార్లెట్ల ఔతారు?"

ఉలిక్కిపడి అటు చూసి, "వచ్చేవూ. మరో అతిథి కాని అతిథివి. చెప్పా పెట్టకుండా ఎప్పుడు పడితే అప్పుడు వచ్చేస్తావు," అన్నాను రవంత చిరాకుతో.

"అస్లు నీకతేంటో అజా పజా తేల్చేదాం అనొచీను."

"ఏముంది తేల్చడానికి?"

"నివ్ ఏటి సేస్తన్నవో గమనం సేసుకున్నవ అని అడగతన్న. నీకు ఇచ్చకాలు నచ్చవంతవు. మరి నీముకవొతకం సేయితల్తో నివ్ సెప్పుకునే ఊసులన్నీ ఏటి? ఆమీన అంతా నీయిస్టంపే అంటవు. నీకు కావాల్చినట్టే అంత సాగాలంటవు. నివ్వు ఏరంటవు. నీకేంవి తోస్తే అదే యేదం అంటవు."

నాకు మహా చిరాకేసింది ఆ వరస చూస్తుంటే.

"అదేం కాదు. నేను మిగతావాళ్ళమాటలు కూడా వింటున్నాను," అన్నాను చిరాకునణుచుకుంటూ.

"ఆరిమాట నీకు నచ్చితేనే గద. నానడగతన్నది నీవు ఆడ రాసీయన్నీ పెపంచకాన్ని ఉద్దరించీయేనేటి అని అడగతన్న," అంది సంధ్రాలు మరింత రెచ్చిపోతూ.

"అదేదో ఐదు నిముషాలు కాలక్షేపానికి. నేనెవరింటికీ వెళ్ళలేదు కదా."

సంధ్రాలు గుర్రుగా నావేపు చూసింది.

"ఇంతకీ ఏమంటావు?"

"నానంటన్నది సంగంవంటె ఏటి అని నివ్ సూస్కోనం నేదు. కతలు సదూతవు. టీవీలో నాటకాలు సూస్తవు. అయన్నీ ఏటి? యేరే మడుసులు, ఆల్ల కస్టంవూ సుకంవూ, మంచీ సెబ్బరా కావా? అయన్నీ నీకు బాగనె ఉన్నయి గద. అందుసేత నీయింటికొచ్చీవోరూ అంతే. మంచి సెబ్బర మాటాడతరు. అస్లు నీకు స్నేయితం బుద్ది నేదు. ఎవురన్న బయం నేదు. ఎవురికీ జవాబు సెప్పుకోను అంట నొద

ఎడతవు. నాకేటి అనిపిస్తన్నదో తెల్స. సూడంగ సూడంగ నివ్వు ఆ పబిలికనాయననాగే మాటాడతన్నవు. నీకూ రంపరికం వచ్చేసినాది."

హా?! తుళ్ళిపడ్డాను. ట్రంపరికం, ట్రంప్ కళలు, నాకొచ్చేసేయంటోంది సంధ్రాలు.

అయ్యో భగవంతుడా! అని తల పట్టుక్కూచున్నాను. ఇంత బతుకూ బతికి ఆఖరికి ఆఖరికి ఇలా తయారయేనా?

000

(జూన్ 23, 2016)

# 17. తప్పులున్నాయి, తరవాత మీఇష్టం

కాయితంమీద కలం పెట్టి ఉత్తరాలు రాసుకునే రోజుల్లో చివర్లో "తప్పులున్న క్షమించవలెను," అని ఒక వాక్యం చేర్చేవారు. భాషలో పొరపాట్లతోపాటు రాసిన విషయంలోనో రాసితీరులో మర్యాదాలోపం అయితేనో క్షమించమని ఆ విన్నపం. అదొక లాంఛనం, అంతే. నిజంగా తప్పులున్నాయని గానీ, దండన విధించమని గానీ కాదు.

ప్రాచీనకాలంలో రాతిమీద చెక్కిన శాసనాలలో అక్షరదోషాలు ఉండేవా అని నాకు ఇప్పుడు అనుమానం వస్తోంది. నాకు తెలీదు. తాటాకుగ్రంథాలలో తప్పులుండేవో లేదో కూడా నాకు తెలీదు. బహుశా ప్రెగడ నరసరాజు మొదలు పెట్టేడేమో ఈ సంప్రదాయం పెద్దల పద్యాలలో తప్పులు పట్టగలనంటూ. ఈయనెవరో గానీ ఈ తప్పులు పట్టు విద్య తప్ప మరే విశేషాలూ తెలీవు మహానుభావుడిగురించి, కనీసం నాకు. ప్రెగడ నరసరాజు ప్రగల్భాలూ స్వోత్కర్షలగురించి తెనాలి రామకృష్ణుడు చెప్పిన పద్యం ఎవరికైనా తెలీకపోతే ఇదుగో,

తెలియనివన్ని తప్పులని దిట్టతనాన సభాంతరంబునన్
పలుకగ రాదురోరి పలుమారు పిశాచపు పాడె గట్ట నీ
పలికిన నోట దుమ్ము వడ భావ్య మెరుంగక పెద్దలైన వా
రల నిరసింతువా ప్రగడ రాణ్ణరసా విరసా తుసా భుసా !!

తరవాత అచ్చు పుస్తకాలు వచ్చేక, galleyలో ఒకొక అక్షరం బోర్లేసి అమర్చుతున్నప్పుడు పొరపాట్లు రావడం సాధారణం అయిపోయింది. ఆరోజుల్లో ప్రూఫులు దిద్దినప్పుడు కనిపించిన తప్పులతో తప్పొప్పులపట్టిక తయారు చేసి పుస్తకంలో చేర్చేవారు. ఈ తప్పొప్పులపట్టిక చూసుకుంటూ ముందుకీ వెనక్కీ

పేజీలు తిప్పుకుంటూ ఎవరైనా చదుతారో లేదో నాకు తెలీదు. కానీ ఆవిషయంలో ప్రచురణకర్తలు వీలయినంతవరకూ శ్రద్ధ వహించేరని తెలుస్తోంది.

000

సారంగలో నావ్యాసం వచ్చేక, నాకు తప్పులకత రాయాలనిపించింది. నిజానికి ఇది రెండోమారు నేను రాయడం. ఇంతకుముందు ఒత్తులేవీ అని ఒక పోస్టు రాసేను. దానికి ఇది అనుబంధం అనుకోవచ్చు. సారంగ లో ప్రచురించిన వ్యాఖ్యానాలు నా అనుభవాలు వ్యాసానికి కూడా అనుబంధం అనుకోవచ్చు.

ఆ వ్యాసంలో నేను కరుణ ఏవ ఏకో రసః భాసుడివాక్యం అని నేను రాస్తే పాఠకులు భాసుడు కాదనీ భవభూతి అని చెప్పేరు. అలాటి సూచనలు నేను ఆహ్వానిస్తాను. వీటివల్ల నేను ఒక ముఖ్యమైన అంశం సరి దిద్దుకోడానికీ, వ్యాసం మరింత పరిపుష్టం చేయడానికీ వీలయింది. భవిష్యత్తులో ఎవరైనా ఈ వ్యాసం చూస్తే, సరైన సమాచారం అందుతుంది. వ్యాఖ్యాతలనుండీ నేను ఆశించేది అదే. అలాగే పొరపాటున ఒకే వాక్యమో పేరానో రెండుమార్లు వస్తే అది ఎత్తి చూపితే కృతజ్ఞతతో ఆహ్వానిస్తాను.

ఇక్కడ మరో ముఖ్య విషయం ఆనందంగా చెప్పుకుంటాను. ఆ పొరబాటుగురించి సారంగ సైటు సంపాదకులలో ఒకరైన కల్పనా రెంటాలకి మెయిలు ఇచ్చేను వీలయితే ఆ పొరపాటు సరిదిద్దమని కోరుతూ. సాధారణంగా అచ్చుపత్రికలలో ఇలా తప్పులు దిద్దడం సాధ్యం కాదు. జాల పత్రికలలో ఎంతమంది సంపాదకులు ఇలాటి అధికశ్రమకి సుముఖులో నాకు తెలీదు. అందుకు వారిని నేను తప్పు పట్టను. వీరంతా అనేక వ్యాపకాలమధ్య ఈ పత్రికలు నడుపుతున్నవారే కనక ఈ దిద్దిబాట్లు సాధ్యం కాదంటే నాకు అర్థమవుతుంది. ఈ నేపథ్యంలో నా అభ్యర్థనను మన్నించి, కవిపేరు సరి దిద్దిన కల్పనా రెంటాలకి నా మనఃపూర్వక ధన్యవాదాలు తెలియజేస్తున్నాను ఇందుమూలంగా.

ఇప్పుడు నిజ తప్పులగొడవ చెప్తాను. ప్రెగడ నరసరాజు తప్పులు పట్టడానికి ఆద్యుడేమో అన్నాను కదా. నిజంగా నాకు తెలీదు. ఇది నాఊహ మాత్రమే. ఏమైనా

ఆ రోజుల్లో అదొక ప్రత్యేకకళ అయిఉండాలి. అందుకే ఆయన తప్పులు పట్టడంలో తనకంటే ఘనుడు లేడని ప్రముఖకవులని సవాలు చేస్తూ ఊరూరా తిరిగేడు.

ఆధునికకాలంలో ఈతప్పులు పట్టడానికి కారణాలు వెతికేముందు అసలు తప్పులు ఎందుకొస్తున్నాయో చూదాం.

1, ప్రధానంగా కంప్యూటరు తెరమీద అక్షరాలు సరిగా కనిపించకపోవడం ఒకటి కావచ్చు. ప్రస్తుతం నేను వాడుతున్న Kingwriterలో ద్విత్వాక్షరాలు కొన్నిచోట్ల కిక్కిరిసిపోయి ఉంటాయి. లైను ఎడం పెంచడానికి ప్రయత్నించేను కానీ సాధ్యం కాలేదు. అలాగే కొన్ని Keyboard layoutలో ఏ అక్షరం ఎక్కడుందో కనుక్కోలేకపోవడం మరో కారణం. ఈ కారణంగానే కొన్ని పదాలకి కొత్త వర్ణక్రమాలు వచ్చి స్థిరపడిపోయాయి. ఉదాహరణకి జ్ఞానంకి జ్నానం, వృద్ధుడు కి వృుద్ధుడు, మృతుడుకి మ్రుతుడు చెప్పుకోవచ్చు.

2. మాండలీకాలు. ఒక ప్రాంతంలో వచ్చేడు అంటే మరో ప్రాంతంలో వచ్చాడు అనొచ్చు. ఇంకా వచ్చిండు అనో వచ్చినాడు, ఒచ్చినాడు, ఒచ్చేడు … ఇలా అనేక రూపాలు పలుకుతున్నారు, రాస్తున్నారు. ఇది చాలామందికి స్పష్టంగానే తెలుసు కానీ తెలీనివి కూడా అనేకం ఉన్నాయి. మాండలీకం, కుటుంబసంప్రదాయాలమాట వదిలేసినా మేం ఇలాగే మాటాడతాం అని ఎలా వినిపిస్తుందో అలా రాయడం పద్ధతిగా జరుగుతోంది. ఉదాహరణకి లక్ష్మివారం లక్షింవారం అని పలకడం ఉంది. అక్షరదోషం లేకుండా రాయాలంటే లక్ష్మివారం, పలికినట్టు రాస్తే లక్షింవారం. ఇది గుర్తించనివారు లక్షింవారం తప్పు అని ఎత్తి చూపవచ్చు.

3. ఇది నిజానికి ఎక్కువగా జరుగుతున్నది. తొందరపాటు. ముఖ్యంగా అంతర్జాలంలో గుంపులు అరచేతిలో ఐఫోనులో అంగుళంన్నర చదరపు కీబోర్డుమీద గబగబ టైపు చేసేస్తున్నప్పుడు తప్పులు దొర్లుతాయి. దిద్దుకునే ఓపికా ఉండదు, తీరికా ఉండదు.

అమ్మా, బాబూ, ఇదీ నేపథ్యం నేను చెప్పదలుచుకున్న విషయానికి. నాకు భాషాభిమానం ఉందని ఒట్టి గొప్పలు చెప్పుకోడం కాదు. ఆచరణలో పెట్టడానికి

కూడా యథాశక్తి ప్రయత్నిస్తాను మీరు నమ్మినా నమ్మకపోయినా. తప్పులు లేకుండా రాయడానికి శ్రమపడతాను. రాసింది పదే పదే చూసుకుంటాను. అయినా కొన్ని రెండో మూడో తప్పులు దొర్లుతాయి. పైన చెప్పిన కారణాల్లో మొదటిది కొంతవరకూ నాపట్ల నిజం.

ఈ మధ్య తరుచూ కనిపిస్తున్న వ్యాఖ్య "తప్పులున్నాయి, దిద్దుకోండి" అని. నేను బ్లాగు మొదలు పెట్టిన కొత్తలో అంటే 2007 డిసెంబరులో ఈ వ్యాఖ్య కనిపించినప్పుడు చాలా గాభరా పడిపోయి మళ్ళీ మళ్ళీ చూసుకుంటూ వచ్చేను కానీ అనతికాలంలోనే గ్రహించినది ఏమిటంటే తప్పులు లేకుండా రాసినంతమాత్రాన పాఠకులసంఖ్యేమీ పెరగలేదు సరి కదా తప్పులున్నాయని ఎత్తి చూపినవారు కూడా పోస్టులు చదువుతున్న జాడ లేదు. అంటే పదోతరగతి composition classలోలాగ పాఠం చెప్పడంవరకే వారి ధర్మం అన్నమాట. అందరూ చదువుతారని హామీ ఏమీ లేదు.

అనేక తప్పులతో అచ్చయిన నా పుస్తకాలు ఆఫీసుకి టైమయిపోతున్నా ఆపకుండా చదివేసిన వారున్నారని విన్నాను. నాపేరు ఏనాడూ వినకపోయినా పుస్తకం లైబ్రరీలో చూసి సందేహిస్తూనే తీసుకుని పూర్తిగా చదివేసినవారున్నారు. ఆఖరికి నాకర్థమయింది ఏమిటంటే తప్పులు పట్టడం ఫేషను. "తప్పులంటే నాకు అసహనం," "తప్పులుంటే చదవలేను" అనుకునేవారకి చదవడానికి తప్పుల్లేని పుస్తకాలు ఎన్ని దొరుకుతున్నాయో నాకు తెలుసుకోవాలని ఉంది. ఆశ్చర్యపోకండి. ఎడిట్ చేయడమే వృత్తిగా స్వీకరించి డబ్బు తీసుకుని ఎడిట్ చేసినపుస్తకాల్లో కూడా, ఇంగ్లీషు పుస్తకాల్లోనే తప్పులు చూసేను నేను. అంచేత అమెరికాలో అయితే ఇలా జరగదు అనొద్దు. తప్పులు మానవసహజం.

ఒకమారు ఒకమ్మాయి నావ్యాసంలో తప్పులున్నాయని చెప్పింది. ఆ తరవాత కొన్ని రోజులయేక ఆ అమ్మాయే మరొక బ్లాగులో మరోటపాకింద వ్యాఖ్యానించింది. ఆవ్యాసంనిండా లెక్కకు మిక్కిలి అక్షరదోషాలున్నాయి. మరి అక్కడ అక్షరదోషాలగురించి వ్యాఖ్యానించలేదేం? అని అడిగితే "ఏం చెప్తాం" అని

నాస్చేసింది. అంటే అక్కడ విషయం తనకి నచ్చింది కనక తప్పులు బాధించలేదు. నాపోస్టులో విషయం నచ్చలేదో, నేను సరిగా ఆవిష్కరించలేదో కానీ అక్షరదోషాలు మాత్రమే కనిపించేయి ఆవిడకి. లేదా నాదగ్గరున్న చనువుమూలంగా అనుకోవాలి. ఇది అమెరికాలో సర్వసాధారణం. విషయంమీద వ్యాఖ్యానించడానికి ఏమీ లేకపోతే (వారిదృష్టిలో), వర్ణక్రమంమీదకి దాడి చేస్తారు లేదా ఏదో ఒకటి వ్యాఖ్యనించాలన్న తపన.

నాబ్లాగు చూసేవారిలో సాహిత్య అతిరథులూ, మహారథులూ కూడా ఉన్నారు. నేను మాటాడేవిషయాలమీద వారికి ఏ అభిప్రాయాలూ తోచవేమో ఫాంటు సైజు పెంచండి, ఫలానావాక్యం ఇలా ఉండాలి, ఫలానాచోట గుణింతం సరిగా లేదు లాటివ్యాఖ్యలు మాత్రమే రాస్తారు. నేను రాసేవిషయాలు తమకి బాగులేకపోతే నాబ్లాగు చూడడం మానేయవచ్చు. అది మరి నాజాతకమేమో తెలీదు కానీ విషయంమాట ఎత్తకుండా కేవలం అక్షరదోషాలగురించే వచ్చే వ్యాఖ్యలు నాకు ఎక్కువగానే ఉంటున్నాయి.

ఇన్ని ఆక్షేపణలు చూసేక, నాకళ్ళు కూడా ఈ తప్పులమీద పడుతున్నాయి. అయితే అవి నన్ను అందరూ అనుకున్నంతగా బాధించవు. విషయం నాకు నచ్చితే చదువుకుంటూ పోతాను. నచ్చకపోతే, తప్పులు లేకపోయినా, దానికి బంగారు మలామా వేసినా చదవను.

నాకు ఓపినంతవరకూ తప్పులు లేకుండా చూసుకుంటున్నాను. ఐనా ఇదేమీ డబ్బిచ్చి కొన్నుక్కున్నేది కాదు కదా అని నేనడం బాగుండదు. నిజానికి డబ్బెట్టి కొనుక్కున్నపుస్తకాలలో కూడా తప్పులుంటున్నాయి. అంతకంటె ఏమీ చెప్పలేను. ఆపైన మీఇష్టం. వస్తువు వదిలేసి అక్షరదోషాలగురించి మాత్రమే వ్యాఖ్యానించడం పెట్టెలో వస్తువుని వదిలేసి, package మాత్రమే చూడడంలాటిది. నాక్కావలసింది వస్తువుమీద మీఅభిప్రాయాలు మాత్రమే. ఇంతవరకూ చదివేరంటే మీకు ఈవిషయంమీద ఆసక్తి అనే అనుకుని ధన్యవాదాలు చెప్పుకుంటున్నాను.

000

(జులై 15, 2016)

# 18. నా వంటలపుస్తకం రెండే పుటలు!

ఆర్నెల్లయింది నా వంటింటి సంబరాలగురించి రాసి (గొలుసు ఇక్కడ). నేను ఆర్నెల్లకొకమారైనా పాకగృహము ప్రవేశించి పావనం చేస్తానని మీరు అనుకోవాలని.

ఈటలాకి స్ఫూర్తి నిన్న మధ్యాహ్నం నా నిత్యసంచారానికి తలుపు తీస్తే కనిపించిన దృశ్యం!



ఇదేమిటి ఎగిరేపళ్ళెం వచ్చి నాముంగిట వాలినట్టు గ్రహాంతరవాసులైనా వేంచేసేరా అభ్యాగతులుగా అనుకుంటూ దిక్కులు చూసేను. చూసి జడుసుకున్నాను అనలేను కానీ ఉలిక్కిపడ్డమాట వాస్తవం. తరవాత, బహుశా ఇదేదో నాకు తెలీని సంప్రదాయం కాబోలు, ఇవాళ గుమ్మడికాయ పంచిపెట్టేదినం కాబోలు అనుకుని చుట్టూ ఉన్న గుమ్మాలముందు చూసేను. మరెక్కడా కనిపించలేదు. పైగా ఇది అద్దెవాటా భవంతి కనక ఎవరికీ గుమ్మడితోటలు వేసుకునేటంత స్థలం ఉండదు.

ఈకాయ చూసి అనుమానించడానికి కారణం నా దుర్భరమానసికస్థితి. తెల్లారి లేస్తే వార్తలనిండా కాల్పులూ, హత్యలూ, మారణహోమాలూ. అంచేత నా బుర్రనిండా అవే ఆలోచనలు. ఇంకో సంగతి - ఈకాల్పులూ, కాబోయే అధ్యక్షుల వెకిలిమాటలూ భరించలేక Forensic files, Investigation Discovery Channel అదే పనిగా చూస్తున్నాను. ఈ రెండు ఛానెళ్ళూ ఒక్క వారం రోజులు చూస్తే చాలు ఒక ప్రాణం తియ్యడానికి ఎన్ని రకాల మార్గాలున్నాయో క్షుణ్ణంగా తెలిసిపోతుంది. మొన్నటికి మొన్న ఒక ప్రబుద్ధుడు భార్య మరణించిన సమయంలో తాను దేశానికి ఆవలితీరంలో ఉన్నానని సోదాహరణంగా చూపి తన నిర్దోషిత్వాన్ని నిరూపించాడు.

తీరా చూస్తే ఆ కుటిలుడు చేసిన కుట్ర ఏమిటంటే ఊరు విడిచి పోయేముందు ఉప్పులో సైనైడు కలపడం. పాపం, ఆ ఇల్లాలు ఆ ఉప్పు ఆమ్లెట్ మీద చల్లుకుని ప్రాణంమీదకి తెచ్చుకుంది. ఇలాటివి చూసేక ఎవరికైనా ఏమనిపిస్తుంది చెప్పూ.

ఈ కారణాలన్నిటిమూలంగా నాకు రాకూడని ఆలోచనలు వచ్చేయి. కానీ ఏం చెయ్యను? నాకసలు ఈచుట్టుపట్ల ఎవరితోనూ అంతగా ఇచ్చి పుచ్చుకునే పరిచయాలు లేవు. ఆఖరికి తెగించి భవంతి మేనేజరుని పిలిచి అడిగేను ఆకాయ ఇంట్లోకి తెచ్చుకునేముందు. అదృష్టవశాత్తు ఆవిడకి తెలుసుట ఎవరై ఉంటారో. చెప్పింది ఫలానావాటాలో ఆవిడ వాళ్ళ చుట్టాలతోటలోంచి నాలుగో పదో కాయలు తెచ్చేనని ముందురోజు మేనేజరుకి చెప్పిందిట.

ఆ కాయవల్ల ప్రమాదం లేదని దృఢపరుచుకున్నాక లోపలికి తెచ్చి, పరిశోధన మొదలు పెట్టేను యం.ఫిల్. కోసం పాటు పడుతున్నంత దీక్షతో. మొదట పేర్లు అంతర్జాలంలో చూస్తే - Peter pan squash, white summer scalloped squash, white summer squash అని తెలిసింది. నాకు మాత్రం UFO squash అనాలనుంది. పోనీ, విష్ణుచక్రాలు అనో దాకగుమ్మడికాయ అనో పేరు పెట్టుకుంటే బాగుండు అని ఆలోచిస్తున్నాను.

నామకరణం తరవాత చూద్దాం ఎలా వండుకు తినడమా అని ఆలోచించేను. ఇది నేనెప్పుడు చూడలేదు కనక వండలేదని వేరే చెప్పఖ్ఖర్లేదు. సుమారుగా గుమ్మడికాయలా కనిపిస్తోంది కనక అదే పద్ధతి దీనికి కూడా పనికొస్తుందని నిర్ణయించుకున్నాను. కానీ అన్నీ అనుమానాలే. మనం బూడిద గుమ్మడికాయ తొక్క తీస్తాం. తీపి గుమ్మడికాయ తీయవచ్చు, తీయకపోవచ్చు. ఆనపకాయ అదే సొరకాయ అయితే అస్సలు తీయఖ్ఖర్లేదు.

మళ్ళీ అంతర్జాలంమీద పడ్డాను. పూర్వం అంటే ఇరుగమ్మనో పొరుగమ్మనో అడగాలి కానీ ఇప్పుడు అన్నిటికీ అంతర్జాలమే కదా సర్వరోగనివారిణి. చూడాలే కానీ రెసిపీలు కుప్పలుతిప్పలు. నీకు తెలుసో తెలీదో అమెరికనుల రెసిపీలు సుమారుగా అన్నీ ఒక్కలాగే ఉంటాయి. పొయ్యిమీద గిన్నెలో ముక్కలు పడేసి కాస్సేపు

ఉడకపెట్టో లేదా వెయ్యి అదేలే అవెనులో పెట్టో ఉప్పూ, మిరియాలపొడి చల్లుకోమంటారు. ఇంత సుళువుగా కాదులే. కొలతలు, కాలమానాలూ, గిన్నెరకాలూ యజ్ఞం చేసినట్టే తంతు వివరిస్తారు. ఇంక ఉప్పు కాకపోతే బటర్. అంతే. మరో రెసిపీ చక్రాల్లా తరిగి ఆలివు నూనెలో మూడు నిముషాలు దోరగా వేయించుకు మళ్లీ ఉప్పూ మిరియాల పొడి... ఈ రెసిపీలు మనతెలుగు నాలుకకి ఆనవు.

తెలుగు రెసిపీలు కూడా కనిపించేయి కానీ పద్ధతులు సుదీర్ఘంగా ఉన్నాయి. నాకు తేలిగ్గానూ త్వరగా అయిపోయేవిగానూ కావాలి.

ఇహ ఇది కాదు పని అని నా రెసిపీ నేనే సృష్టించుకున్నాను. నిజానికి నాకో recipe template ఉంది. అవునమ్మా అసలు కథ - 3 పుటల వంటలపుస్తకం ఇక్కడా మొదలయింది. అది సుమారుగా ఇలా ఉంది.

ఏ కూరైనా సరే ముక్కలు తరుక్కో.

నూనె కాచి ఆవాలూ, మినప్పప్పూ, ఎండు మిరపకాయలూ తెలుసు కదా పోపు.

మూకుట్లోనో ముక్కలు పట్టే గిన్నెలోనో పోపేసి అందులో కూరముక్కలు పడేసి, ఇన్ని నీళ్ళు చల్లి మూత పెట్టి ఉడకనియ్యి.

లేదా -

మూకుట్లో నూనె వేసి అందులో ముక్కలు పడేసి ఉప్పు చల్లి మూత పెట్టు కూరముక్కలు ఉమ్మగిల్లేవరకూ. ఆ తరవాత మూత తీసి, కారం చల్లి మరి కొంచెంసేపు వేయించు. కరకరలాడేలా కావాలంటే మరో రెణ్ణిముషాలు వేగనియ్యి. మధ్యమధ్యలో కలుపుతూ ఉండు సుమా మాడిపోకుండా.

నాకు కొన్ని ఆపద్ధర్మం పొడులు రెండున్నాయి.

1. కూర పొడి

శనగపప్పు, మినప్పప్పు, ఎండుమిరపకాయలు, ధనియాలు, జీలకర్ర వేయించి

పొడి కొట్టి పెట్టుకుంటాను ఏ కూర వేయించినా ఆ పొడి ఓ చెంచాడు చల్లేస్తే అద్భుతమైన రుచి వచ్చేస్తుంది. ఈ పొడిలోనే మెంతిపొడి కూడా కలిపితే కొన్ని కూరల్లో బాగుంటుంది ఆ కూరలు వంకాయ, చిక్కుడుకాయ, కాకరకాయ (ఇది అందరికీ రుచించకపోవచ్చు), దొండకాయాను. బెండకాయ అయితే ధనియాలపొడి చాలు.

2. నువ్వులపొడి

నువ్వులు, ఎండుమిరపకాయలు దోరగా వేయించి, ఉప్పు కలిపి పొడి కొట్టి పెట్టుకుంటాను. కాలిఫ్లవర్ వేయించో కాబేజీ పోపేసో ఈ పొడి చల్లితే చాలు ఎక్కళ్ళేని రుచీనూ.

ఇంకా పచ్చికారం, కొత్తిమీరకారంలాటివి ఉన్నాయి. పచ్చిమిరపకాయలు, ఉల్లిపాయలు, ఉప్పు ముద్దగా నలగ్గొట్టి ఉడికిన కూరలో కలిపితే పచ్చికారం.

కొత్తిమీర, పచ్చిమిరపకాయలు, ఉల్లిపాయలు, ఉప్పు ముద్దగా నూరుకుని ఉడికినకూరలో కలిపేస్తే కొత్తిమీరకారం.

అలాగే ఫలహారాలూను. ఒక ఉదాహరణ చెప్తాను. చల్ల పొంగరాలు తలపెట్టేవనుకో.

రవ, మైదా (నేను గోధుంపిండి వాడతాను), బియ్యప్పిండి సమపాళ్ళలో పెరుగులో కలిపుతాను. రవ కొంచెం ఎక్కువ వేస్తే ఎక్కువ కరకరలాడతాయి. ఈ పిండిలో

కారం కావలసినంత

ఉప్పు పట్టినంత

ఉల్లిపాయముక్కలు ఇష్టం వచ్చినంత

జీలకర్ర తోచినంత

అల్లం ముక్క - ఫరవాలేదనిపించేంత వేస్తాను.

ఇవన్నీ బ్లెండరులో వేసి కచ్చా పచ్చా నలిగేలా నాలుగు క్షణాలు తిరగనిస్తాను. ఆ ముద్ద ముందు కలుపుకున్న పిండిలో కలిపేయడమే.

ఇదే -

అ) రొట్టెలపిండిలా గట్టిగా కలిపితే పకోడీల్లా వేయించుకోవచ్చు. ఇవే చల్ల పొంగరాలు.

ఆ) నీళ్ళు కలిపి పల్చగా దోసెలపిండి చేసుకుంటే రవదోసె.

అంతే నా వంటలు.

అన్నట్టు అసలు మొదలుపెట్టింది విష్ణుచక్రంకాయ ఏం చెయ్యడమా అని కదూ. ఇంకా ఏమీ చెయ్యలేదు.

000

(జులై 21, 2016)

# 19. శరీరమే చెప్తుంది ఏం కావాలో

ఈపోస్టుకి కోడిగుడ్డుతో సరాగాలు అని పేరు పెడదాం అనుకున్నాను కానీ ఇది అంతకంటే విస్తృతమైన వ్యవహారం. అసలు ఈపోస్టుకి చాలా పేర్లు పెట్టొచ్చు. ఇంతకముందు రాసిన నాఆరోగ్యసూత్రాలకి ఇది రెండోభాగం అనుకో. లేదా వంటలపుస్తకం-రెండో భాగం, నా యోగా యాగీ అంటూ. అంచేత ఇది చదివినవారికి అనేక పోస్టులు చదివిన ఫలము కలుగును. సకలసౌభాగ్యములమాట మాత్రం చెప్పలేను.

ప్రధానంగా నేను ఏరోజు ఏం తింటాను అన్నది న మెదడు ఉపయోగించో జాలంలో ఎవరో చెప్పిన అనన్యసామాన్యమైన రెసిపీ చూసో  జరగదు. న దేహమే నాకు చెప్తుంది. ఇంకా నిర్దుష్టంగా చెప్పాలంటే ఆజ్ఞలే. నేనలా చెయ్యను అనడానికి నాకు అధికారం లేదు.

"నేను" అంటే నాదేహం అదే కదా ఈ చరాచరజగత్తులో అని అడక్కు. శరీరం లేకపోతే నేను లేను అని నాలుగోతరగతి కుర్రాడు కూడా చెప్పేయగలడు. అదే సత్యము నీకు సంబంధించినంతవరకూ. నాకు సంబంధించినది వేరే ఉంది. ఇది చెప్పడానికే ఈ పోస్టు.

నాదేహంతో నాసంభాషణ ఇలా ఉంటుంది. నాలుక పిడచకట్టుకుపోతోందనుకో.

"లేచి మజ్జిగలో ఓ ఉప్పుగడ్డ వేసుకు తాగరాదూ."

ఆకలేస్తున్నట్టుంది.

"నాకివాళ పకోడీలు తినాలనుంది."

పకోడీలేమిటి ఎవరైనా వింటే నవ్వుతారు. మధ్యాహ్నంపూట సంపూర్ణాహారం తినాలి.

"వీల్లేదు. నాకు పకోడీలే కావాలి."

000

"నాకిప్పుడు మైసూరుపాకు కావాలి."

శనగపిండి లేదు. రేపు చూదాంలే.

"వెళ్ళి తీసుకురా శనగపిండి, మంచి నెయ్యి కూడా తీసుకురా."

000

సంచారానికి వేళయింది. కాళ్ళు లాగేస్తున్నాయి. ఇవాళ ఎక్కువ దూరం వెళ్ళను.

"పోషకపదార్థాలు తినాలని చెప్పేను కదా."

నాకు చిరాకు వేస్తుంది. పకోడీలు, మైసూరుపాకు తింటే ఎలా వస్తుంది బలం అంటే వినదు శరీరం. సరే, ఏం చేస్తాం, ఈ నశ్వరశరీరం ఉంటేనే కదా నేను ఉండేది. అది చెప్పినట్టు వినాలి అని వారినీ వీరినీ, అడిగీ, అంతర్జాలం చూసీ అనేక పోషకహారాల వివరాలు సేకరించేను. టోఫూ, చియాగింజలు బాగానే ఉన్నాయి. అలాగే కాటేజి ఛీజ్ నాకు చాలా నచ్చింది. సెజ్జగింజలు పొడి కూడా చాలా మంచిది అన్నారు కానీ ఒకసారి కొన్నది బాగుంది, రెండోమారు కొన్నది కొంచెం చేదుగా ఉంది. వేయిస్తే చేదు చస్తుందన్నారు. ఏమైనా ఇంకా ఏమేం ఉన్నాయా అని ఆలోచిస్తున్నాను.

"కోడిగుడ్డు తిను."

నాదేహం ఇలాటి అర్జీలు పెట్టినప్పుడు నిజంగానే నాకు కోపం వస్తుంది. అంటే కోడిగుడ్డు తింటే నాబ్రాహ్మణ్యం మంట గలుస్తుంది, కాశీలో ప్రాయశ్చిత్తం చేసుకోవాలి అని కాదు. ఈదేశం వచ్చినప్పుడే అది మంట గలిసిపోయింది నాకే తెలీకుండా. ఎలా అంటే ఏహోటలుకో వెళ్లినప్పుడు అత్యంత జాగ్రత్తగా పరిశీలించి వెజి సూపు తెమ్మని అడుగుతాను. కొంతకాలం అయేక తెలుసుకున్నది వెజీ అంటే కూరగాయలు కూడా ఉన్నది అనే కానీ కేవలం కూరగాయలతో మాత్రమే చేసినది కాదు. ఆతరవాత తెలిసింది కేవలం కూరగాయలే ఉన్నా ఏ చికెన్ స్టాకో ఉంటుంది. మరి ఒకమారు

వ్రతభంగం అయింతరవాత ఇక ఏం తిన్నా తినకపోయినా ఒకటే కదా.

ఒక సారి విస్కాన్సిన్లో ఏదో హోటలులో ఇలాగే వెజీ సూపడిగితే, ఆసర్వరు చాలా విచారంగా మొహం పెట్టి, అందులో చికెన్ స్టాక్ ఉంది అన్నాడు. విస్కాన్సిన్లో భారతీయ సంస్కృతి తెలిసినవారు ఎక్కువ. అతనికి అంత తెలిసినప్పుడు అతని జ్ఞానాన్ని నేను గౌరవించాలి కదా. అంచేత సరే అయితే మరేదైనా తీసుకురా అన్నాను.

ఇంతకీ నాకు పోషకపదార్థములు అవుసరం అని తెలిసేక, బోలెడు పరిశోధనలు చేసేను అన్నాను కదా. ఇచ్చే నాథుడు లేడు కానీ ఒక యం.ఫిల్ అయినా వచ్చి ఉండేది నేను సేకరించిన సమాచారానికి.

సరే. సున్నపుకాయ కథ. అన్నట్టు చెప్పేనా నా కాలేజీరోజుల్లో కొత్తగా ఆధునిక తిళ్లు మొదలు పెట్టినవాళ్లు కేకులాటివి ఇంట్లో చేసేవారు. కానీ కోడిగుడ్డు అన్న పదానికి మాత్రమే అభ్యంతరం. అంచేత సున్నపుకాయ అనేవారు!

నేను చాలాకాలంగానే కేకు, ఐస్క్రీంలాటివి తింటున్నాను. వాటిలో కోడిగుడ్డు సొన ఉంటుందని తెలుసు కూడా. అంచేత నాకు అభ్యంతరం లేదనే చెప్పాలి మాటల్లో చెప్పాలంటే. తినడానికొస్తే మాత్రం ఆమ్లెట్లాటివి తినను. అంటే తినలేను. నా నాలుక ఆ రుచికి సుముఖం కాదు. మరి ఇష్టపడుతూ తింటేనే కదా తిన్నది ఒంట బట్టేది.

అంచేత దానికి ప్రత్యామ్నాయ పద్ధతికోసం ప్రయోగాలు మొదలుపెట్టేను. మొదట అందరిలాగే రెండు గుడ్లు చితక్కొట్టి ఆసొనలో కొంచెం పాలూ, ఉప్పూ, పచ్చి మిరపకాయలూ, ఉల్లిపాయలూ వేసి నూనెలో వేసి వేయించేను.

"బాగులేదు."

టొమోటోలు, కొత్తిమీర వేసేను.

"ఊహు, నాకు బాలే."

ధనియాలూ, జీలకర్రా పొడి కొట్టి కలిపేను.

"యాక్."

చెక్కా, మొగ్గా, యాలకపొడి ... మొత్తం అరలో ఉన్న పచారీసామాన్లన్నీ కుమ్మరించి మరికొంచెంసేపు వేయించేను.

"ఛీ. నాకొద్దు కాక వద్దు."

ఆఖరికి నాకు అర్థమయింది. నాబుర్రలో "గుడ్డు రుచి బాగుండదు" అని గట్టిగా పాదుకుపోయింది. నేను చేస్తున్నంతేపూ ఆభావం నాబుర్రలో అలా మెదుల్తూనే ఉంటుంది. ఇంకెవరయినా చేసి పెడితే తప్ప నాకు కోడిగుడ్డు తినే యోగం లేదు. మరో పద్ధతి ఏమిటంటే నాలుక కాలిపోయేంత కారం, అగ్నిమాపకదళంవారి అవుసరం అయేంత కారం అన్నమాట, తగిలిస్తే కొంత లాభం కనిపించవచ్చు. అంటే ఆ కారం నసాళానికంటి ఆతరవాత మరే రుచీ తెలీదు. హ్మ్. లేదులే, ఈ రెండూ జరిగేవి కావు.

అప్పుడే తెలిసింది ఒక చెంచాడు అవిసెగింజలపొడి ఒక గుడ్డుకి సమానంట పోషకాహారం దృష్ట్యా. అంచేత ఇప్పుడు అవిసెగింజలమీద పడ్డాను. కూరల్లో కొంచెం పొడి చల్లేస్తే బాగానే ఉంది.

"తింటే సరా? అవి అరిగితేనే కదా ఒంటికి పట్టడం."

ఇది యోగా యాగీ అధ్యాయం. ఎక్కడ నొప్పి ఉంటే దానికి సంబంధించిన ఆసనం పేరుతో కాళ్ళో, చేతులో, వెన్నెముకనో శ్రమ పెట్టడం అన్నమాట. ఉదాహరణకి, లాప్టాప్ ఒళ్ళో పెట్టుకుని గంటలతరబడి పని చేస్తూనో, చేస్తున్నట్టు నటిస్తూనో కూర్చుంటే అయిన పని ఏమీ కనిపించకపోయినా దండలూ, మోచేతులూ పట్టేయడం ఖాయం. ఇది తెలిసేక, లాప్టాపు సేవ తగ్గించేసేను. ఫరవాలేదులే, నా స్నేహితులందరూ అర్థం చేసుకుంటారు. అంతే కాదు. రెండు బరువులు రెండు చేతులతో పుచ్చుకుని వ్యాయామంలాటిది కూడా చేసేస్తే దండలు మళ్ళీ దారిలోకొస్తాయని కూడా గ్రహించేను.

మోకాళ్ళసంగతీ అంతే. మనకి సోఫాలూ, కుర్చీలూ, వాహనాలూ వచ్చేక నేలమీద

కూర్చోడం తగ్గిపోయింది. దాంతో అవసరం అయినప్పుడు, ఏ సంగీతకచేరీల్లోనో, టికెట్టు లేకుండా టెనిస్ చూసినప్పుడో కింద కూర్చుంటున్నారు కానీ అప్పుడప్పుడు వాళ్ళు ఆ సమయాల్లో పడే అవస్థ కూడా చూసేను. అందుకే చెప్తున్నా. నామాట విని రోజు కొంచెంసేపు నేలమీద కూర్చోడం అలవాటు చేసుకో. నాకు ఆఅలవాటు ఉందిలే. ఏదో ఓ సమయంలో కాళ్ళు వెనక్కి మడిచి కూర్చుంటాను. అది వజ్రాసనంట. అలాగే పడుకున్నప్పుడు తిన్నగా వెల్లకిలా పడుకుంటే శవాసనం. రోజు రాత్రి పడుకున్నప్పుడు అది అయిపోతుంది. అప్పుడే ఊపిరి బిగబట్టి ప్రాణాయామం కూడా చేస్తాను. మెట్లున్నచోట ఎలివేటరూ, ఎస్కిలేటరు ఎక్కను.

అంతే కాదు. ఒక్కమాటలో చెప్పాలంటే ఏ రోజు ఎట్టి పరిస్థితుల్లోనూ కదలకుండా ఒకేచోట అరగంట కంటే ఎక్కువసేపు కూర్చోను. కూర్చోలేను. ఏదో వంక లేచి తిరుగుతూనే ఉంటాను. ఏమీ లేకపోతే ఈకుర్చీలోంచి ఆకుర్చీలోకి. టెనిస్ ఆటగాళ్ళు చూడు బంతికోసం ఎదురు చూస్తున్నప్పుడు కదుల్తూ ఉంటారు కానీ బొమ్మరాళ్ళలా నిల్చోరు కదా. అదన్నమాట సూత్రం.

000

ఇదేవిషయంమీద మరో పోస్టు

నా ఆరోగ్యసూత్రాలు.

(ఆగస్టు 1, 2016)

# 20. నేనేం చెయ్యాలో నాకు చెప్పకు

ఈమధ్య చెప్పడం ఎక్కువయిపోయింది. "నీప్రవర మార్చు," అని నాకివాళ ముఖపుస్తకంవాడు  చెప్పేడు. ఘోరం, ఘోరాతిఘోరం. ఇది నాస్వతంత్రభావాలకి గొడ్డలి పెట్టు.




అసలు ఈసాంఘికమాధ్యమాలు అనుక్షణమూ నేను అత్యవసరంగా చేయవలసిన కర్మలు గుర్తు చేయడం చూస్తుంటే మహా చిరాగ్గా ఉంది. ఎవరెవరి పుట్టినరోజులు, పెళ్ళిరోజులే కాక ఎవరితో ఎప్పుడు స్నేహం మొదలయిందో ....లాటివి తెల్లారి లాప్టాపు తెరిచేసరికి హాజరు! అవి గుర్తు చెయ్యడమే కాక వాళ్ళకి శుభాకాంక్షలు చెప్పమని తాఖీదు ఇస్తుంది. ఫలానావారు నీస్నేహాన్ని అంగీకరించేరు, వారిగోడమీద ఏదైనా రాయి అని చెప్తుంది. అంతకంటే, ఎవరు ఎందుకు నాస్నేహం కోరుతున్నారో చెప్తే బాగుండు. ఎందుకంటే వారు నాతో స్నేహం కోరడం నాకు గౌరవప్రదమనా, వారికి గౌరవప్రదమనా, నేను వారిగోడలమీద రాతలన్నీ చదువుతాననా, లేదా వారు సృష్టిస్తున్న గుంపులన్నటిలోనూ నన్ను కూడా చేర్చుకోవచ్చనా? అదీ ఇదీ ఏదీ కాదు, వారికి నిజంగా నేను రాసేవి చదివే కోరిక ఉందనా? ఇది తెలిస్తే ముఖపుస్తకస్నేహాలవల్ల కలిగే చిరాకులు సగానికి సగం తగ్గిపోతాయి, నన్నడిగితే.

నూటికి 90పాళ్ళు నేను రాసేవి చదవడం మాత్రం కాదనే అనిపిస్తోంది. ఎందుకంటే, నేను పబ్లిక్ అని పెట్టిన టపాలు వారు చూస్తున్నట్టు కనిపించదు. చూస్తున్నట్టు కనిపించినవారు ప్రత్యేకించి మీస్నేహం కోరుతున్నాం అంటూ అర్జీలు పెట్టుకోరు. సరేలే, శాఖాచంక్రమణం అయిపోయింది.

జీమెయిలూ, యాహూలాటి సర్వీసులు చూసేవా నీ ఫోన్నెంబరియ్యి. నీ password దాస్తాను. నీ ఖాతాలన్నీ నాకియ్యి. నీకు తేలిగ్గా అమర్చి పెడతాను, మీఇంటి ఆనుపానులు చెప్పు. నీ ఆస్తిపాస్తులన్నీ ఎక్కడున్నాయో చెప్పు అంటూ ఎంతమంది మనమీద దాడి చేస్తున్నారో చూసేవా. ఇవేమీ నాకు అవుసరం లేదు మొర్రో అని ఎంత మొత్తుకున్నా సరే ఏలిన్నాటిశనిలా వదల్రు. గూగులువాడిని చూడు. ఇంటర్నెట్టు ఎక్కగానే కనిపిస్తుంది Default search engine గూగులుకి మార్చమని. సరే అన్నతరవాత కూడా ఆనస వదలదు.

అలాగే ఇంటిజాగ్రత్తలు - నీఇంటిభద్రత మేం చూస్తాం అంటూ ఫోనుమీద ఫోను చేసేవాళ్ళని చూసేవా. నాకు అవసరం లేదు, మాభవంతికి కావలిసిన భద్రత భవనంస్వాములే చూసుకుంటారు అన్నా టెలిమార్కెటరులు ఒకరితరవాత ఒకరు పిలుస్తూనే ఉంటారు. ఆఖరికి విసుగేసి ఒకరోజు అడిగేను, "నేను ఇప్పుడు నీసర్విస్ అంగీకరించకపోతే నీమాట నిరూపించుకోడానికి నువ్వే మాయిల్లు దోపిడి అయే ఏర్పాటు చేస్తావా?" అని. దాంతో ఆటకట్టు అయిపోయింది.

ఇంకా ఎక్కడెక్కడ మనకి ఏది కావాలో, ఏది ముఖ్యమో చెప్పేవాళ్ళని చూసేవా. దేశంలో ఏమూల ఏం జరుగుతోందో చూదాం అని టీవీ వెలిగిస్తే పది నిముషాలపాటు విశేషాలు చెప్పి, "కదలకు, ఇప్పుడే వస్తాను," (నిజంగా ఇవే మాటలు ఇంగ్లీషులో) అంటూ యాంకరి లేక యాంకరుడు నిష్క్రమిస్తాడు. ఆతరవాత అరగంట అనిపిస్తుంది కానీ నిజానికి నాలుగు నిముషాలపాటు నువ్వక్కడే కదలకుండా కూర్చుని నీకు లేని జబ్బులగురించి, వాడు అమ్మజూపిన మందుగురించి, దానివల్ల కలిగే దుష్ఫలితాలగురించీ వింటూ కూర్చోవాలి. మందులు కాకపోతే సెక్సుజీవనం, కొత్తకార్లు, జీవితభీమాపథకాలు, పళ్ళు తోముకోడం, కళ్లజోళ్ళు, కూరలు తరుక్కునే కత్తులు, గడ్డం గీసుకునే కత్తులూ, ఆపైన ఆడవాళ్ళ అవసరాలకి సంబంధించిన అనేకానేక వస్తుసంచయం వీటికి అంతే లేదు. నేను చూసే నాలుగు ఛానెలులలో నాలుగున్నర గంటలలో ఈనోది కనిపించి నాతల కొరుక్కుతినేస్తుంటే ఏమనుకోడం? ఈప్రకటనలు చూస్తుంటే ఇవి తప్ప జీవితం లేదేమో అనుకోవాలి.

ఒకొకప్పుడు ఇవన్నీ లేని బతుకేల అని నాబతుకుమీద నాకే విరక్తి కూడా పడుతుంది.

ఇది చట్టసమ్మతమైన brainwashing అంటాను. నేను ఈ విధానాన్ని తీవ్రంగా ఖండిస్తున్నాను. ప్రతి చిన్నవిషయానికీ హక్కులు హక్కులు, స్వేచ్ఛ స్వేచ్ఛ అంటూ శివాలెత్తిపోయే జనులు వీటికి మాత్రం అభ్యంతరం చెప్పరు ఏంచేతో మరి. ఎంచేతేమిటిలే. ఇది సమాచారయుగం కదా. సంగతులు తెలుసుకోవాలి అని వారి వాదన. విషయం చెప్పడం వేరు, అదే పనిగా ఉక్కిరిబిక్కిరి చేసేస్తూ ఊదరపెట్టేయడం వేరూ కదా.

జీమెయిలు కేలండరు మరో వింత. నేను అచ్చుకోవలసిన నెలసరి బిల్లులు ఫలానా రోజున చెల్లించాలని కాలెండరులో గుర్తు పెట్టుకున్నాను. ఇవాళ ఒకటో తారీకు, ఇంటద్దె ఇచ్చుకో అని నాకు హెచ్చరిక రాలేదేం అని నేనే గుర్తు తెచ్చుకుని ఫరీక్షించి చూసుకుంటే తెలిసిందేమిటంటే - ఒకమారు నేను చూడడం అయేక చెత్తబుట్టకి తరలించేసేను కనక జిమెయిలువాడు ఆ పని నేను చూడకముందే చేసేస్తున్నాడు అని. అది నాసౌకర్యంకోసమేనట. అంచేత నేను ఏరోజు ఏ బిల్లు చెల్లించాలో గుర్తు పెట్టుకుని ఆరోజు చెత్త బుట్టలో చూస్తే కనిపిస్తుంది ఆహెచ్చరిక!

ఇ-కార్డు ఒకమారు ఎవరికైనా పంపితే, ఆతరవాత ఆ ఇ-కార్డు కంపెనీవాడు ఆజన్మాంతం ఆ ఒక్క పుట్టినరోజే కాక నీకు తెలిసినవారందరి పుట్టినరోజులూ కూడా గుర్తు చేస్తాడు. నేను పుట్టినరోజులమనిషిని కాను. అన్నిరోజులలాగే అదీను అనుకుంటాను. అట్టే హడావుడి చెయ్యను. అసలు చాలామందికి తెలీదు. కానీ Department of Motor Vehicles వాడూ, విల్లు రాసిన లాయరూ మాత్రం తప్పితే ఇంకెవరికీ తెలీదు నాపుట్టినరోజు. వాళ్ళిద్దరూ మాత్రం తప్పనిసరిగా గుర్తు పెటకుని శుభాకాంక్షలు చెప్తారు. ఇవి ఎంత ఖచ్చితంగా జరుగుతాయంటే, వాళ్ళదగ్గరినించి కాయితం రాకపోతే నేను నా అస్తిత్వాన్ని శంకించవలసివస్తుందన్నమాట.

కార్ల కంపెనీవాళ్లు, ఇంస్యూరెన్సువాళ్లూ సరే సరి. 15 ఏళ్లక్రితం కొన్న కారుకి ఇప్పటికీ నాకు తాఖీదు వస్తూనే ఉంది, ఒక్క సంవత్సరంపాటు మాత్రమే

ప్రసాదించిన Manufacturer's warranty కాలం చెల్లిపోయింది, వెంటనే కొనసాగించమని, లేకపోతే దానికాలం చెల్లిపోతుందని. నాయనా, అది ముగిసిపోయి 14 ఏళ్ళయిందంది అని చెప్పి చూడు. నీగోడు నీదే, వాళ్ళగోల వాళ్ళదే.

సంగీతకచేరీలసంగతి చూడు. నాలాటివాళ్ళు ఏ యూట్యూబులోనో ఒక గంటసేపు విని ఆనందిస్తారు కానీ పనిగట్టుకు కచేరీలో మూడుగంటలసేపు కూర్చుని వినరు. ఏ నూటికో కోటికో ఒకరుండొచ్చు కానీ చాలా తక్కువే. సాధారణంగా కచేరీలకి వెళ్ళేవాళ్ళు సంగీతజ్ఞానం కలిగినవారైవుంటారు. అలాటప్పుడు గాయకులు రాగాలగురించి, మేళకర్తలగురించీ కచేరీ ఆపేసి కబుర్లు చెప్పడం బాగుంటుందా? బాగుండదు. కచేరీకి అవాంతరంగానే అనిపిస్తాయి ఆ పాఠాలు. సంగీతం ఏకధారగా ప్రవహించేఏరులా సాగాలి. అలా సాగుతున్నగానం విని ఆస్వాదించడంలో ఉన్న ఆనందం ముక్కముక్కలుగా కబుర్లమధ్య అందిస్తే ఉండదు.

బజారుకెళ్తే నాకు ఏబట్టలు ఎంత అందాన్నిస్తాయో చెప్పేవాళ్ళున్నారు. "ఆ ఎరుపు నీమొహంలో అరుణిమ ఇనుమడిస్తుంది," అంటాడు. "ఈ నీలం నీకళ్ళలో నీలిమెరుపులు కురిపిస్తుంది," అంటుంది మరొక సుందరి.

"ఈసినిమా లేక ఆప్రోగ్రాము చూడకపోతే నీజన్మ వృథా,"

"నామాట విను. నేనొక్కడ్నే నిన్ను రక్షించగలవాడిని,"

"ఈ పుస్తకం నువ్వు చదవకపోతే తరవాత విచారిస్తావు. మళ్ళీ చెప్పలేదనకు."

"నామాట విను. పప్పుకూర … లో కలుపుకు తిను."

"నామాట వినకపోతే చెడిపోతావు," అని చిన్నప్పుడు తల్లిదండ్రులు చెప్పేవారు. ఇప్పుడు తల్లిదండ్రులు కాదు ముఖపుస్తకంలోనో అంతర్జాలంలో ఏ జాలవైద్యులో చెప్పినమాటలే వేదవాక్కులు. నీమొహం ఆరడుగులదూరంలోనుంచైనా చూడని వాడెవడో ఏఅర్థరాత్రో నిద్రమత్తుతోనో మందుమత్తుతోనో ఎడ పెడా టైపు చేసి పారేసిన సలహాకున్న విలువ నువ్వు భూమ్మీద పడ్డనాటినుండి చూసిన అమ్మో నాన్నో చెప్తే లేదు. ఎందుకంటే, ఆమిత్రుడు నీబాతాఖానీ టపాలు ముప్పైకి

వేలిముద్రలు వేసేడు. అమ్మా, నాన్నా వెనకటి తరం వాళ్ళు. "నీకు తెలీదమ్మా, లేదా నాన్నా, నీచిన్నప్పుడులా లేదు ప్రపంచం ఇప్పుడు," అంటారు.

మాఅమ్మాయి "నీకు తెలీద"న్నరోజులున్నాయి. అప్పుడు దానికి తొమ్మిదేళ్ళే. ఇప్పుడలా అనదు. అందుకే చెప్తున్నా నామాట విను. ఎవరిమాటా వినొద్దన్న నామాట ఎలా వింటాను అంటావా?

ఏమో మరి.

000

(ఆగస్ట్ 6, 2016)

# 21. గ్రామసింహాలు

పాశ్చాత్యదేశాల్లో పెంపుడు కుక్కలచరిత్ర ఎప్పుడు మొదలయిందో నాకు తెలీదు కానీ అక్కడే మొదలయిఉండొచ్చు. మనదేశంలో అనాదిగా ఉన్నట్టుంది. మహాప్రస్థానంలో శునకప్రస్తావన ఉంది. అది నిజంగా కుక్క కాదులే కానీ ధర్మరాజు ఆకుక్కవిశ్వాసం గుర్తించి దాన్ని వదలి స్వర్గానికి వెళ్ళడానికి ఒప్పుకోలేదు అంటే ఆక్షణంలో అది కుక్క ప్రేమే.

ఇరవయ్యో శతాబ్దంలో మనదేశంలో కలవారిఇళ్లల్లో ఓ కుక్క, ముఖ్యంగా ఆల్సేషియన్ జాతి కుక్కకాపురం మొదలయింది ఇంగ్లీషువారిపాలనలోనే. దాంతోపాటే "కుక్క ఉంది జాగ్రత్త," అన్న హెచ్చరికలు కూడా వచ్చేయి. గత 30 ఏళ్ళనించి కావచ్చు మధ్యతరగతిఇళ్లల్లో కూడా కనిపిస్తున్నాయి ఇవి. ఇవి అనడానికి లేదేమో, ఆయన, ఆవిడ అనే సంబోధిస్తున్నారు ఈమధ్య కుక్కలను. ఈసంప్రదాయం కూడా ఆంగ్లేయులనించి వచ్చిందో మనవాళ్ళకే స్వతహాగా కలిగిందో మరి. కుక్కలు ఒకొక ఇంటిలో అంతటి ప్రాముఖ్యం వహించడం నిజం. ఇది సూక్ష్మంగా నాందిపలుకు.

ముందుకి సాగేముందు పెంపుడుకుక్కలు గలవారందరికీ నామనవి ఒకటుంది. వారు వారి శునకరాజునో రాణీనో ఎంతో ప్రేమగా చూసుకుంటున్నందుకు ఇవే నాజోతలు. కాకిపిల్ల కాకికి ముద్దు అయినట్టే కుక్కని పెంచుకున్నవారికి కుక్కలున్నూ.

అమెరికాలో ఈ గ్రామసింహాలకోసం వెరసి ఎంత ఖర్చు పెడుతున్నారో, వాటికి ఎన్ని సౌకర్యాలున్నాయో వేరే టపాలో రాసేను. ఈ టపా కుక్కని తక్కువ చేయడంకోసం కాదని మనవి. ఈటపాలో మరొకకోణం ప్రస్తావిస్తున్నాను. మీకు అభిప్రాయాలూ ఇష్టాయిష్టాలూ ఉన్నట్టే నాకూ ఉన్నాయి. అవి విడమర్చి చెప్పడమే ఈ టపా ఉద్దేశం. అంతకంటే మరే దురుద్దేశమూ లేదు. లేదు గాక లేదు.

నేను నిత్యసంచారం చేస్తానని నీకు తెలుసు కదా. ఆదారిలోనే కుక్కలు కూడా నడుస్తుంటాయి. పూర్వంకన్నా ఇక్కడ వీరిదర్శనాలు ఎక్కువగా ఉండుటచేత నాఇబ్బంది మరింత కొట్టొచ్చినట్టు కనిపిస్తోంది. కనీసం నాకలా అనిపిస్తోంది. ఓ చేత ఒకటో రెండో కుక్కతాళ్ళూ, మరో చేతిలో సెల్లులో కబుర్లు చూసుకుంటూ వేరే లోకంలో ఉన్నట్టు సాగిపోయే అమ్మాయిలకీ అబ్బాయిలకీ వీధిలో ఇతరులు కూడా ఉంటారనీ, తాము కాలిబాట పూర్తిగా ఆక్రమించేసేమనీ తోచినట్టు కనిపించదు.

దిక్కు తోచనిపిల్లల్లాగ ఆకుక్కలు ఆదరాభిమానాలకోసం దారిన పోతున్నవారిమీదకి ఎగిరిపడుతున్నాయని గ్రహించినట్టు కూడా కనిపించదు.

మనూళ్ళలో ఊరకుక్కల్లాగా అనను కానీ అవి ఇచ్చవచ్చిన రీతి సంచరిస్తున్నాయనే అనిపిస్తోంది. వాటిని పెంచుకుంటున్నవారు అంగరక్షకుల్లా వాటితో కూడా కూడా ఉన్నట్టు కనిపిస్తారు కానీ అది వాటి స్వేచ్ఛకి అంతరాయాలు కలగకుండా చూసుకోడానికి మాత్రమే. ఆమీదట వాటిఅవసరాలు తీర్చుకున్నాక ఆజాగా శుభ్రం చేయడానికీను. ఆకుక్క గానీ దాన్ని పెంచుకున్నవారు గానీ నాజోలికి వచ్చినప్పుడే నాకు ఇబ్బందిగా ఉంటోంది. కదాచితుగా కంటకప్రాయంగా కూడా ఉంటోంది.

నాపాటున నేను, నాలోకంలో నేనుండి నడుచుకుపోతుంటే, ఎదురుగా అటునించి వస్తున్న కుక్క నామీదికి కొదమసింగమువలె ఉరికిపడితే ప్రేమగానే కావచ్చు, స్నేహపూరిత హృదయకమలంతో కావచ్చు, నేను మాత్రం తుళ్ళిపడడం తప్పదు. రెండు పిడికిళ్ళు గట్టిగా బిగించి, గుండెలకదుముకుని, కావు కావుమని అలనాటి గజేంద్రునివలె మొరపెట్టుకుంటాను. ఆ తరవాత హో హో నో నో అని ఇంగ్లీషులో బొబ్బలెడతాను. మరి వాళ్ళకి గజేంద్రమోక్షం తెలీదు కదా. అంచేత వాళ్ళకి నాబాధ గానీ గావుకేకలు కానీ అర్థం కావు. ఇదంతా అసంకల్పంగానే జరిగిపోతుంది. కుక్కస్నేహానికి నా ప్రతిస్పందన అదీ. అంతే.

ఇక్కడ మరో రెండు విషయాలు కూడా గమనించాలి.

ఆకుక్క ఏమీ చెయ్యదు అని వారు నమ్మవచ్చు కానీ నాకు తెలీదు కదా.

ఇలాటి "చాలా మంచి కుక్క" నోట కాటు తిన్నవారు కోర్టుకెక్కడం నేను చాలానే చూసేను. పైగా ఆకోర్టులో కూడా వీళ్లలాగే, కాటు తిన్నవాడు పక్కనుండగానే, మాకుక్క చాలా మంచికుక్క అంటూ వాదించడం చూసేను.

మరి నాకు కూడా ఆకుక్కబుద్ధి ఉండాలి. అది నన్నేం చేయకపోవచ్చు కానీ నేను దాన్ని ఏం చేయగలనో వారికి తెలీదు. నిజంగా ఏదో చెయ్యగలనని కాదు, వారికి ఆ అనుమానం రావాలి. ప్రజలని  రక్షించవలసిన పోలీసే "నాప్రాణహాని,"అంటూ ఏ ఆయుధమూ చేత లేనివాణ్ణి కాల్చిపారేసే రోజులివి.

ఎవరి కుక్క వారికి ముద్దు. కానీ ఊళ్ళోవాళ్ళందరూ దాన్ని అంతగానూ ముద్దు చేయాలనుకోడం తగదు. ఆకుక్కకి బయట తిరగడం సరదా అంటారు.

ఇది నాకు అర్థమవుతుంది. జలచరాలకి జలమూ, ఖేచరములకు ఖగమూ, భూచరములకు అంటే  మనకి (మనుషులు), జంతువులకీ భూమి ఆవాసాలు. మనిషి ఇల్లు కట్టుకోడం మొదలు పెట్టేక కూడా ఆనాలుగ్గోడల మధ్యా ఉండలేకే బయట తిరుగుతాడు. నేను అందుకే తిరుగుతాను. అంచేత ఆరుబయట  హాయిగా విహరించవలసిన జీవులని ఇంట్లో ఉండమంటే అది వాటికి  ఆనందదాయకం కాకపోడంలో  ఆశ్చర్యం లేదు.

ఇంతకీ ఆ తల్లీ, తండ్రీ తమ కుక్కలగురించి ఎన్ని మంచిమాటలు చెప్పినా నాకు మాత్రం అలా ఉండదు. వారు నాఅవస్థ కూడా గమనించాలనే నాకోరిక. అది వారు గమనించరు సరి కదా నాకు ధైర్యపూరితవచనాలు  చెప్తారు. అవి ఇలా ఉంటాయి -

స్నేహపూరితకుక్క

నిన్నేం చెయ్యదు.

దానికి మనుషులంటే ఇష్టం.

మరి నేనేం అనుకుంటానూ?

అవునౌనౌనౌనౌను, మీ కుక్క చాలా మంచిది.  కానీ

నాకు ఆ స్నేహపూరితగుణం లేదు.

నేను కూడా మంచిదాన్నే

నేను కూడా దాన్నేం చెయ్యను

దానికి ఇష్టం ఉండొచ్చు. కానీ నాకు ఇష్టం లేదు.

ఇలాటి మాటలు ఎన్నో నేను కూడా చెప్తూ వచ్చేను. వారికున్న సౌమ్యత నాకంఠస్వరంలో కనిపించదు.

ఆతరవాత కొంతకాలం రాత్రీ పగలూ, తపస్సు చేసినంత శ్రద్ధగా, నాచిరాకుని అదుపులో పెట్టుకుని నా తత్త్వమేమిటో వారికి తెలియజేయడానికి ప్రయత్నించేను. చాలా సినేరియోలు రాసుకుని ప్రాక్టీసు చేస్తూ వచ్చేను.

"మీకుక్క స్నేహపూరితం కావచ్చు. నేను కాదు."

"అవును మంచి కుక్కే. మరి నాకు లేదు ఆ బుద్ధి."

"అది మంచి కుక్కే. నేను మంచికుక్కని కాను."

"సరేనండి. నాకిష్టం లేదు."

"సరే."

ఎన్ని సంభాషణలు రాసుకున్నా ఆక్షణం వచ్చేసరికి మాత్రం నాకు పట్టలేనంత చిరాకు, కోపం వస్తున్నాయి పరుగెత్తుకుంటూ నామీదమీదకి ఎగసిపడే ఆశునకాలని చూస్తే.

పైన చెప్పేను కదా కుక్కగొలుసు ఒక చేతిలో అని. వీధిలోకి వచ్చినప్పుడు కుక్కకి గొలుసు తగిలించక పోవడం చట్టరీత్యా నేరం. అయినా అందరూ ఆ నగ తగిలించరు. కొందరు చేతిలో గొలుసు ఉంటుంది కానీ  రెండో చివర కుక్కమెడలో ఉండదు. అదేమంటే  అది దిక్కుమాలిన కుక్క,  గొలుసు దానికిష్టం ఉండదు అంటారు. అది నిజం కాదని నాకు తరవాత తెలిసింది.

ఇంకా కొన్ని సంగతులు కూడా తెలుసుకున్నాను. ఇదుగో చెప్తాను -

పెంచుకున్నవాళ్ళు చాలా ముద్దుగా చూసినా అలా చూడబడని కుక్కలు కూడా చాలా ఉన్నాయి. అంటే హింసలకు గురై వీధిన పడ్డ జీవులు. అవి సరదాకో కుక్కంటే ప్రేమతోనో పెంచినవి కావు. గుర్రప్పందేలలాగే, కుక్కలపందేలూను. వాటికిచ్చే శిక్షణ పరమ దారుణంగా ఉంటుందిట. పందేలకి పనికిరాని కుక్కలని చిత్రహింసలకి గురి చేస్తారు కూడా. ఇలాటి కుక్కలని ఆ దుర్మార్గులనుండి రక్షించి, ఇష్టపడ్డవారికి పెంపకానికి ఇస్తారు కొందరు. అలాటి సేవకి ఖర్చు కొన్ని కోట్లలో ఉంటుంది. అసలు ఈ బాధితజంతువులని రక్షించే సంస్థలు టీవీ ప్రకటనలకే లక్షలకి లక్షలు ఖర్చు పెడుతున్నారంటే ఇది ఎంత పెద్ద సమస్యో ఊహించుకోవచ్చు.

మరో విషయం బాధ్యతని నిర్లక్ష్యం చేయడంగురించి. ఇళ్ళల్లో వాటిని ఎలా చూసుకుంటారో తెలీదు కానీ బయటికి వచ్చినప్పుడు మాత్రం తమబాధ్యతని కనీసం ఒక విషయంలో మరిచిపోతారు. బయటికి తీసుకొచ్చేక, అవి చేసే గలీజు ఎత్తి తీసుకుపోయి చెత్తకుండీలో పారేయడం వారి బాధ్యత మాత్రమే కాదు, అలా చేయకపోవడం నేరం కూడాను. కానీ అందరూ చెయ్యరు. నేను నడిచే రెండున్నర మైళ్ళ దూరంలో కనీసం 5,6 బోర్డులు ఇలాటివికనిపిస్తున్నాయంటే, వీరు ఎంత బాధ్యతారహితంగా ప్రవర్తిస్తున్నారో తెలుస్తుంది.




ప్రభుత్వం కలగజేసుకుని చట్టం చేసిందంటే అది అంత పెద్ద సమస్య కనకనే కదా. అది చూస్తే నాక్కూడా కోపం వస్తుంది. తమ ముంగిలి శుభ్రంగా ఉంచుకుంటారో లేదో తెలీదు కానీ మరొకరి ముంగిళ్ళలో ఇలాటి మురికి వదిలేసి తమకేమీ పట్టనట్టు నడిచిపోయేవారు అవును అమెరికాలోనే ఉన్నారు.

అసలు నేను మనిషిపిల్లలని కూడా చూడగానే గబుక్కున ఎత్తుకుని కూచి కూచి అంటూ మురిపాలకి పోను. అదన్నమాట కథ. నాలభిప్రాయంలో పెంచుకున్నవారికి

ఎంత ప్రేమైనా ఉండు గాక, వీధిలో కనిపించినవారు కూడా ఆ కుక్కని అంత ముద్దు చేస్తారనో చేయాలనో అనుకోడం అత్యాశే. కొందరిని చూసేను ఏ కుక్క కనిపించినా అలా ఎంతో ప్రేమతో లాలనగా ముందుకి వంగి, దానిమూతి చేత పుచ్చుకు బోలెడు ఊసులాడతారు. అది వాళ్లిష్టం. ఒక్కమాటలో, ఆ స్నేహబుద్ధి రెండువేపులా ఉండాలి. కుక్కకి నేను ఇష్టమయినా నాకు కుక్కంటే ఇష్టం లేకపోతే స్నేహబంధం కుదరదు.

ఉపసంహారం.

ప్రస్తుతం నాచుట్టుపట్ల రెండుమైళ్ళ పరిధిలో కుక్కగల ప్రతివారికీ తెలిసిపోయింది నావ్యవహారం. అల్లంత దూరంలో నేను కుక్కని పసిగట్టినట్టే వారు నన్ను పసిగట్టి, గుబుక్కున కుక్కని ఎత్తుకోడమో, కూర్చోమని ఆజ్ఞాపించడమో, పక్కకి తప్పుకుని నాకు దారి ఇవ్వడమో చేస్తున్నారు.

నేను కూడా బోలెడు మర్యాదగా ధన్యవాదాలు చెప్పుకుని, లేకపోతే ఫరవాలేదులే అని చెప్పి (అప్పుడు చెప్పినా ఒకటే చెప్పకపోయినా ఒకటే) గబ గబ వారిని దాటి పోతున్నాను.

ఈవిధంగా మేం అందరం సర్వజీవసౌభ్రాతృత్వం పాటిస్తూ, శాంతియుతసహజీవనం సాగిస్తున్నాం.

అయితే రెండు ప్రతిపాదనలు చేయకుండా ఈ టపా వదల్లేను,

1. మనపిల్లలకి కొత్తవాళ్ళదగ్గరికి వెళ్ళొద్దని చెప్తాం. కుక్కలకి ఇల్లు అలవాటు కావడానికి ఇచ్చే శిక్షణ ఉంది, ఆ శిక్షణలో ఇది కూడా చేర్చాలి, "వీధిలో కొత్తమనిషి పిలిస్తే తప్ప దగ్గరికి వెళ్ళరాదు."

2. కుక్కలు దైహికఅవసరాలు ఇంట్లోనే తీర్చుకునేలా యజమానులు చూడాలి. లేదా మనుషులకి ఏర్పరిచినట్టే public restrooms కుక్కలకి కూడా కట్టించాలి. 000

(ఆగస్ట్ 11, 2016)

# 22. మనం మనం తిమ్మనం

"ఈ బూపెపంచికంలో సమస్త జీవరాసులున్నూ ఒకటే కులం," అంది సంద్రాలు.

"మనుషలంతా అనా?" అన్నాను స్పష్టం చేసుకోడానికి.

"మడుసులు, పసూలు, పచ్చులూ, తిమింగిలాలూ అన్నీను."

"కాదులే. విజ్ఞానశాస్త్రజ్ఞులు కోతులు పరిణామక్రమంలో మానవులుగా అవతరించేరన్నారు కానీ పశువులూ, పక్షులూ లాటివి చేర్చలేదు ఈ కులంలో," అంటూ సైన్సు పాఠం పెట్టేను.

"ఆలకి తెల్దులే. అస్లు పెపంచకాన్ని సుస్టించిందెవురూ?"

"ఏమో. మనవాళ్లు బ్రహ్మ అంటారు. ఇంగ్లీషువాళ్లు వాళ్ళదేవుడంటారు."

"అద్సరి. బెమ్మదేవుడు గాని ఏసుపెబూ గానీ ఒక మడిసిసే గద ఆదిని పుట్టించింది. ఆమీన మల్లి ఆడమడిసిని చేసీడు. అనగ ఏటీ? ఓల్ ముత్తం మానవులందురూ ఆఇద్దిరినించే వచ్చీరు. అనాగే ఆ బెమ్మ మిగతా జీవులన్నిటినీ సుస్టించేరు గెన్క ఆయన సమస్తజీవులకూ తండ్రి. ముత్తం బూపెంపచికంలో పేణులన్నీ ఆరి కుటుంబంపే. అదీ కత."

సంద్రాలుతో వచ్చిన చిక్కే ఇది. ఆవిడనమ్మకాలు ఆవిడవి. అవి మార్చడం ఆవిణ్ణి పుట్టించిన బ్రహ్మతరం కూడా కాదు. కానీ ...

సంద్రాలుమాటల్లో కొంత తర్కం కనిపించకపోలేదు. మరి మనం వంశం అని చెప్పుకుంటాం కదా. ఋషులు కానీ మరో మహానుభావుడు గానీ వారిపిల్లలు, మనవలు, మునిమనవలు అంతా వారివంశం. వంశంలో ఒకడు వృద్ధిలోకి వస్తే వంశాన్ని మెచ్చుకుంటాం. అలా పేరు పేరు వంశాలున్నాయి.

"మరి ఈ కులాలూ, గోత్రాలూ తంటా ఎప్పుడు మొదలయిందంటావూ?"

"కులాలు వుర్తులపెకారం వచ్చేయంతరు. అదీ ఎనకమాలెప్పుడో నిజం కానీ ఉప్పుడు గాదు. డాక్టర్ సేసీవోన్ని డాటరీ ఉజ్జోగం సేస్తన్నాడంటరు గానీ డాటరీ కులం అంటన్నర? సేదు. అందుసేత కులంవంటే అరతం మారిపోసాదస్సెప్పాల."

"లేదులే. మాకులంవాడు డాక్టరీ చేస్తున్నాడు అంటారు. కులంమాట వదల్రు."

"మరి పాతకాలంల ఏ కులపోడు ఏ పని సెయ్యాలో, ఎట్ట బతకాలో సెప్పినట్టు, సేసినట్టు ఉప్పుడు సేస్తన్నరా?" అంటూ మరో లాపాయింటు లాగింది సంద్రాలు.

మ్. లేదు. ఖచ్చితంగా పాతకాలంలో కులాలవారీగా పాటించేజీవితం ఇప్పుడు నూటికి నూరుపాళ్లూ అచ్చంగా అలాగే లేదు. ఇప్పుడు కులవ్యవస్థ అన్నది శిఖపట్లకి మాత్రమే పనికొస్తోంది.

"మరోటడగత సెప్పు. యెనక బేమ్మల అగ్గరారం, మాలపల్లి అంటా ఏరుగ ఉండీవి. ఉప్పడట్ట సెల్తదా? బాపనోల్ల బాబు కమ్మోరి అమ్మాయిని పెల్లాడతడు. నాయిల్ల బొట్టి మాలోల్లపిల్లగాని మనువాడతాది. ఇయన్నీ ఉప్పుడు మమ్ముూల్లే గాదా. అదెట్ట జరిగిందంటవు?"

"గొప్ప గొప్ప సంస్కర్తలు పూనుకుని ప్రజలను ప్రబోధితులని చేస్తేనూ," అన్నాను నా టీవీజ్ఞానంతో.

సంద్రాలు తల అడ్డంగా ఆడించింది. "ఇసుమంటియి ఎవురికైన ఆరి బుర్రల్లోనే పుట్టాల. అది ఆరి యనకజలమ సుకర్తంసేత జరగతాది."

సంఘసంస్కర్తలూ, పురోభివృద్ధికాముకులూ పూనుకుంటేనే ఆబుద్ధి పుట్టిందని చెప్దాం అనుకున్నాను కానీ సంద్రాలుముందు నేనెంత, నాతెలివెంత?

కానీ వెనకబడినకులాలవారికి న్యాయం జరగడం లేదన్న భావం నాబుర్ర తొలుస్తోంది. అంచేత ఒంట్లో బలం అంతా కూడగట్టుకుని లోగొంతులో చిన్న నస పెట్టేను, అసలు కులప్రసక్తి కూడదని కొందరు చాలా గట్టిగా వాదిస్తున్నారు. కళ్ళు ఎర్రజేస్తున్నారు. మరోపక్క నిత్యజీవితంలో కులప్రసక్తి లేకుండా అనేకస్థాయిలలో స్నేహాలు కలుపుకుంటూ హాయిగా చెట్టాపట్టాలేసుకు తిరుగుతున్నారు. అసలు

అడిగేవాడు లేక గానీ, మీకుటుంబంలో గానీ మీపరిచితులలో గానీ ఒక్కరైనా ఉన్నారా కేవలం తమకులంవారికే సాంగత్యం పరిమితం చేసేసుకుని, మిగతా కులాలవారందర్నీ దూరంగా - నన్ను ముట్టకు నామాలకాకీ అంటూ - భజన చేసేవాళ్లు? అవసరాలనిబట్టీ, పరిస్థితులనిబట్టీ, చుట్టూ ఉన్న సమాజాన్నిబట్టీ ఒకొకరి పైఖరీ ఎన్నో రకాలుగా మారుతోంది. నామటుకు నాకు "మాకులంవాడు" అని ఉద్యోగం చూపితే తప్పు అనిపించదు. "మాకులంవాడు కాడు" అని ఉద్యోగం ఇవ్వకపోతే మాత్రం ఒప్పుకోను. మొదటిపద్ధతిలో కలుపుగోరుతనం ఉంది. ఆత్మీయత ఉంది. రెండోపద్ధతిలో కుళ్ళుబుద్ధి ఉంది. కపటం ఉంది.  అంటే మంచి చేయడానికి కులం కారణం అవచ్చు కానీ చెరుపుకి కాకూడదు. హ్మ్. ఎవరికి నచ్చుతుంది ఈ వాదన? ఎవరు ఒప్పుకుంటారు?

"నాను మరొటి గూడ అడగతన్న, సెప్పు. మా ముత్తవ్వకాలంల అది వొండుతే మీవోలు తినీవోరా? నేదు. ఉప్పుడు నానొండితే మాదొరతోబాటు నివ్వూ బల్లకాడ కూకుని తింటన్నవ్. మరి వప్పటి తప్పు ఉప్పుడు ఒప్పయిపోనేదా?"

అవును. తక్కువకులంవాడు కూలిపని చేస్తున్నంతకాలం ఎడం పెడతారు. ఆమనిషే నానా అగచాట్లూ పడి కలెక్టరయితే సరిబంతి భోజనాలకి ఏఆచారాలు అడ్డు రావు. ఇంట్లో ఉల్లి తినరాదంటారు హోటల్లో ఎగబడి తింటారు. ఎంత శ్రద్ధగా సంప్రదాయాలని పాటించేవారూ వెసులుబాటుకోసం తడుముకుంటూనే ఉన్నారు. దేశకాలపరిస్థితులమహిమ!

000

ఇంతకీ ఈ పోస్టు కేవలం కులంగురించే కాదు. మరింత విశాలపరిధిలో ఒకరు మరొకరిని "మనవాడు" అనో "మనవాడు కాడ"నో అని తదనుగుణంగా తమ ప్రవృత్తులు మార్చుకోడంగురించి.

స్థూలంగా అందరూ సమానఁవే అని ఎంత అరిచి మొత్తుకున్నా చిన్నా పెద్దా ఏదో ఒకఅంశం ఆధారం చేసుకుని పేరు పెడుతూనే ఉంటాం. కులం ఒక్కటే కానక్కర్లేదు. ధనం, ఉద్యోగం, స్థావరం, దేశం, భాష - కొలిచే సాధనం ఏదైనా కావచ్చు.

అంతెందుకూ చిన్న ఉదాహరణ చెప్తాను. ఇక్కడ నేను "మనలో మనమాట" అంటే నీమాటా, నామాటా మనఇద్దరిమధ్యా మాటలు అనే కదా. మరి ఇందులో చిన్న తిరకాసు లేదూ? ఓ పక్క మనం అందరం చెప్పుకునే మామూలు మాటలే ఇవీ అనీ, మరో పక్క మనిద్దరిమధ్యే ఉంచుకోవలసిన మాట అనీను. మరెవరితోనూ అనకేం అని అర్థాంతరం. నువ్వు మళ్ళీ మరొకరితో మనిద్దరిమధ్యే సుమా అంటూనే ఇదే మాట రవాణా చేసేయొచ్చనుకో. నాకు ఒకొకప్పుడు అనిపిస్తుంది ఏమాటైనా పదిమందికీ తెలియాలంటే ఎవరికీ చెప్పకు అంటూ ఎవరోఒకరికి చెప్తే చాలు అని.

అన్నట్టు సందర్భం వచ్చింది కనక ఈ "మన" పద్ధతిగురించి చెప్పుకుందాం. మనిల్లు, మనూరులాటివి మనకే చెల్లింది. మనం మనం తిమ్మనం అన్న పలుకుబడివెనక చాలా కథ ఉందిట. ఇంతకీ తిమ్మనం తినడానికి తీయగానూ, చూడ్డానికి ఒద్దికగా ముద్దలాగానూ ఉంటుంది. అలాగే మనమూనూ అని రూఢ్యర్థం.

నువ్వూ చూసే ఉంటావు మనదేశంలో నలుగురికోసం నిర్దేశించిన కారులో ఎనిమిదిమంది ఎక్కుతారు. ఇరుక్కుని అంటావా, ప్రేమగా అంటావా చెప్పు. రెండోదయితే తిమ్మనమే.

తెలుగువాళ్ళలో "నీ", "నా" కంటే "మన" వాడుకే ఎక్కువ. మనఇల్లు, మనవాళ్ళు, మనభాష, మనజాతి - ఇలా చెప్పుకోడం మన కలుపుగోరుతనం, కలిసికట్టుతనం ప్రదర్శించుకోడానికే కానీ తదితరులని వేరు పెట్టడానికీ కాదు, వారు తక్కువనీ కాదు.

ఒకసారి ఏమయిందో తెలుసా. మనదేశంనుంచి కొత్తగా వచ్చిన ఒకావిడ మాఇంటికి వచ్చింది. ఆవిడ ఇల్లంతా కలియజూస్తూ, "ఇదంతా మనిల్లేనా?" అనడిగింది. నాకు ఆవాచకం జ్ఞాపకం రావడానికి రెండుక్షణాలు పట్టింది. మనవాడు, మనఊరు, మనభాష, మనిల్లు - ఇవన్నీ మన మాటతీరులో ఉన్నాయి. అదొక గొప్ప భావం, గొప్ప అనుభవం. అంతే గానీ "మనిల్లేనా?" అని ఆవిడడిగితే, నేను అవునంటే, ఆ వెంటనే ఆవిడ పిల్లా మేకా మూటా ముల్లే వేసుకొచ్చేసి మాయింట్లో మకాం పెట్టేస్తుందని కాదు కదా. మనం ఎవరింటికైనా వెళ్తే, "మళ్ళీ రావాలి మీరు.

రెండ్రోజులుండేలా రండి," అంటారు. "ఈయిల్లు మీయిల్లే అనుకోండి," అంటారు. నువ్వు అదే మొదటిసారి ఆఇంట అడుగుపెట్టడం అయినా సరే, ఎంత కొత్తవాళ్ళయినా సరే. మనమాట తీరది. నాకు ఎన్నోమార్లు అనుభవం అయింది ఇది. మొన్నటికి మొన్న ఆ అమ్మాయి "నా పోస్టు నీపోస్టే అనుకో," అన్లేదూ, అలాగే ఇదీను. మాట అన్నంతమాత్రాన ఆయిల్లు నాయిల్లు అనుకునేస్తాననీ కాదు. పదే పదే వారింటికెళ్ళి అక్కడ మకాం పెట్టేస్తాననీ కాదు కదా. నీకు మాత్రం తెలీదేమిటి. అదొక సంప్రదాయం, అంతే.

ఇలా ఆలోచిస్తూ నడుస్తున్నాం. అంతలో భౌ, భౌ, భౌ, భౌ వినిపించి ఉలిక్కిపడి వెనక్కితిరిగి చూసేను, మూడంకెలా ముడుచుకుపోతూ.

సంద్రాలు నవ్వింది, "మనోల్లోలే. ఐన అరిసే కుక్కలు కరవ్వు."

యజమాని, హెయ్ అంటూ అదిలించి, రెండు ముద్దుకూనలను పక్కకి లాగేడు.

"రెండోకుక్క అరవడం లేదు కదా. అయినా మనవాళ్లంటావేమిటి. ఏవంక చుట్టం అనీ?" అన్నాను విసుగ్గా.

"గాదులె. అయి మన పొరుగుదేసంయంట. తిబెటునించి ఒవురో తెచ్చి ఈరికి అమ్మినారు."

"టిబెట్ మనపొరుగుదేశం కాదు. నేపాల్కి పొరుగుదేశం. ఆ మాట వదలెయ్. టిబెట్టైతే బుద్ధదేవుని బుద్ధి రాక్కర్లేదా?"



"ఆముకం సూడు. నివ్ పలకరిచసేదని వెస్టపడతన్నది."

"సాటికుక్క కనిపిస్తే కబుర్లు చెప్పుకోడం చూసేను కానీ నేను పలకరించలేదని బాధ పడ్డం ఏమిటి?"

"ఈ బూపెపంచికంలో జీవులు సమస్తమూ ఒకిటే కుటుంబంవని సెప్పలే?"

సమస్త జీవులకీ ఈ "మన"భావం ఒకటే అంటే నాకు నమ్మకం కలగడం లేదు.

నేను సంధ్రాల్తో గట్టిగా వాదిస్తుండగానే, ఎదురుగా మరో శునకయజమాని మరో జాగిలంతో రంగప్రవేశం చేసేడు.

నన్ను తేరిపార చూస్తున్న రెండు కుక్కలూ గబుక్కున అటు తిరిగి వెళ్ళిపోయేయి. ఆ పెంపకపుతండ్రి కూడా అటు తిరగేడు. ఆ రెండు కుక్కలూ మూడో కుక్కతోనూ, ఈ మనిషి ఆ మనిషితోనూ కత్తు కలిపేసారు.

నేను సంధ్రాలువేపు చూసేను, "చూసేవా మరో కుక్క కనిపించగానే నాఅక్కర లేకుండా పోయింది దానికి. కుక్క కుక్కతోనూ, మనిషి మనిషితోనూ."

"నివ్ గూడ ఆల్లమాదిరే మాటాడతన్నవ్. అస్లు మడిసంత బుద్దిమాలినోడు సేడు నోకంల. కులంపేర్న సంగాలెడతడు. మల్ల కులం ఒద్దంటడు. మనదేసిం,మన రాస్టరం, మన బాస, మనబడి, అంట ఒంకలు సూపుతడు స్నేయితం కలుపుకోనానికి. మల్ల పని గాకపోతె ఇయన్ని తప్పంటడు. మడిసి బుర్రే గోల్మాలయిపోనాది. అందురిలోన ఒకే జీవుడున్నడు అన్న గేనం ఉండాల. ఒప్పుడు ఇయన్నీ శాన సిన్న యిసయాలైపోతయి. మడిసి కల్పిచ్చుకున్నయే" అంది సంధ్రాలు.

చెప్పేను కదా సంధ్రాల్తో వాదించి గెలవడం నాతరం కాదని.

000

(ఆగస్ట్ 24, 2016)

# 23. నేను సైతం ఓటేశాను!

గత ఆర్నెల్లుగా నాకు రాజకీయాలయావ ఎక్కువయిపోయింది. ఇంతకుముందు ఎప్పుడూ నేనంతగా పట్టించుకోలేదు ఎవరు నాయకుడవుతాడు, ఎవరు నన్నూ నావాళ్ళనీ ఏవిధంగా పరిరక్షిస్తారు, అందువల్ల నాకు ప్రత్యేకంగా కలిగే ఆనందం కానీ బాధ కానీ ఏంవుంటుందీలాటివి ఆలోచించలేదు. నాకు చిన్నప్పట్నుంచీ జరిగేది జరుగుతుంది, జరగరానిది జరగదు అనే గట్టి నమ్మకం. శివుడాజ్ఞ లేకపోతే చీమైనా కుట్టదు. ఆయనగారిఆజ్ఞ అయితే మనం తలకిందులుగా తపస్సు చేసినా చీమ కుట్టకమానదు. ఆజ్ఞ లేకపోతే బాధే లేదు. ఆజ్ఞ అయిందన్న సంగతి మనకి తెలిసేది చీమ కుట్టడం అయిపోయినతరవాతే, అప్పుడు మనం చేయగలిగేదీ ఉండదు ... ఇలా ఉంటాయి నా ఆలోచనలు.

అలాటి నాకు గత నాలుగునెలలుగా మహా ఆతురతగా ఉంది ఈ ఎన్నికలజాతర ఎలా ముగుస్తుందా అని. ఏడాదికి పైనే అయింది ఇది మొదలయి కానీ ఇప్పుడు మరింత రెచ్చిపోయింది ఈసంత. బహుశా నేను నాలుగోపాదంలో ప్రవేశించడం, నామామూలు వ్యాపకాలన్నీ మూలపడడం కూడా కావచ్చు.

అంచేత ఈపూట నారాజకీయప్రస్థానంలో ఎక్కడ్నించి ఇక్కడికి వచ్చేను అని విశ్లేషించదలుచుకుని మొదలుపెట్టేను ఈ టపా.

నీకో చిన్న హెచ్చరిక. కొన్ని వాస్తవాలకి హాస్యం జోడించి రాస్తున్నాను కనక దీన్ని మనలోమాటగానే గుర్తించాలి కానీ ఏదో ఒక మాట పుచ్చుకు ఈకకి తోకకి తోకా పీకి వ్యాఖ్యానాలు చేయొద్దు. సరేనా.

అసలు నాకు మొదట్నించీ ఈరాజకీయాలంటే సరదా లేదని చెప్పేను కదా. మానాన్నగారికి మాత్రం చాలా ఆసక్తి ఉండేది. ఆరోజుల్లో బహుశా నాన్నలందరూ అంతేనేమోలే. నాకు సరిగా వివరాలు జ్ఞాపకం లేవు కానీ 1952-53ప్రాంతాల్లో

కాబోటు నెహ్రూ అవలంబించిన ఏదో విధానం జనాలకి నచ్చలేదు. దేశంలో ఉధృతంగా అలజడులు చెలరేగేయి. ఆసమయంలో అన్నాను, “ప్రజలే కదా ఆయన్ని ఎన్నుకున్నది, వాళ్ళఇష్టాయిష్టాలు పాటించక్కర్లేదా నెహ్రూ?” అని.

దానికి మానాన్నగారి సమాధానం, “నిన్ను మానాయకడిగా ఎన్నుకుంటున్నాం, దేశాన్ని నువ్వు నడిపించు అంటూ ఆయన్ని నాయకుడిని చేసేక,  ఆయనకి తోచినట్టు ఆయన చేస్తాడు కానీ వీళ్ళందరిమాటలూ వింటాడా?” అని. ఇవే మాటలు కాదనుకో, సుమారుగా ఇదే అర్థం వచ్చేమాట చెప్పినట్టు గుర్తు. సుమారుగా అదే రోజుల్లో "ఓటుకోసం" అని కాలేజీ రాజకీయాలమీద ఓ చిన్న స్కెచ్ కూడా రాసేను తెలుగు స్వతంత్రలో ప్రచురించారు. నారాజకీయయోగం అంతటితో సమాప్తం. ఇప్పుడు జరుగుతున్న రగడ చూస్తుంటే మానాన్నగారిమాటలు నిజమే అనిపిస్తోంది!

నిజానికి ఇదే అంశంమీద - అమెరికాలో రాజకీయాలు - 2012లో ఒక టపా రాసేను. ఈ నాలుగేళ్లలోనూ రాజకీయాలు మారలేదు కానీ నాకు మాత్రం అప్పటికంటే ఇప్పుడు ఆతురత మిక్కుటమయిపోయింది.

నా అభిప్రాయాల్లో మార్పు లేదు కానీ మరింతగా విస్తరించేయి. కొన్ని విషయాలు అర్థమయిపోతున్నాయి కూడాను. ఇందులో నాసాహిత్యవ్యాపకాల ప్రసక్తి కూడా ఉంది కనక పూర్తిగా వింటావని ఆశిస్తున్నాను.

చిన్నప్పట్నుంచీ తెలుగుకథలు చదువుకోడం, రాసుకోడం మాత్రమే చేసేను. అమెరికా వచ్చేక విస్కాన్సిన్ గ్రంథాలయంలో మంచి తెలుగుపుస్తకాలు దొరకడంతో వ్యాసాలు రాయడం మొదలు పెట్టేను. నాబ్లాగులో రాసిన వ్యాసాలు చాలామందికి నచ్చడంతో నాకు మరింత ఉత్సాహం వచ్చి ఇంకా ఇంకా రాస్తూ వచ్చేను. ఆ ఊరు వదిలేసేక మళ్ళీ అలాటి భాండాగారం ఎక్కడా దొరకలేదు నాకు. అంచేత వ్యాసాలు కూడా రాయడం లేదు. ఇది నాకు కొరతగానే ఉంది.

ప్రస్తుతం నావయసుకి తగ్గ రుగ్మతలజాడలు కూడా కనిపిస్తున్నాయి. చాదస్తంగా ఆ వివరాలన్నీ చెప్పను కానీ ఇంతకుముందులా చదువుకోడం, రాసుకోడం ఇప్పుడు

సాధ్యం కావడంలేదని మాత్రం చెప్తాను. ఆ వరసలోనే సాంఘికంగా నాకు గల పరిచయాలన్నిటికీ స్వస్తి చెప్పేసి, తలుపులన్నీ మూసేసుకున్నాక కలిగిన అసహనంతోనో అసంతృప్తితోనో ముఖపుస్తకం ప్రవేశించేను. తద్వారా నేను ఎలాటి సాంఘికసావాసాలు వద్దనుకున్నానో వాటినే మళ్ళీ నాజీవితంలోకి ఆహ్వానించేనని తెలుసుకోడానికి చాలా కాలమే పట్టింది - మనజీవితాల్లో ఇదొక పరిహాసహేల.

ఈలోపున జరిగిన మరో రెండు విషయాలు కూడా చెప్పాలి. రాసుకోడం, చదువుకోడం లేనందున మెదడు ఖాళీ అయిపోయింది. కానీ మెదడు ఖాళీగా ఉండదు. శూన్యం ప్రకృతివిరుద్ధం అని మనం చదువుకున్నాం కదా. శూన్యం భరించలేక టీవీ చూడ్డం మొదలుపెట్టేను. నామటుకు నాకు స్వతహాగా తోచే ఆలోచనలు తగ్గిపోయి, టీవీ నాతల్లోకి ఎక్కించేస్తున్న నానాగడ్డీ మేస్తున్నానని గ్రహించేక రెండు సంగతులు జరిగేయి.

యూట్యూబుని ఆశ్రయించడం మొదటిది. సంగీతం, నాట్యం చాలానే చూస్తున్నాను కానీ ఆ క్రమంలో ఆ విడియోలలో లోపాలు కూడా కనిపించడం మొదలయేయి. సంగీతం ఫరవాలేదు కానీ నాట్యాలవిడియోలలో మాత్రం నూటికి తొంభై పాళ్ళు విడియోలనాణ్యత భరించడం కష్టంగానే ఉంది. వెలుగు సరిగా ఉండాలి. నర్తకులవెనక తెరగా దేవాలయాలు అమర్చడం బాగానే ఉంది కానీ అది నర్తకులని కప్పేసేది కాకూడదు కదా. ఇహ నర్తకులు రంగంమీద తిరుగుతున్నంతసేపూ ఎటువేపుకి కదుల్తున్నారో సరిగా చూసుకోరు. కొన్నిట్లో నర్తకి తల ఎగిరిపోయిన సందర్భాలు కూడా ఉన్నాయి. ఇంతకుముందు నాకు ఆశ్రిత వేముగంటి నాట్యం నచ్చిందని చెప్పేను. దానికి కారణం ఆమె ప్రతిభతోపాటు, విడియో కూడా సరిగా చేయడం కూడాను. ఇంతకీ చెప్పొచ్చేది నాకు ఈ యూట్యూబు నాట్యాలు కూడా అసంతృప్తి కలిగిస్తున్నాయి.

ఇంక మిగిలింది ముఖపుస్తకం. అక్కడ రెండు వాక్యాలు రాస్తే నలుగురో ఐదుగురో అభిప్రాయాలు రాస్తారు. ఆపూట ఉల్లాసంగా గడిచిపోతుంది. ఆఖరికి చూడగా చూడగా జింగిల్సు్రచయితని అయిపోయేనే అనిపిస్తుంది కానీ అట్టేసేపు నిలవదు.

ఇదీ గతరెండేళ్ళుగా నాజీవితచరిత్ర. ఈనేపథ్యంలో అన్నమాట టీవీలో రాజకీయాలు మరింత ఎక్కువగా గమనించడం మొదలు పెట్టేను.

ఆయనకి ఈగౌరవం ఇవ్వడం ఇష్టం లేదు కానీ ఒప్పుకోకతప్పదు. ట్రంపుమూలంగా నాలో కొంటెతనం తన్నుకొచ్చి, నాఘునాపాఠీ అభిప్రాయాలు వెలిబుచ్చడానికి ఆస్కారం కలిగింది. ఆ హుషారులో ట్విటర్ ఖాతా కూడా తెరిచి నాకు వచ్చిన ఆలోచనలు రాసేస్తున్నాను. ప్రధానంగా నా ముఖపత్రంలో ఇంగ్లీషులో రాయనని నియమం పెట్టుకున్నాను కనక ఈ ఖాతా తెరిచేను.

ఆఖరికి ఓటేయాలని నిర్ణయించుకునేస్థాయికి కూడా ఎదిగిపోయేనని చెప్పడానికి సంతోషంగా ఉంది. నాజీవితంలో ఇదే మొదటిసారి నా అమూల్యమైన ఓటు ఖర్చు పెట్టడం. ఈ మాట మాఅమ్మాయికి చెప్తే ఎగిరిపడి, "ఓహ్, నాకు నువ్వు ఇవ్వగల గొప్పబహుమతి మరోటి లేదు," అంటూ మురిసిపోయింది. ఇది తనకి అంత ముఖ్యమైన విషయం అని నాకింతవరకూ తెలీదు. నన్నెప్పుడూ అడగలేదు "ఎందుకు ఓటు వేయవు?" అని మరి. అంచేత కూడా ధన్యత చెందితిన్ అనుకుని నీతో కూడా పంచుకోవాలనిపించింది. అదన్నమాట కథ!

000

(అక్టోబరు 6, 2016)

# 24. Rideవ్వకు సుమా!

ఇది ఒక ఊహాచిత్రం మాత్రమే. మనదేశంలో ఎవరూ కారులో ride ఇవ్వరని విన్నాను. వాళ్ళు రైడెందుకివ్వరో చెప్పేముందు అమెరికాలో రైడివ్వడం ఎలా జరుగుతుందో చూదాం.

పొట్టి జవాబు - అమెరికాలో కార్లెక్కువా మనుషులు తక్కువా, మనదేశంలో మనుషులెక్కువా కార్లు తక్కువా. మనవాళ్ళు రైడివ్వడం మొదలు పెడితే ఆ రథం ఇల్లు చేరడానికి బహుశా మూడ్రోజులు పట్టొచ్చు.

పొడుగు సమాధానం - అదే ఇక్కడ కార్లెక్కువ. సాధారణంగా మేలుకున్నవేళలో కనీసం ముప్పైశాతం కార్లలోనే గడుస్తుంది. సాధారణంగా కారు లేనివాళ్ళు తక్కువ కనక కారున్నవారు లేనివారియందు ఉదారభావం కలిగి ఉంటారు. ఇందులో చాలా కిటికులున్నాయి. అవన్నీ ఇక్కడ చెప్పను కానీ కొన్ని నీకు తెలియాలి. ఏమాత్రమైనా ముఖపరిచయం ఉన్నవారు కాలినడకన వెళ్తూ కనిపిస్తే, వాళ్ళు వ్యాయామంకోసమే నడుస్తున్నారని తెలిసినా, పద, నిన్నక్కడ దింపేస్తాను అనడం కేవలం పలకరింపు, హాలో కులాసాయేనాలాగ. కాళ్ళతో నడిస్తే వ్యాయామం కానీ కారుమీద వెళ్తే వ్యాయామం ఎలా అవుతుంది అంటే చెప్పడానికేం లేదు.

మరోరకం - అవసరమైనప్పుడు పిలిస్తే, అవతలివారికి మరోపని లేకపోతే రైడు ఇవ్వం అనేవాళ్లకన్నా ఇస్తాం అనేవాళ్ళే ఎక్కువ. అలాటప్పుడు రైడు పుచ్చుకున్నవారు gas money అంటూ నాలుగో పదో - ఎంత దూరం వెళ్తున్నాం అన్నదాన్నిబట్టి - సొమ్ము ఇవ్వజూపుతారు. కొందరు పుచ్చుకుంటారు, కొందరు ఫరవాలేదులే, అవసరం లేదనేసి వెళ్ళిపోతారు. వీటన్నిటికీ అంతకంటే అంతరార్థాలు లేవు. ఏవో దురాలోచనలో దూరాలోచనలో మనసులో పెట్టుకు చేస్తున్నారు అనడం న్యాయం కాదు.

మరోరకం సాయం - hitchhiking. నేను అమెరికా వచ్చిన కొత్తలో వీధివార పిడికిలి బిగించి బొటనవేలు చూపుతూ నిలబడినవాళ్లని చూసి మంచినీళ్ళకోసం కాబోలు అనుకున్నాను. ఇప్పటివాళ్ళకి తెలియకపోవచ్చు కానీ నాచిన్నప్పుడు స్కూళ్ళలో దాహం అని చెప్పడానికి అది సంకేతం మరి. తరవాత తెలిసింది అటే వెళ్తున్న కారయితే కొంతదూరం అయినా కారులో ఎక్కించుకకు తీసుకెళ్ళమని అడగడం అని.

వీరు అంతకుముందు ఏమాత్రమూ పరిచయం లేనివారే కనక ఈ సాయం కొంత ప్రమాదంతో కూడుకున్నది. అంచేత అడిగినప్రతివాడినీ కారులో పోతున్న ప్రతివాడూ ఎక్కించేసుకోడానికి ఉత్సాహం చూపరు. రెండోది, కారెక్కేక కబుర్లు కూడా ఉండవు. వీలయినంత దూరం వెళ్ళేక, ఆ వ్యక్తిని దింపేసి తనదారిన తాను పోతాడు.

000

ఇంక మనదేశంలో ఈరైడుప్రదానాలు ఎందుకు జరగవంటే, చెప్పేను కదా మనకి కార్లు తక్కువ మనుషులెక్కువా అని. తిరణాలేమో అనిపించేలా జనసందోహం మనుషులు రోడ్డుమీద నడిచిపోతుంటే కారాపి, "రా బాబూ, లేక అమ్మా, నీక్కావలసినచోటికి తీసికెళ్ళి దింపుతాను,"అంటూ మొదలుపెడితే ఆమనిషి ఇంటికి చేరడానికి మూడురోజులకి తక్కువ పట్టదు.

2. తెలీనివాళ్లని ఎక్కించుకోడం ప్రమాదం అని కూడా కావచ్చు. ప్రమాదో ధీమతామపి అన్నారు కదా.

3. మీరే తెగించి తెలిసినవాళ్ళని పిలిచి అడిగితే, డ్రైవరు లేడు, కారు రిపేరులో ఉంది ... లాటికారణాలు వినిపించొచ్చు. ఒకసారి నేను ఇండియా వచ్చినప్పుడు, రైడివ్వడం కాదు, ఆవిడే నన్ను చూడ్డానికి వస్తానని మొదట చెప్పి, ఆ తరవాత పన్నెండు సార్లు చెప్పింది తమకి రెండు కార్లున్నాయని, కానీ ఒక్కటీ తనకి ఆ సమయంలో అందుబాటులో లేదనీ. నాకు నవ్వెక్కడొచ్చిందంటే, కారు పంపిస్తాను, మీరు రండి అన్నప్పుడు. నాకు పంపగల కారులో ఆవిడే రావచ్చు కదా. అసలు

విషయం నేను ఆవిడకథ అనువాదం చెయ్యాలన్న కోరికతో. ఆసంగతి తెలిసేక నాకు ఆవిడని కలుసుకునే ఉద్దేశం చచ్చిపోయింది.

4. మరో సందర్భం అంతో ఇంతో తెలిసిన మొహం కనబడి రైడిస్తాను, రమ్మని పిలిచినప్పుడు. ఎందుకండీ మీకు శ్రమ అంటూ మొహమాటపడుతూనే ఆయన కారెక్కుతారు. ఇంటిదాకా వచ్చేక, ఆయన లోపలికి పిలుస్తాడు కాఫీ తాగి పోదురు గాని అంటూ. ఎంత వద్దన్నా వినిపించుకోడు. సరే కాఫీయే కదా అని చోదకుడుగారు లోపలికెళ్తారు.

అప్పటికే ఆయనకి అరగంట ఆలస్యం అయిపోయింది. లేచి బయల్దేరబోతుంటే, కాస్త మానాన్నగారు అటే వెళ్ళాలి, వారిని తీసుకెళ్తారా అని మర్యాదగానే అడుగుతుంది యజమానురాలు. ఆయనకి ఊరు కొత్త, టాక్సీ ఎక్కడానికి సందేహం అని కూడా చెప్తుంది.

సరే అని వారిని కారెక్కించుకుంటారు చోదకుడు గారు. ఆ తరవాత -

ఏ ఊరు బాబూ, ఏం చేస్తున్నావు, పెళ్ళయిందా, అమ్మాయి కూడా చదువుకుందా, ఉద్యోగం చేస్తోందా?

- చేస్తోందంటే, ఇద్దరూ చదువులూ, ఉద్యోగాలూ, ఏంటో ... మాఅమ్మ గడపదాటి ఎరగదు ప్రతి శనివారం ఆంజనేయస్వామిగుడికి తప్ప ...

- చేయడం లేదంటే, ఎందుకు చెయ్యడం లేదు. ఈరోజుల్లో ఇద్దరూ చెరో నాలుగు రాళ్లు తెచ్చుకుంటేనే, వయసు మళ్లేవేళకి నాలుగు రాళ్ళు వెనకేసుకోగలుగుతారు.

- లేదండీ, చదువుకోలేదావిడ.

- మరి కాలక్షేపం ఎలా? పోనీ ముఖపుస్తకంలో ఖాతా తెరిపించేయ్.

- చెప్పేను కదండీ. ఇంగ్లీషు రాదు.

- అబ్బే ఇంగ్లీషు రానక్ఖర్లేదు.

- తెలుగులో టైపు చెయ్యడం కష్టం కదండీ.

- అయ్యో అదేంలేదు. ఎబీసీడీలొస్తే చాలు. తెలుగుమాటలే టైపు చేసుకుంటూ పోవడమే.

- ఏమో లెండి. దానికో పద్ధతి ఉంది కదా.

- అయ్యో రామా! అదేం లేదిప్పుడు. ఎవరికెలా తోస్తే అలా కొట్టుకుంటూ పోవడమే. ఒకావిడుంది. తెలుగులోనే రాయి రాయంటూ రాసి రంపాన పెడుతుంది. ఆవిడజోలికి మాత్రం వెళ్ళొద్దు. ఇంకెక్కడయినా ఫరవాలేదు. ... ఇలా ఒక్క కణం ఊపిరి తీసుకోడానికి లేకుండా సాగిపోతుంది సంభాషణ.

మరో బాధ కారెక్కేక సంగీతం కానీ సెల్ కానీ. ఎక్కినవారి అభిరుచులూ, ఎక్కించుకున్నవారి అభిరుచులూ ఉత్తర దక్షిణధృవాలవొచ్చు. అయిదో పదో నిముషాలప్రయాణం అయితే ఎలాగోలా సర్దుకుపోవచ్చు కానీ గంటా గంటన్నరయితే తంటా.

నేను మాడిసన్లో ఉన్నప్పుడు నాకు చాలా ఇష్టమైన ఒక అలవాటు కారులో కర్ణాటకసంగీతం టేపులు నాలుగేసుకుని చుట్టుపట్ల పల్లెదార్లంట తిరగడం. ఇప్పుడు ఆ దార్లు లేవు. నాకారులో టేపులు వాడే వసతి కూడా లేదు.

ఇంతకీ ఆరోజుల్లో ఓమారు నాకు తెలిసినవారికారులో గంటన్నర ప్రయాణం చేయవలసివచ్చింది. కారెక్కి ఎక్కకముందే భజనపాటలు పెట్టేరు, అదీ పక్కనించి పోతున్నకారులోవాళ్లు కూడా అదిరిపడి మావేపుచూడగలస్థాయిలో. పైన చెప్పేను కదా నేను సంగీతం వింటానని. కానీ అవి ఈ భజనలూ కావూ ఆస్థాయిలోనూ కాదు. కానీ ఆకారులో నేను చెయ్యగలిగింది ఏమీ లేదు. నా పూర్వజన్మ సంచితార్థమిది, అనుభవించకతప్పదు అనుకోడం తప్పు. కారెక్కితే ఏదో ఒక హోరు తప్పదు అన్నది ఒక్కటే వాస్తవం.

000

ఒక్కమాటలో నేను చెప్పదలుచుకున్నది అమెరికాలో రైడంటే రైడే. మనకి అదొక సాంఘికఘటన లేక దైవయోగము. పెళ్ళినిర్ణయాలు కూడా అయిపోవచ్చు అలాటి

సమయాల్లో.

మళ్ళీ చెప్పలేదనకండి. నిజంగా ఇండియాలో ఏం జరుగుతోందో నాకు తెలీదు.  ఇది హాస్యముకొరకు రాయబడినది.

000

(అక్టోబరు 18, 2016)

# 25. శాంతము లేక సౌఖ్యము లేదు

సుఖంపెక్కడున్నాది అంటూ దిక్కులు చూస్తూ ముందొక టపా రాసేను కానీ దానికి సంబంధించిన ఆలోచనలు నన్నింకా వెన్నాడుతూనే ఉన్నాయి పేటకుక్కల్లా. అంచేత మరోమారు అదే విషయం పరామర్శిస్తూ మరికొన్ని ఆలోచనలు రాస్తున్నాను.

సుఖం అంటే ఏమిటి? అని కొందరిని అడిగేను. ఇళ్లూ, వాహనాలూ, ఆస్తిపాస్తులూ, వంశోద్ధారకులూ, వాళ్లచదువులూ, వాళ్ళ పెళ్ళిళ్లూ, ఉన్నతోద్యోగాలూ, మళ్ళీ వాళ్ళ పిల్లలు ... ఇలా చాలా సుఖాలను ఏకరువు పెట్టేరు. ఆలోచించు. ఈ సుఖాలన్నిటికీ అంటే ఇళ్లూ, వాహనాలూ వీటన్నిటికీ డబ్బు కావాలి అ డబ్బుకోసం ఎన్నో కష్టనష్టాలు అనుభవిస్తాం. వీటన్నటిమధ్య అనుభవిస్తున్న సుఖం పాలెంత అని నా సందేహం. ఎప్పుడు ఏది చాలు అనుకుంటాం? అనుకోగలం?

సుఖానికి సంపదలే కావాలా? ఏమో మరి. భుక్తికోసం కుచేలుడు కృష్ణుడిదగ్గరికి వెస్తే, కృష్ణుడు అష్టైశ్వర్యాలూ ప్రసాదించేడు. వరలక్ష్మి వ్రతం, దుర్గాపూజ, సత్యనారాయణవ్రతంలాటివి చేస్తే ఇహలోకసుఖాలూ, సంపదలూ ప్రాప్తిస్తాయని చెప్తారు. పరలోకప్రాప్తి ప్రసక్తి కూడా ఉంది కానీ నామీద మాత్రం ఇహలోకసౌఖ్యాల భావముద్రలే బలంగా పడ్డాయి.

అసలు ఈసుఖం అనేపదం ఎలా పుట్టిందో నాకు తెలీదు. అంటే భాషాశాస్త్రం పుస్తకాలు చూస్తే వ్యుత్పత్తి తెలియొచ్చు కానీ నాకు అది సంతృప్తినిస్తుందనుకోను.

కొంతమందికి సుఖం అంటే శరీరాన్ని పదిలంగా ఉంచుకోడమే. కూర్చున్నచోటినించి కదలరు తలుపు తీయడానికైనా. "నువ్వు తలుపుకి దగ్గరగా ఉన్నావు, వెళ్ళి తీయి" అని పక్కనున్నావిడకి ఆదేశిస్తారు. అలాటివారిగురించి మాఅమ్మ అంటూండేది, "లేచి తలుపు తీస్తే ఏం పోతుంది, పోయేటప్పుడు శరీరం తూచి

అప్పగిస్తారేమిటి?" అని. బద్ధకానికి పరాకాష్ఠ అది.

ఆధునికయుగంలో శరీరం అలిసిపోకుండా కాపాడుకోడానికి అనేక సాధనాలు. అవన్నీ మీకూ తెలుసు కద. నిజానికి అవి లేనప్పుడు ఏం చేసేవారో కొందరికి తెలియకపోవచ్చు. ఈరోజుల్లో కార్లు, మోటారు సైకిళ్లూ ఇవన్నీ ప్రయాణసాధనాలు. చాలాదూరం వెళ్ళాలంటే ఇవి పనికిరావచ్చు కానీ వీధి చివర కొట్టుకి కూడా ఎగిరి ఈ వాహనంమీదకి దూకేవారిని చూసేను. పైగా, వీటివల్ల జరుగుతున్న ప్రమాదాలు కూడా ఆధునికమే. కారు లేనిరోజుల్లో కారుప్రమాదాలూ లేవు కదా. పైగా, కార్లలో కూడా ఎన్ని సుఖాలు! సంగీతం, జిపియస్, automatic shift, ఒకొక సదుపాయం చేరినప్పుడల్లా, నడిపేవాడికి మరింత సౌకర్యం, దాంతోనే అదే నిష్పత్తిలో చేతిలోని చక్రంమీద ధ్యాస తరిగిపోవడం కూడానూ. త్వరలోనే self-driving కార్లు వస్తున్నాయి. ఇంక ఎన్ని ప్రమాదాలకి అవకాశమో ఆలోచిస్తే నాకు చాలా కోపం వస్తోంది. సుఖం ఎక్కువయినకొద్దీ బుద్ధి పని చేయడం తగ్గుతుంది. ఆ తరవాత ఔచ్, ఇందులో గ్లిచ్ ఉంది అంటూ కంపెనీలవాళ్ళు కారుని వెనక్కి తీసుకోవచ్చు కానీ ఈలోపున ఎన్ని ప్రాణాలు పోతాయో. ఇలా సుఖంపేరున లేని తద్దినాలు తలకెత్తుకుని మనమే మనబతుకులకి నిప్పెట్టుకుంటున్నాం.

పూర్వకాలంలో సుఖాలగురించి మాటాడినప్పుడు ఇలాటి సుఖాలు కాదు. చూడు. పాండవోద్యోగంఘుట్టంలో కృష్ణుడు అడిగిన కుశలప్రశ్నలు చూస్తే సదనాలకీ వాహనాలకీ, అలుపెరుగని పనులకీ కాక ధర్మనిర్వహణకి ఎక్కువ విలువ ఉన్నట్టు కనిపిస్తుంది. "ఎప్పుడొచ్చేవు, అన్నదమ్ములూ, పిల్లలూ, చుట్టాలూ, నీ ప్రభుత్వాన్ని జాగ్రత్తగా చూసుకునే కర్ణుడూ అందరూ బాగున్నారా అని అడిగేడు సుయోధనుడిని. వంశోన్నతిని గోరు భీష్ముడు మొదలయినవారంతా నీ తేజంబు హెచ్చించుచుతూ మెలగుతున్నారా అంటాడు. సుయోధనుడు రాజు. ఆయనకి రాజ్యం ముఖ్యం. ఆ ప్రశ్నలన్నీ ఆ రాజవైభవానికి అనుగుణంగా ఉన్నాయి. అర్జునుడిని యశస్కులయిన అన్నలు, మంచిమనసుగల తమ్ములు బాగున్నారా, వృకోదరుడు అన్నమాట వింటూ శాంతంగా ఉంటున్నాడా అంటాడు.

ఈ ప్రశ్నలు చూస్తే ధర్మనిర్వహణ, కర్తవ్యనిర్వహణకే ఎక్కువ ప్రాధాన్యం అనిపిస్తోంది. అవి ఉన్నప్పుడే, వాటితోపాటే మానసికమైన ఆనందం కూడాను. కుటుంబంలో వారు ధర్మం పాటిస్తే మనసుకి హాయి కదా. భాగవతంలో ఒకచోట మాత్రం నేను క్షణకాలం ఆగవలసి వచ్చింది. శుకుడు పరీక్షన్మహారాజుకి సృష్టి ఎలా జరిగిందో చెప్పేముందు విష్ణువుని వర్ణిస్తూ, ఆ మహాత్ముడు ఆటలాడుకోడానికి జగత్తు సృష్టించేతలంపుతో తనకు సుఖశయనం అపేక్షించి మొదట జలం సృష్టించేడుట. ఆఖరికి ఆ మహావిష్ణువు కూడా పడకసుఖం మొదట చూసుకున్నాడు. హా.

హాత్ముండు లీలార్థంబై [1]జగత్సర్జనంబు సేయుతలంపున బ్రహ్మాం
డంబు వినిర్భేదించి తనకు సుఖశయనంబు నపేక్షించి మొదల జల
తత్త్వంబు సృజియించె. స్వతః పరిశుద్ధుండుఁ గావున స్వసృష్టంబై

ఏమైనా, సుఖం అన్నది అనాదిగా ఉందన్నది నిర్ధారణ అయిపోయింది. సుఖం ఒక్క శరీరానికి మాత్రమే పరిమితం కాదు. మాటవరసకి అందం చూడు. బాహ్యసౌందర్యం కాదు చూడవలసింది అంటారొపక్క మళ్లీ తెల్లారి లేచి అద్దంలో మొహం చూసుకోని మనిషి కానీ, అమ్మవార్లనీ అయ్యవార్లనీ ఓపినంతలోనే ఆభరణాలతో అలంకరించని భక్తులు గానీ ఉన్నారా? లేరు. అంతెందుకూ సౌందర్యలహరిలో దేవీస్తుతి అంతా కంటికి కనిపించే అందమే అనిపిస్తుంది కానీ అందులో ఆ అద్భుత సౌందర్యం అంతస్సౌందర్యానికీ ప్రతీకగా ఆవిష్కరించబడింది. నా ఈ అలోచనలు అజ్ఞానం అనో అరకొరజ్ఞానం అనో తీసిపారేయవచ్చు విజ్ఞులు. నిర్గుణధ్యానానికి సగుణధ్యానం తొలిమెట్టు అనొచ్చు కానీ ధ్యాస భగవంతునిమీద నిలపడానికి ఆ అలంకారాలు తోడవుతున్నాయని ఒప్పుకోకతప్పదు.

నవకాయ పిండివంటలతో ముక్కు వరకూ మెక్కి, అది అరిగేవరకూ వాలుకుర్చీలో వాలి కునుకు తీయడమే సుఖం కాదు. పంచేంద్రియాలూ అనుభవించే తృప్తి, ఆనందం కూడా సుఖాన్నిస్తుంది. కంటికి నదురుగా కనిపించే వస్తువు, చెవికింపుగా వినిపించే సంగీతం, వేళ్లకి మృదువుగా తగిలే పూవూ, నోరూరించే పండూ … అన్నీ కలిగించేది సుఖమే కదూ.

నేనీమధ్య శ్రీమదాంధ్ర మహాభాగవతం చదవడం మొదలు పెట్టేను. ఈమధ్య ఏమిటిలెండి, పుస్తకం జాలంలోంచి తీసుకుని మూడేళ్ళకి పైనే అయింది. ఎప్పుడు మొదలుపెట్టినా ఎవరు ఎవరితో మాటాడుతున్నారో అర్థం కాక వదిలేస్తూ వచ్చేను. ఇంతకాలంతరవాత, అనేక ప్రయత్నాలతరవాత అర్థమయింది ఏమిటంటే శ్రీమహావిష్ణువు బ్రహ్మకీ, బ్రహ్మ నారదుడికీ, నారదుడు వ్యాసుడికీ, వ్యాసుడు (ఈయనే కృష్ణ ద్వైపాయనుడు) తనకుమారుడయిన శుకుడికీ, శుకుడు పరీక్షత్తుకీ చెప్పేడు అని. సూతుడు శౌనకాది మహామునులకి చెప్పేడు. మరి సూతుడు ఎవరిదగ్గర్నుంచి ఈ భాగవతకథనం విన్నాడో తెలీలేదు. ఎక్కడో నేనే తప్పిపోయినట్టున్నాను. ఇంకా విదురుడు తన పూర్వజన్మవృత్తాంతం వివరించడం కూడా ఉంది. నాకు కలిగిన మరోసందేహం శుకుడు ఏ ఒక్కచోట గానీ గోదోహనమాత్రకాలం - ఆవుపాలు పితికినంతసేపుకంటె ఎక్కువసేపు నిలవడుట. మరి పరీక్షత్తుకి ఏడురోజులపాటు భాగవతగాథ చెప్పడం ఎలా జరిగింది? ఏమో మరి. ఇవన్నీ గుర్తు పెట్టుకోడానికి నాకు అంత టైం పడుతోందన్నమాట మాత్రం నిజం..

అసలు ఇక్కడ మరోమాట కూడా చెప్పాలి. చాలామందిలా నేను వారానికి మూడు పుస్తకాలు చదివిపారేసేరకం కాదు. కంటబడ్డ ప్రతిపుస్తకం చదివి తీరాలన్న నియమం లేదు నాకు. చదవకపోతే కొంపలు మునిగిపోవన్న గట్టి నమ్మకం కూడా ఉంది. అంచేత ఏం చదివేను, అందులో ఎంత తలకెక్కిందీ చూసుకుంటూ తీరిగ్గా రోజుకు రెండో మూడో పేజీలు చదువుతూ గడుపుతాను.

మహాభాగవతంసంగతి - ఇంకో రెండు మాటలు చెప్పి ముగిస్తాను. మూడేళ్ళనించీ చూస్తున్నానని చెప్పేను కదా. ఆఖరికి నాలుగునెలలక్రితం మొదలుపెట్టి రెండు అధ్యాయాలు పూర్తి చేసేను.

కొన్ని పద్యాలు చిన్నప్పుడు స్కూల్లో చదువుకున్నవి ఫలరసాదులగురియవే పాదపములు, మందారమకరంద మాధుర్యమున లాటివి కనిపించినప్పుడు ఓహో ఇది ఇక్కడుందన్నమాట అని సంతోషపడిపోయేను

ఈ పుస్తకంలో కొన్ని మాటలకి అర్థాలు ఇచ్చేరు. ఏమాటకి అర్థం ఇవ్వాలి అన్నవిషయంలో ఆ సంపాదకులనిర్ణయం నాకు తమాషాగా ఉంది ఎగ్గు, అజ్ఞత, ఆర్తి లాటి మాటలకి అర్థాలు చూస్తే. ఈమాటలకి అర్థాలు తెలీనివాళ్ళున్నారని వాళ్లు అనుకున్నారనిపించదూ? ఒకొకప్పుడు ప్రాచుర్యంలో ఉన్నఅర్థం కాక ఇతర అర్థాలు కూడా ఉంటాయి. తోయము అంటే నీరు అని తెలుసు కానీ స్నేహము, విధము లాటి అర్థాలు కూడా ఉన్నాయని ఈ పద్యం చూసినప్పుడే తెలిసింది, అదే, వారు చెప్పేక. ఈ పద్యం నాకు చాలా నచ్చింది.

క. [4]తోయజసంభవ నాకీ, [5]తోయము వివరింపఁజాలఁ దోఁచిన నేనా
[6]తోయము వారికినన్యుల, [7]తోయములం జెందకుండ ధ్రువమెఱిఁగింతుర్.

అయితే నాకు తెలీనిమాటలు ఇంకా చాలా ఉన్నాయి కానీ వాటికి అర్థాలు లేవు. ఈపాటికి మీకు అర్థమయే ఉండాలి. నాకు చదవడం ఒక సుఖకరమైన వ్యాపకం. అంటే అందరిలాగా కప్పుదాటుగానో వేలితో కాయితంమీద తడుముకుంటూ లీలామాత్రంగా విషయం ఏమిటో మూడు క్షణాల్లో తెలుసుకునేసి, హమ్మయ్య చదివేసేను అని తృప్తి పడడం కాదు. దానిమీద రెండుపేజీలసమీక్ష రాసిపారేయడం కూడా కాదు. నేను తీరిగ్గా ఒకొక అక్షరమే చూసుకుంటూ, పదాలమధ్య విరుపు ఎక్కడుందో చూసుకుంటూ అందులో నాకు తెలిసిన మాటలు కనుక్కున్నప్పుడు ఆనందపడిపోతూ చదువుతాను. Word search ఆటలాగ అన్నమాట. ఉదాహరణకి ఈ వాక్యం చూడు.

క. కామముదహించెఁగ్రోధమ, హామహిమనురుద్రుఁడట్టియవమర్షంబున్
ధీమంతులు గెలిచి రనం,గా మము గెలుచుటలు సెప్పఁగానేమిటికిన్.

కామము దహించె మధ్య విరామం ఉండాలి. మ తరవాత కామా ఉండరాదు. ఆ వాక్యం సరిగా చదవాలంటే కామము దహించే క్రోధ మహా మహిమను రుద్రుడు అట్టి అవమర్షంబున్ ..గెలిచిరి అనంగా - అనం తరవాత కామా ఉండరాదు ఇలా చూసుకుంటూ అన్నమాట చదువుతాను. ఇదీ నా భాగవతపఠన సమాచారం.

ఇక వేతే కష్టాలూ, సుఖాలూ మాటకొస్తే, ఒకటి అనుభవిస్తేనే రెండోది ఎక్కువ బలంగా నాటుకుంటుంది. కష్టపడి ఆర్జించిన సొమ్ము ఎక్కువ సంతృప్తి కలిగిస్తుంది ముదనష్టపు సిరికన్నా. కానీ చాలామంది అది గ్రహించరు. గ్రహించినా ఒప్పుకోరు. కలిసొచ్చిన సిరి ఆరిపోయేవరకూ ఖర్చు పెట్టేస్తారు ఆనందాలపేరుతో. ఆ తరవాత మళ్ళీ ఎక్కడినించి వస్తుందా అనుకుంటూ దిక్కులు చూస్తారు.

మీకు ఈ వితండవాదం అంతా చిరాకుగా ఉందనిపిస్తే సరే నామాట వినొద్దు. మహా మేధావి దలైలామా మాట వినండి. ఆయన కూడా సుఖం అంటే సంతోషం అనే చెప్తున్నారు. అన్నట్టు చెప్పనా దలైలామా, నేనూ ఒకే నెలలో పుట్టేం. వేరు వేరు సంవత్సరాలు.

దక్షిణ ఆఫ్రికా క్రియాశీలి Desmond Tutu టిబెట్ క్రియాశీలి దలైలామాతో సుఖసంతోషాలగురించి మాటాడితే, ఏం మాటాడతారు? నాకు ఈ విడియో చూస్తుంటే చాలా ప్రశాంతంగా ఉంది. ఇక్కడ వీరిద్దరినీ activists అంటారు. ఆమాటకి అర్థం ఆందోళనకారులు అని నిఘంటువులో ఉంది కానీ నాకు వీరు ఆందోళన కలిగిస్తున్నట్టు కనిపించలేదు, ధర్మసూక్ష్మాలు వివరిస్తున్నట్టే తప్ప.

https://www.youtube.com/watch?v=HclFjAn6BwQ&feature=youtu.be

.

ooo

(అక్టోబరు 29, 2016)

# 26. సోయా వడీ వ్యవహారం

అసలు ఓం ప్రథమం సోయా వడి పేరుతోనే వచ్చింది గొడవ. ఈమధ్య బలవర్ధకం అని సోయాతో చేసిన ఏ పదార్థం కనిపించినా గబగబ కొనేసి తినేస్తున్నాను. నిజం చెప్పొద్దూ. నిజంగా అది తిన్నపూట ఓపిక ఓ పదిశాతం పెరుగుతున్నట్టే కనిపిస్తోంది.

ఇంతకీ వడీ అంటే వడియాలనుకున్నాను, మన ఔత్తరాహులభాష గుర్తుకి తెచ్చుకుని. గుమ్మడొడియాల్లా వేయించుకోవచ్చని ముచ్చట పడిపోతూ ఇంటికి తీసుకొచ్చేను. తీరా వండుకొను విధానము ఆ పెట్టెమీద చూస్తే, చిన్న క్రతువులా ఉకనిపించింది

మొదట కడగమన్నారు. ఆ ఎండుముక్కలు నీళ్ళలో వేసేసరికి బట్టలుతుక్కునే washerలా నురగలు కక్కడం మొదలెట్టింది. ఛీ ఇదా నేను తినేది అనిపించింది. సరే మళ్ళీ కడిగీ పిడిచీ కడిగీ పిడిచీ ఇంక ఫరవాలేదని నాకు నమ్మకం కుదిరేవరకూ చేసి, ఆతరవాత దాన్నేం చెయ్యడం అనుకుంటూ జాలం వెతికేను. టొమెటో, అల్లం, వెల్లుల్లి, నీరుల్లీ, పచ్చిమిరపకాయలూ, ఎండుమిరపకాయలూ, ధనియాలపొడి, ఆవాలూ, జీలకర్రా - ఇలా చెప్పుకుపోతుంటే, ఏంటో ఇన్ని తగలేసేక పచ్చగడ్డి కూడా రుచిగానే ఉంటుంది కదా అనిపించింది.

ఇంతకీ ఇవన్నీ జోడించి పావుగంటసేపు ఉడకబెడితే, అవి నామొహంలాగే ఉన్నాయింకా. రబ్బరు నమిలినట్టుంది కానీ నోరూరే రుచులేవీ తగల్లేదు జిహ్వాకి. సరే అదక్కడ వదిలేసి మిగతా వడియాలు మళ్ళీ సుబ్బరంగా ముప్పై మార్లు కడిగి, నీరంతా పిడిచేసి పళ్ళెంలో ఆరబెట్టేను. ఆ తరవాత బ్లెండరులో వేసి పొడి చేసేను. మళ్ళీ మరో పెద్ద పళ్ళెంలో ఆరబెట్టేను.

మర్నాడు ఆపొడిని రెండు భాగాలు చేసేను. పొయ్యి వెలిగించి, గిన్నెలో ఓ చెంచాడు నెయ్యేసి ఒక సగం పొడిని వేసి పచ్చివాసన పోయేవరకూ వేయించేను. తరవాత

పంచదార, ఏలకపొడి వేసి మరి కొంచెంసేపు వేయించేను. చిటికెడు నోట్లో వేసుకు చూస్తే అబ్బ ఎంత బావుందో. చాలా ఆనందపడిపోయేను మొత్తంమీద వడియాలని ఉద్ధరించి ఉపయోగించగలిగినందుకు. చెప్పేనా నాకు ఏది గానీ ఊరికే పారేయడం ఇష్టం ఉండదు. అలా అనేక ప్రయత్నాలు చేసి అప్పటికీ బాగులేకపోతే అప్పుడు పారేస్తాననుకో, అది వేసే సంగతి.

ఇంక రెండో భాగం ఉంది కదా. దాన్ని మళ్ళీ మరో గిన్నెలో చెంచాడు నూనె వేసి వేయించి, బాగా వేగేక చిటికెడు ఉప్పూ, కారం చల్లి తీసి వేరే పెట్టేను. అది కూరల్లో చల్లడానికి. ఎలాగోలాగ తినడం ధ్యేయం మరి.

ఈరోజు పొద్దున్నే కాఫీ అయేక, ఐస్క్రీం తినడానికి తీసేను. దాన్ని ఆరోగ్యకరం చేయాలి కదా అని నిన్న తయారు చేసిన సోయా పొడి చల్లేను. బావుంది చల్లగా, తియ్యగా, ఉప్పగా, కారంగా. ఇక్కడ కొన్ని ఖాద్య పదార్థాలు చూసేను - sweet and sour, sweet and salty … లాటివి. ఈ ఉదయం నా breakfast కూడా అంతే cool and hot.

000

(నవంబరు 4, 2016)

# 27. Scrabble ఆడడంలో కష్టసుఖాలు!

ఈ ఆటలో సుఖం చెప్పేముందు ఈనాటి జీవనశైలిలో సరదా లేక కాలక్షేపాలకి గల అత్యంత ప్రాధాన్యతగురించి రెండు మాటలు చెప్పాలి.

మా పక్కవాటాలో ఒక అమ్మాయి ఉంది నేను కనిపించినప్పుడల్లా ఆగి రెండునిముషాలు మాటాడుతుంది. ఆమాటల్లో తరుచూ వచ్చే ప్రశ్న "నువ్వు funకేం చేస్తావు?" అని. వీళ్ళ జీవితాల్లో fun అనబడే విశేషానికి చాలా ప్రాముఖ్యం ఉంది. నిజానికి ఈ పదానికి సరదా, వినోదం, కాలక అని చెప్పుకోవచ్చేమో కానీ ఈ పోస్టుకి సంబంధించినందవరకూ ఫన్ను అననుటే మేలు. ప్రతీ పనీ ఫన్నవాలి. ఫన్నయితేనే పెన్నిధి. ఫన్నే దినమును నిత్యనూతనం చేస్తుంది. చదివే చదువూ, చేసే ఉద్యోగం, కాపురం, అన్నీ ఫన్నుగా ఉండాలి. వాటిని ఫన్నుగా ఉంచడానికి నానాయాతనా పడతారు. ఆ యాతనలు కూడా ఫన్నుగానే ఉండాలంటారు కానీ నాకు అనుమానమే!

మొదటిసారి ఆ అమ్మాయి నన్నలా అడిగినప్పుడు నేను రచయితని, కతలు రాసుకుంటాను అన్నాను కొంచెం గర్వంగానూ, చాలా వినయంగానూ. ఆహా రచయితా అని ఆశ్చర్యపోవాలని నా రహస్య ఆశ. ఆ అమ్మాయి మొహం వెలగలేదు ఆశ్చర్యంతో గానీ అనుమానంతో గానీ. బహుశా రాయడం వృత్తి, సరదా ఎక్కడుంది అని కాబోలు. నేను చేస్తున్నపని నాకు ఆనందంగా అంటే ఫన్నుగా ఉంది. మరి వృత్తి కూడా ఫన్నుగానే ఉండాలని వీరి నమ్మకం కదా. ఆ అమ్మాయి ఒక నిముషం నామొహంలోకి పరీక్షగా చూసి, "ఓహో, అలాగా, మరి ఫన్నుకోసం ఏం చేస్తావు?" అనడిగింది.

నేను కూడా ఆలోచనలో పడ్డాను. ఏం చెప్పాలో నాకు తోచలేదు. అక్కడికది

వదిలేసి కుశలప్రశ్నలడిగేసి ఆ సంభాషణ ముగించేసేం. ఎంచేతో ఈ మధ్య తను అట్టే కనిపించడంలేదు. ఆవిధంగా నాకూ ఆ అమ్మాయికీ ఆ గోల తప్పిపోయింది. ఇంతకీ మీకింకా నేను ఘన్నుకేం చేస్తానో మీకు తెలుసుకోవాలనుంటే, చదవడం సాగించండి.

నాకు scrabble ఆడడం సుఖం. ఆడుతుంటే హాయిగా ఉంటుంది. సాధారణంగా ఎప్పుడు ఆడతానంటే - పొద్దున్న లేచి కాఫ్యాదులు అయేక, మధ్యాహ్నం కునుకు తీసేముందు, రాత్రి పడుకునేముందు, తోచనప్పుడు, పని లేనప్పుడు, ఉన్న పని వాయిదా వేయాలనుకున్నప్పుడు, చిరాగ్గా ఉన్నప్పుడు, ఆకలేసినప్పుడు, ఆకలేయనప్పుడు, జీవితంమీద విరక్తి పుట్టినప్పుడు ఒక ఆట ఆడితే మనసు ప్రశాంతం అయిపోతుంది. ఇ-రీడరుతో ఆడడంలో ఎక్కువ సుఖం. ఎందుకంటే ఆ యంత్రానికి ఆలోచనా పాలోచనా లేదు కదా. దానికి నిఘంటువులో పదాలన్నీ కరతలామలకం కనక తనవంతు రాగానే ఠపీమని పదం పడిపోతుంది. అంచేత ఒక ఆటకి పట్టే సమయం కూడా తక్కువ.

మరో సుఖం - మామూలుగా అట్టపెట్టెలో వచ్చే ఆటలో మరొకరితో ఆడుతున్నప్పుడు అవతలివారు పెట్టిన పదాల్లో తప్పులు పట్టడం, మనదే తప్పయితే మనవంతు ఆట వదులుకోవలిసిరావడం ఉంటాయి. కానీ ఈ ఇ-రీడరులో అవతలివారిని రొకాయించడానికి లేదు కానీ మనం తప్పు పెడితే, ఎంతో మర్యాదగా, "అలాటి మాట లేదు, మరోటి చూడు," అంటుంది కానీ మనకి నష్టం లేదు. అంచేత కూడా నాకు ఇది సుఖకరంగా ఉంది.

అయితే ఇందులో సుఖకరం కాని విషయాలు కూడా ఉన్నాయి. అది మనిషి కాదు కనక మనం తగువేసుకోడానికి వసతి లేదు. ఉదాహరణకి xi, ix ఉన్నాయి. రోమన్ అంకెలు 11, 9. కానీ ఆటలో 11 ఒప్పుకుంటుంది కానీ తొమ్మిది ఒప్పుకోదు. అలాగే అనేక సర్వనామాలు. జపాన్ ఫరవాలేదు కానీ చైనా పనికిరాదు. దాల్ ఉంది, చారు లేదు. అదేం అనడగడానికి లేదు. అలాగే అది పెట్టే కొన్ని పదాలు కూడాను. నేను పని గట్టుకుని అవి గుర్తు పెట్టుకు ఆట అయిపోయేక నిఘంటువు చూస్తానా, కొన్ని

దొరుకుతాయి, కొన్ని దొరకవు. దొరికినవి కూడా అన్నీ గుర్తుండవు నాకు. ఒకొకప్పుడు మాట గుర్తుంటుంది కానీ అర్థం గుర్తుండదు. అయితేనేం, ఆటకి పనికొస్తుంది కనక అదే చాలు,

గుర్తున్న పదాల్లో zebu నాకు భలే నచ్చింది. జేబు అంటే brahmin అని ఉంది. అంటే మనిషి బ్రాహ్మణుడో, పరబ్రహ్మో నాకర్థం కాలేదు. దీనికి ప్రతిగా, కక్ష తీర్చుకోడానికి నేనేం చేస్తాను తెలుసా, నాదగ్గరున్న అక్షరాలతో నాఇష్టం వచ్చినట్టు ఒక పదం కూర్చేసి, ఇలాటిపదం ఉండే ఉంటుందిలే అనుకుంటూ పెట్టేస్తాను. ఒకప్పుడు అది పదం అవుతుంది, ఒకప్పుడు కాదు. అయితే మాత్రం ఏం? నేనేమీ రాజ్యాలూ, తమ్ముళ్ళూ, ఇల్లాలినీ పణం ఒడ్డి ఆడడంలేదు కదా. ఒక పదం ఉందని తెలుసుకోడంలో ఎంత ఆనందం ఉందో, లేదని తెలుసుకోడంలో కూడా అంతే ఆనందం ఉంది. నాకు ఉంటుంది.

Wadi అన్న పదం అంగీకారమేన్ట. ఆపదం కంప్యూటరు పెడితే నేను వడియాలు అనుకున్నాను కానీ తరవాత నిఘంటువు చూస్తే కాదని తెలిసింది. వానాకాలంలో మాత్రమే నీటితో నిండే ఏరుట. చూసేరా, నాపదకోశం ఎలా అభివృద్ధి చెందుతోందో.

ఆఊపులోనే నాపదకోశం ఉరువు తెలుసుకోవాలనిపించింది. ఇంగ్లీషుపదకోశం అంటే నాకు తెలిసినఇంగ్లీషుమాటలు ఎన్ని ఉన్నాయో తెలుసుకోడానికి యాపులున్నాయి(apps). నేను చూసుకుంటే నాపదకోశం ఉరువు English మంచి వృత్తులలో ఉన్న తెల్లవారితో పోలిస్తే సుమారు 60శాతం ఉందని తెలుసుకుని మహా ఆనందపడిపోయేను. మరి తెలుగు పదాలు లెఖ్ఖ పెట్టుకోడానికి ఇలాటి యాపులున్నాయో లేదో తెలీదు. తెలిస్తే బాగుండు. మ్.

మరో సరదా మాటలు ఉన్నాయో లేవో అక్షరాలు పేర్చి తెలుసుకోడం. ఎలా అంటే నాదగ్గరున్న అక్షరాలు చూసి, ఇలాటి మాట ఉండి ఉంటుందిలే అనుకుని ఓ పదం కూర్చేస్తాను. నిన్న shalier అని పెట్టేను. అలాటి పదం ఉందని నాకు తెలీదు కానీ పెట్టేసేను. అది అంగీకారం అయిపోయినతరవాత, ఆట ముగించేసేక, నిఘంటువులో చూసేను. Shale ఒక రకం శిలావిశేషం. చూసేరా, ఇలా నాకు కొత్త మాటలు

తెలుస్తాయమన్నమాట. నిజంగా అవన్నీ గుర్తుంటాయనీ కాదు, నేను రాయబోయే ఇంగ్లీషు కథలోనో వ్యాసంలోనో ఇవన్నీ వాడతాననీ కాదు కానీ అలా చేయడం ఒకరకమైన ఆనందాన్ని కలిగిస్తుంది నాకు. ఈసారి మాపొరుగుపిల్ల కనిపించినప్పుడు చెప్పాలి. ఇంత కథ నేను మొదలుపెడితే వినడం ఆపిల్లకి ఫన్నవునో కాదో మరి. మ్.

వెనకటి టపాలో భాగవతం చదువుగురించి చెప్పేను కదా. ఇంచుమించు ఇది కూడా అంతే. పదాలు తెలుసుకోడంలోనే ఆనందం.

000

(నవంబరు 8, 2016)

# 28. వంటింటి సంబరాలు మళ్ళీ

నావంతుకి సంకురాత్రి సంబరాలు కూడా ఇవే అనుకోండి. కిందటేడు నా వంట చిట్కాలు కొన్ని చెప్పేను కదా. ఇప్పుడు మరో రెండు సుళువులు చెప్పాలనిపించి మొదలు పెట్టేను.

మొదటిది కాలానుగుణంగా పీచా (pizza). తెలుగువాళ్ళు, అమెరికాలో ఉండి తరుచూ ఆపదం వాడేవాళ్ళు కూడా, పీజ్జా అని రాస్తారు కానీ నిజానికి ఆ పదం పలుకు తీరు పీట్సా అనే. అందులో కూడా టా స్పష్టంగా పలకడం ఉండదు. అంచేత నేను మాత్రం పీచా అనే రాస్తాను. మీకు కావలిసినట్టు మీరు మార్చుకోవచ్చు. ఇక్కడికి ఉచ్చారణ పాఠం సరి.

ఇప్పుడు ఎలా చెయ్యాలో చెప్తాను. సుళువులయుగం కనక తేలిగ్గా crustకి నేను English muffin కానీ మన నాన్ కానీ వాడతాను.

మిగతా సరంజామా -

టొమెటో పేస్ట్ - పీచా సాస్ అని అమ్ముతారు కానీ అందులో నీరెక్కువ అంచేత నాకు నచ్చలేదు. నేను టొమెటో పేస్టు కొని అందులో రెండు వెల్లుల్లి రెబ్బలు సన్నగా తరిగో, మెత్తగా దంచో కలిపేస్తాను. Oregano పొడి చిటికెడు కలపితే సిసలైన పీచా రుచొచ్చేస్తుంది.

ఉల్లిపాయ సన్నగా తరిగి

టొమెటో పల్చగా చక్రాల్లా తరిగి

ఇంకా వంకాయ, broccali, zuccini, mushrooms, Bell pepper, ఇలా ఏవైనా కూడా వేసుకోవచ్చు.

పైవన్నీ నాన్ మీద పరిచి, వాటిమీద Mozzarella, Parmazan cheese ఒత్తుగా పరిచి, కావలిస్తే కొంచెం ఎండుమిరిపకాయలపొడి కూడా చల్లి పది నిముషాలపాటు

విద్యుత్ పొయ్యిలో పెట్టేడయమే. నేను Toaster-oven వాడతాను కాల్చడానికి. కాల్చడం అని ఎందుకంటున్నానంటే, ఒకసారి కొత్తగా ఇండియానించి వచ్చిన ఒకాయన దాన్ని దిబ్బరొట్టెతో పోల్చేరు. అంతే పీచా కథనం.

పండుగ రోజులు కనక తీపి పదార్థం కూడా చెప్తాను.

నాపద్ధతిలో మైసూరుపాకుకీ బొప్పాయికాయహల్వాకి ఒకటే పద్ధతి. బూడిదగుమ్మడికాయ, సొరకాయతో కూడా హల్వాకి ఇదే పద్ధతి పనికొస్తుంది.

మామూలుగా మైసూరుపాకు చేయడంలో అతికష్టమైన ప్రక్రియ పాకం పదును చూసుకోడం. మీవంటప్రావీణ్యం అంతా ఈ పాకంమీదే ఆధారపడి ఉంటుంది. నాకు ఆ ప్రావీణ్యం లేదు. నేను అమెరికా వచ్చి కొత్తలో పాకం తీసి, శనగపిండీ, బోలెడు నెయ్యీ వేసి తిప్పుకుంటూ కూచోడమే కదా అనుకుని మొదలు పెట్టేను. తీరా అయింతరవాత మాపిల్లముందు పెడితే, పాపం అప్పటికింకా 4,5 ఏళ్ళుంటాయేమో, ఓ ముక్క నోట పెట్టుకుని బాగుంది మామీ అంది కళ్ళనీళ్ళు తరువాయిగా. గోడకి మేకులు కొట్టుకోడానికి పనికొచ్చేలా ఉన్నాయి ముక్కలు. అంచేత చాలాకాలం మైసూరుపాకం తలపెట్టలేదు.

ఇప్పటికి ఈ సుళువులు కనిపెట్టే తెలివొచ్చింది. ఇప్పుడు నేను చేసేది soft batch అన్నమాట.

ఇది తయారు చేయు విధానము.

ముందు శనగపిండి నాలుగు చెంచాలనెయ్యి వేసి దోరగా వేయించాలి. ఇలా చెయ్యడంవల్ల శనగపిండి ఉండలు కట్టకుండా ఉంటుంది. అలా శనగపిండి పచ్చివాసన పోయేవరకూ వేయించి తరవాత పంచదార కలపాలి. శనగపిండి ఎంత అయితే అందులో సగం పంచదార చాలు. పంచదార కూడా పిండిలో బాగా కలిసేవరకూ కలిపి, మరో నాలుగు చెంచాలు నెయ్యేసి, కొంచెం నీళ్ళు చల్లితే పంచదార పాకం అవడం మొదలవుతుంది. దగ్గర పడేవరకూ కలుపుతూండాలి. సుమారుగా 8-10 నిముషాల్లో అయిపోతుంది.

దగ్గరపడ్డతరవాత పళ్ళెంలో పోసి సమంగా సెరపండి గరిటెతో. నాలుగు నిముషాలాగి ముక్కలు కోసుకోవచ్చు. ఇంకా కావలిస్తే, మైక్రోవేవ్ లో 1, 2 నిముషాలు పెడితే కరకరలాడుతూ కూడా ఉంటాయి.

మామూలుగా మాపిల్లకి మాత్రం soft batchఏ అలవాటు చేసేసేను. ఎందుకంటే మైక్రోవేవులో ఒకొకప్పుడు మరీ గట్టిగా అయిపోయే ప్రమాదం ఉంది కనక.

పోతే, బొప్పాయికాయ హల్వా - పచ్చి బొప్పాయికాయ తొక్క తీసి తురుముకోవాలి. ఇందులో నీరెక్కువ కనక మైసూరుపాకుకంటే ఎక్కువసేపు పడుతుంది. సేను తురుము ఫ్రీజరులో పెట్టుకున్నాను కనక, ఫ్రీజరులోంచి తీసేక, ఆనీరు వేరే గిన్నెలోకి పిడిచి ఉంచుకున్నాను. ఆనీళ్ళు పులుసులో వేసుకుంటే భలే రుచి వస్తుంది.

ఇప్పుడు ఆ బొప్పాయి తురుము మూకుడులో నెయ్యి 2, 3 చెంచాలు వేసి పచ్చి వాసన పోయేవరకూ వేయించాలి. టైం ఎంత పడుతుందో సేను చూసుకోలేదు. వేగిందని నమ్మకం కుదిరేక, పంచదారవేసి కలుపుతూ మరికొంతసేపు తిప్పుతూండాలి. తురుములో నీరుంది కనక మళ్ళీ వేరే నీళ్ళు పోయక్కర్లేదు.

పంచదార కూడా అట్టే వద్దు. రెండు చెంచాలు వేస్తే చాలు. కాయలలో ఉన్న తీపిమూలంగా పంచదార ఎక్కువయితే మదనతీపి వచ్చేస్తుంది. అంటే మొహం మొత్తేంత తీపి అన్నమాట.

ఈ ముద్ద దగ్గరపడుతున్నప్పుడే యాలకపొడి, జీడిపప్పు, లేదా బాదంపప్పు వేసి మరికొంచెం సేపుంచి దింపి పళ్లెంలోకి మార్చండి. అన్నట్టు జీడిపప్పు, బాదం పప్పు ముందే వేయించి పెట్టుకోవాలని చెప్పడం మరిచిపోయేను. అయినా మీకు తెలుసు కదా.

సొరకాయ, బూడిదగుమ్మడికాయ తురుముతో కూడా ఇలాగే చేసకోవచ్చు.

(జనవరి 3, 2017)

# 29. రెండున్నర డాలర్లు బాకీ పడ్డాను!

పొద్దున్నే లేచి, మరో పని లేక లాండ్రీ చేసుకుందాం అని మాసినబట్టలబుట్ట తీసుకు లాండ్రీరూంకి వెళ్లేను. అక్కడ ఒకావిడ వాషర్లూ డ్రైయరూ కంతలలో చిల్లర పెట్టడం చూసి, ఆవిడ బట్టలుతుక్కుంటోంది కాబోలనుకుని, "సరే, నేను తరవాత వస్తాను," అని వెనక్కి తిరగబోతున్నాను.

"కాదు, కాదు. నీకోసమే. ఈ చిల్లర. నువ్వు లాండ్రీ చేసుకో," అంది.

నాచేతిలో ఉన్న చిల్లర ఇవ్వబోయేను.

"కాదు, కాదు. నేను paying forward. నువ్వు తీసుకోవాలి తప్పనిసరిగా," అంది పట్టు బడుతూ.

నాకు ఏం చెప్పాలో తోచలేదు. Pay it Forward అని ఒక సినిమా వచ్చింది చాలాకాలం క్రితం. ప్రపంచాన్ని కొంచెం మెరుగు పరిచే ఉద్దేశంతో. ఒక అబ్బాయి పాత బాకీలు తీర్చడం కాక, ఎవరో ఒకరికి సాయం చేయడం ద్వారా చేయని అప్పు తీర్చుకోడం మొదలు పెడతాడు. సూక్ష్మంగా మంచికోసమే మంచి చేయడం. ఇక్కడ మరోవిషయం చెప్పాలి. సాధారణంగా వీరిసంస్కృతిలో పద్ధతి ఎప్పటికప్పుడే ఎక్కడికక్కడే అప్పులు తీర్చేయడం. అంటే ఒకరికి రైడిస్తే వెంటనే gas money అని రెండు డాలర్లు ఇవ్వజూపుతారు. ఉచితంగా ఏదీ తీసుకోడం ఇష్టపడరు అనడానికి ఇది నిదర్శనం. మనవాళ్ళు ఋణం అంటారు సుమారుగా ఇలాటిదే.

ఆవిడకి ఎలా జవాబు చెప్పాలో తోచలేదు, "సరే. ఇంకెవరైనా తీసుకోవచ్చులే అది. నాకొద్దు," అని వెనుదిరిగి నావాటాకి వెళ్ళిపోతున్నాను. ఆవిడ వదలకుండా నావెనకపడి, వస్తూ, "ఏయ్, ఇదుగో, రా, నామాట విను, నాకోసం. ఇది నా కానుక నీకు. ప్లీజ్, ప్లీజ్, నాసంతోషంకోసం ఒప్పుకో," అంది.

"మరి నేను కూడా నీకు ఏదో ఇవ్వాలి," అన్నాను.

"సరే. చూదాం," అనేసి ఆవిడ వెళ్ళిపోయింది.

ఈ దానంగురించిన ఆలోచనలు చాలా వచ్చేయి నాకు. మన సంస్కృతిలో పాత్రమెరిగి దానం చెయ్యమంటారు. పాత్రతమాట బహుశా మనం అన్ని సందర్భాలలోనూ అనుకోం. అవసరమైనవేళ అవసరమయినవారిని ఆదుకోడం మన లక్షణం. ఆస్తికులు పుణ్యం అంటారు. నాస్తికులు సమాజసేవ, సాంఘికధర్మం అంటారు. ఈ ఋణానుబంధం మనకి ఒక జన్మలో తీరిపోదు. జననాంతరాలకి కూడా ప్రసరిస్తుంది. "చచ్చి నీకడుపున పుడతా,"లాటి జాతీయాలు వచ్చింది అందుకే.

ఔదార్యం ఎప్పుడు ఎక్కడ ఎలా ప్రత్యక్షమవుతుందో చెప్పలేం. వీరికి డబ్బుంది కనక, వారికి అధికారం ఉంది కనక, అమెరికను కనక, భారతీయుడు కనక ... అని మూక ముద్రలేయడం కన్నా దేనికదే ఒక సన్నివేశం చూసి ఆనందించడమే మంచిదనుకుంటాను.

ఇంతకీ నాకు మాత్రం ఆ చిల్లర తీసుకోడం అంతగా నచ్చలేదు. ఆవిడని తృప్తి పరచడానికి, ఆ చిల్లర వాడుకుని, ఆ రెండున్నర డాలర్లు తరవాత బయటికి వెళ్ళినప్పుడు ఏ బిచ్చగాడయినా కనిపిస్తే ఇచ్చేయాలనుకుంటున్నాను, మన సంప్రదాయం నారక్తంలో ఇంకిపోయింది మరి!

(జనవరి 23, 2017)

# 30. నేనూ, నా బ్రాహ్మణీకమూ

ఇక్కడ రాసిన అభిప్రాయాలు కొత్తవి కాదు. పాఠకులందరూ చెప్పుకుంటున్నవే. కాకపోతే ముఖపుస్తకంలో నిన్నా మొన్నా వచ్చిన టపాలమూలంగానూ, అక్కడ వెలిబుచ్చిన అభిప్రాయాలు చూసినతరవాతానూ మరొకసారి నా అభిప్రాయాలు స్పష్టం చేయాలనిపించింది.

"నీవు గాకున్న నీదు తండ్రి," అన్న పంచతంత్రం కథ గుర్తుకొస్తుంది 21వ శతాబ్దంలో ఇంకా "బ్రాహ్మణులని కాదు బ్రాహ్మణీకాన్ని ద్వేషిస్తున్నాం" అనేవారున్నారంటే.

అసలు ఈ వాదన ఎలా వచ్చింది? నాకు తెలిసినంతవరకూ ఇది గత అర్థ శతాబ్దంలో వచ్చింది. ఇతరకులాలవారు తమ ఆధిక్యాన్ని పటిష్టం చేసుకుంటున్న సందర్భంలో ప్రారంబించిననినాదం. ఒకవిధంగా చూస్తే ఈనాటి సామాజికపరిస్థితుల దృష్ట్యా అసంబద్ధంగానే కనిపిస్తుంది.

చదువులూ, ఉద్యోగాలూ, ఇతరరాష్ట్ర ఇతరదేశాలలో జీవనాలూ - వీటన్నిటి మూలంగా వివిధ కులాల, మతాలప్రజలు సామరస్యంగానో, సామరస్యం నటిస్తూనో జీవించవలసివస్తోంది. ఒక ఉన్నతకులంవాడు దిగువకులంవాడిచేతికింద పని చేయవలసివస్తే, "మీరు తక్కువకులంవారు, మీతో సహపంక్తి భోజనం చేయను, నాకు సమ్మతం కాదు" అని చెప్పలేరు. హోటళ్లలో తినడం సర్వసాధారణం అయిపోయింది. ప్రతి హోటల్లోనూ సద్బ్రాహ్మణులు మడి కట్టుకు వంట చేస్తున్నారా? నెలకి 20రోజులు ప్రయాణాల్లోనే ఉండే బ్రాహ్మణుడికి ధర్మశాస్త్రంప్రకారం దినము గడుపుకోడం సాధ్యం కాగలదా అంటే అనుమానమే. అంతే కాదు. అసలు జీవనవిధానంగురించి చేసే ఆలోచనలలో ఎంతో మార్పు వచ్చింది. ఇలా ఆలోచించినప్పుడు మీరు ఏ బ్రాహ్మణీకాన్ని గర్హిస్తున్నారో ఆ బ్రాహ్మణీకం ఇప్పుడు లేనూ లేదు. ఆ ఆధిపత్యమూ లేదు.

000

"అమ్మా, మనం బ్రాహ్మణులమా?" అని మాఅమ్మాయి అడిగింది. ఎప్పుడంటే తను కాలేజీలో చేరేక. "ఇప్పుడు ఈ ప్రశ్న ఎందుకొచ్చింది?" అనడిగేను. కాలేజీలో హిందూయిజమో ఏదో అలాటి కోర్సు చదువుతున్నపుడు క్లాసువాళ్ళు అడిగేరుట.

ఇదెందుకు చెప్తున్నానంటే మాయింట్లో ఈ బ్రాహ్మణచర్చ ఎప్పుడూ జరగలేదు. ఆరోజుల్లో నేను పూజలు చేసేను. పండుగలు పద్ధతిగా జరుపుకున్నాం. అయినా మనం బ్రాహ్మణులం, మనం ఇలా చేయాలి అని ఎప్పుడూ నేను పాఠాలు చెప్పలేదు తనకి.

అవును, నేను బ్రాహ్మణకులంలో పుట్టేనన్న స్పృహ నాకుంది. అంతమాత్రాన, మిగతా కులాలవారినెవరినీ దూరం చేయలేదు. నిజానికి నాస్కూలు, కాలేజీరోజుల్లో నాస్నేహితులలో చాలామంది అబ్రాహ్మణులే. వాళ్ళని ఇంటికి తీసుకొచ్చేను. మాఅమ్మ ఎప్పుడూ ఎలాటి అభ్యంతరమూ చెప్పలేదు. బహుశా మీలో చాలామందికి కూడా ఇదే అనుభవం కావచ్చు.  నాకు సంబంధించినంతవరకూ, నాబ్రాహ్మణీకంలో రెండే అత్యంత ముఖ్యమైన అంశాలు - అంతశ్శుద్ధీ, బాహ్య శుద్ధీ. నేను పాటించేవి అవే. ఇవే అన్ని కులాలకీ, జాతులకీ కేంద్రబిందువులు.

వాల్మీకి బోయవాడు. ధర్మవ్యాధుడు ఏ కులమో నాకు తెలీదు కానీ మాంసం అమ్ముకునేవాడు. మాంసం అమ్ముకోడం బ్రాహ్మణవృత్తి కాదు కదా. విశ్వామిత్రుడు ఘోరతపస్సు బ్రహ్మఋషి అనిపించుకున్నాడు. పల్నాటియుద్ధానికి కారణం కోళ్లపందేలు. అందులో కూడా బ్రాహ్మణీకం లేదు. చరిత్ర సమగ్రంగా పరిశీలించి చూస్తే ఆధిపత్యం, మూర్ఖ ఆధిపత్యం బ్రాహ్మణులకే పరిమితం కాదని తెలుస్తుంది.

"మాకు బ్రాహ్మణులంటే కోపం లేదు, బ్రాహ్మణీకం అంటేనే కోపం" అన్న వాదనకి ఈనాడు బలం లేదు, ప్రధానంగా ఈనాడు బ్రాహ్మణులకి ఆ ఆధిపత్యం లేదు కనక. దుష్టగుణం ఏ ఒక్క మతానికి, జాతికి, వర్ణానికి సైజగుణం కాదు.

మతంపేరో కులంపేరో ఉపయోగించుకొని జరిపే హింసకి ఆ వ్యక్తులని తప్పు పట్టాలి

కానీ మతాన్నీ, కులాన్నీ కాదు. "వేషము మార్చెను, భాష మార్చెను ... అయినా మనిషి మారలేదు" పాట గుండమ్మకథలో 54ఏళ్ల క్రితం వచ్చింది. గత 54ఏళ్ళలో మనిషి మార్చుకున్నవి మరో ముప్ఫై చేర్చవచ్చు. అయినా ఇంకా నిరతాగ్నిహోత్రంలా మండుతూనే ఉన్నది బ్రాహ్మణద్వేషం. కాకపోతే ఇప్పుడు కొత్తగా, నాజూగ్గా, "మాకు బ్రాహ్మణులంటే కోపం లేదు, బ్రాహ్మణీకం అంటేనే కోపం" అంటున్నారు. రాజ్యాధిపత్యంకోసం ఎంత రక్తపాతం జరగలేదు? "మాకు క్షత్రియులంటే కోపం లేదు, క్షాత్రం అంటేనే కోపం," అని ఎవరూ అనరు. అలాగే రెడ్డి ప్రభువులు, కమ్మప్రభువులని తప్పు పట్టడం లేదు. రాజ్యాలు పోయేయి. ఇప్పుడు రాజకీయాల్లో, చిత్రరంగంలో, అన్నిటికంటే ముఖ్యంగా సాహిత్యక్షేత్రంలో ఆధిపత్యం బ్రాహ్మణులది కాదు. వీటిలో కనిపించే కులతతత్త్వాలగురించి ఎవరూ ప్రశ్నించరు.

నాకు నిజంగా మతచర్చలు చేసేంత పాండిత్యమూ లేదు, తీవ్రచర్చలోకి దిగే ఓపికా లేదు. ఈ టపాద్వారా నా అజ్ఞానం మాత్రమే తెలుపుకుంటున్నానని మీరనుకుంటే మీ ఇష్టం. కొన్నివేల సంవత్సరాలక్రితం, కాకపోతే కొన్ని వందలసంవత్సరాలక్రితం "బ్రాహ్మణులు ఏకచ్ఛత్రాధిపత్యం ఏలేరు, ఇతర కులాలవారిని అణగద్రొక్కేసేరు"లాటి వాదనలతో ఈనాడు తగువులాడుకోడంలో సౌలభ్యం కానీ ఆనందం కానీ ఏమిటో నాకర్థం కావడం లేదు. ఇప్పుడు బ్రాహ్మణులకి ఆ ఆధిపత్యం లేదు అన్నది ఎవరూ కాదనలేని వాస్తవం. ఏరంగం చూసినా ఎవరు ఇప్పుడు అధికారంలో ఉన్నారు? వారిలో కులతత్త్వంతాలూకు ఛాయలు ఎంత బలంగా ఉన్నాయి? పూర్వం బ్రాహ్మణులు ప్రదర్శించారంటున్న తత్త్వానికి భిన్నంగా ఉందా వీరి తత్త్వం? టానా ఆటావంటి సాహిత్యసంఘాలలో కులతత్త్వం ఏమీ లేదా? దాన్ని ప్రతిఘటించడానికి ఎవరైనా ఏం చేస్తున్నారు? - ఇది ఒక కోణం.

ముఖపుస్తకంలో వచ్చిన మరో ప్రశ్న ఎవరిని బ్రాహ్మణులు అంటున్నారని. ఇది కూడా పెద్ద ప్రశ్నే. ఈనాటి కులాంతర, వర్ణాంతర, జ్యాత్యంతరవివాహాలూ, కులాన్ని అదిగమించిన స్నేహాలూ, వ్యాపారాలసంబంధాలు ఈనేపథ్యంలో సనాతనాచారాలు పాటించే బ్రాహ్మణుడిగా ఎవరిని గుర్తిస్తారు? ఇలాటి అయోమయావస్థలో దౌష్ట్యాన్ని

దౌష్ట్యంగానే గానీ బ్రాహ్మణీకంగా గుర్తించడం అసంబద్ధం. జనబాహుళ్యములో చలామణీ అవుతున్న భావజాలానికి వేలఏళ్ళనుండీ ప్రతినిధులుగా వున్నది బ్రాహ్మణులే అన్న వాదన అసంబద్ధం. జనబాహుళ్యంలో చెలామణీ చేసింది గత శతాబ్దంలో కొందరు మొదలుపెట్టి వ్యాప్తిలోకి తెచ్చేరు. వ్యాప్తిలోకి తీసుకురావడానికి అనేకవిధాల ప్రయత్నించేరు. ఆనాటి పరిస్థితులు ఇప్పుడు లేవు. అప్పట్నుంచి ఇప్పటికి సాంఘికపరిస్థితులు గుర్తుపట్టలేనంతగా మారిపోయేయి. ఆనాటి అర్థంలో ఈనాడు బ్రాహ్మణీకం లేదు. కులవ్యవస్థ మారాలనేవాళ్ళు ఇలా ఒక కులాన్ని ఇంకా దుయ్యపట్టడంలో అర్థం లేదు. మారిన, మారుతున్న పరిస్థితులని ఎప్పటికప్పుడు గుర్తిస్తూ, తదనుగుణంగా తమఅభిప్రాయాలూ, భాషా మార్చుకోడమే కదా మానసికంగా ఎదిగేం అనుకోడానికి ప్రమాణం.

మరో కోణం బ్రాహ్మణ్యం, బ్రాహ్మణీకం ప్రసక్తి లేకుండా తమ పని తాము చేసుకుపోతూ నలుగురికీ మంచి చేస్తున్నవారు అన్ని కులాల్లోనూ ఉన్నారు. అలా అనుకుంటేనే నాకు మనశ్శాంతి.

000

(జనవరి 8, 2017)

# 31. సంద్రాలేటంటదంటే

సంద్రాల్తో సంద్రవొడ్డున

"మనూర్ల ఉన్నట్టు నేదు," చూపానినంతమేరకు చూస్తూ అంది సంద్రాలు మిలమిలాడుతున్న చిరు తరగలు పరికించి చూస్తూ.

నేను నవ్వేను, "సముద్రం సముద్రమే. ఎక్కడయినా ఆ ఉప్పునీళ్ళే కదా."

సంద్రాలు తలాడించింది కుడిఎడమలకి విసురుగా. "ఉహుఁ. నేదు. మనసంద్రం మనసంద్రంపే. నీలు ఉప్పైతె ఊరు ఉప్పాతాదేటి?"

నాకు కొంచెం తికమకయింది. నేనేదో అన్నాను అట్టే ఆలోచన ఏమీ లేకుండా. సంద్రాలేమొ ఏదో వేదాంతం మాటాడుతోంది.

"నిన్నే సూడు. బూదేవి ఆకొసనించి ఈకొసకొచ్చిపడ్డవ్. ఆడ ఏటికి మూడు సుట్లు వాయుగుణ్ణాలు, తుపానులూ ఒచ్చి మొత్తం జాలారిపేట తుడిసిపెట్టేస్తాది."

అవును, గాలివానలొచ్చి జాలారిపేట కొట్టుకుపోవడం చాలామార్లే విన్నాను. "మరి మళ్ళీ అక్కడే గుడిసెలేసుకోడం ఎందుకు. దూరంగా వేసుకోవచ్చు కదా," అన్నాను.

"యాడికి పోతం? యాడికీ పోం. పోనం. సచ్చినా బత్కినా ఆడ్నే మాబతుకులు ఆ సంద్రంతోని. వాలిండియ రేడియో బోరుమని గోలెత్తేస్తది పానననస్టం, ఆస్తినస్టం అంటా. మానాటోల్ని పట్టించుకొనెవోరు నేరు. మాకు ఒరిగేదీ ఏంనేదు."

"సాయిత్తెం సంవద్రమంటిదె. నివ్వు పొస్తకాలు సదూతావ్. నాను సంద్రం సదూతాను."

"సాహిత్యం సముద్రంలాటిదంటావా. అవున్లే. రెండూ కూడా అనంతమే," అన్నాను దూరంగా క్షితిజరేఖదగ్గర ఛాయామాత్రంగా కనిపిస్తున్నఅంబరపు అంచులనీడలు చూస్తూ. అక్కడ బయల్దేరిన చిరు తరగలు మావేపు అలవోకగా సాగి క్రమంగా మరిన్ని నీళ్ళు పుంజుకుని పైకి లేచి పడుచుదనంతో విరిగి పడుతున్నాయి,

తుప్పరలు మామీదికి విసుర్తూ.

సంద్రాలు మాటాడలేదు.

"అయినా నేను పుస్తకాలు చదివి తెలుసుకుంటే తప్పేమిటి?"

సంద్రాలు తల అడ్డంగా ఊపింది, "అదీ ఇదీ సమానం గాదు. పుస్తకం నిజం గాదు. ఒవురికి తోసింది ఆరు రాసీస్తరు. సంద్రం సాసితం."

"సరే. ఇంతకీ ఏమిటి నేర్చుకున్నావు సముద్రంనించి?"

"నివ్ ఈత్తావ?"

"ఈతా? రాదు. నీకొచ్చా?"

సంద్రాలు మొహం గుప్పున మతాబాలా వెలిగిపోయింది. పోటు తగిలిన సముద్రంలా పొంగిపోతూ, "ఈతా ... అబ్బో ... అడక్క. సేపలకి ఈత నేర్పిచ్చీగల్ను. నడిసీముందే నీలలో సబురీనునాగ దూసుకుపోయీదాన్ని అనీది మాయమ్మ."

"అమ్మో, సబ్ మెరీన్ లాగే?" అన్నాను నవ్వుతూ.

రెండు నిముషాలు మాటలు లేవు. నిశ్శబ్దమూ లేదు. సముద్రపు హోరు పెడుతూనే ఉంది తన ధర్మం నిర్వర్తిస్తూ. ఇసకలో ఓ నత్త నిదానంగా ముడచుకుంటూ ముందుకు సాగుతోంది. హవామహల్ బీచిలో కనిపించే రావణాసురుడి తలలకోసం వెతుకుతున్నాయి నాకళ్ళు.

"ఇందలక సంద్రం సాయిత్తెం అంటిది అన్న ఎందుకు తెల్సా?"

"ఎందుకు?"

"సముద్రంల రాల్లుంటయి. రతనాలుంటాయ్. ముత్తేలుంటయ్. మొసల్లుంటయి. నివ్ సూస్కపోతె సప్పరించీసె సుడిగుణ్ణాలు ఉంతయ్."

"పుస్తకాలూ అంతే కదా మరి. వాటిలోనూ పనికొచ్చేవీ ఉంటాయి, పనికిరానివీ ఉంటాయి. కొన్ని చదివితే ఉత్సాహం, కొన్ని చదివితే విజ్ఞానం. అలాగే వికారం కలిగించేవి కూడాను," అన్నాను. పుస్తకాలవిలువ పరిరక్షించవలసిన అవుసరం అత్యవసరంగా కనిపించింది నాకు మరి.

సంద్రాలు ఒప్పుకోలేదు. తల విసురుగా ఆడించింది, ఊహుహూ అంటూ.

"పొత్కాలు నివ్వు చదువుతవ్. అయి మల్ల రాసీస్తవ్. నేదా ఆరికీ ఈరికీ చెప్తవ్. నీ

బుర్ర ముందూ ఎనకా కూడా కాలీయే. ఈడ దాక తీసి ఆడెట్టినట్టే నీ సదుగూను."

నాకు నవ్వొచ్చింది. "అయితే పుస్తకాలు చదివి నేను కొత్తగా నేర్చుకున్నదేమీ లేదంటావేమిటి?" అన్నాను.

"నేదు. అయి సదివి నివ్ నేర్సుకున్నదేటీ నేదు."

నేను ఆలోచిస్తున్నాను.

"అస్లు సాయిత్తెం ఎట్ట ఒచ్చింది సెప్పు," అంది.

ఏం చెప్పను? ఆదిమానవుడు వేటాడిన జంతువులను తెచ్చి ఇస్తే ఆడమనిషి వండి వడ్డించేక తింటూ ఆనాటి సాహసగాథలు వర్ణించడంతో మొదలయిందని చెప్పనా? సూతుడు శౌనకాది మహామునులకు చెప్పగా, నారదుడు వ్యాసునికి చెప్పగా, శుకుడు పరీక్షత్ మహారాజుకు చెప్పగా ... అంటూ సాగించనా?

"నాకు తెలీదు. నువ్వే చెప్పు," అన్నాను.

సంధ్రాలు గంభీరంగా ఊపిరి తీసుకుని మొదలు పెట్టింది. "ముందస్తుగా ఈ మడుసులూ, పెపంచకం ఏంవీ నేవు. నీలు తప్ప ఇంకేటీ నేవు. నివ్వు ఇన్నవు గద జలమయంవని. అప్డు ఇస్నుమూరితోరు ఉద్భవించీరు. ఆరికి రూపు రేకలు ఎట్టొచ్చినయ్ అని నన్నడక్క. ఆరు పుట్టీరు. అంతె. ఆయనేంవో బెమ్మని పుట్టించినాడు. బెమ్మ "నన్ను పుట్టించీసినావు. ఉప్డు నానేం సేయను?" అని గోలెట్టీసినాడు. అంతట విస్నుమూరితోరు సరే పెపంచకం చేసి, మడుసుల్ని సేసి ఆడుకో అని చెప్పీసీరు. అదన్నమాట. అనాగ పెపంచకం వచ్చీసినాది. మరి నీలు అంటె ఈ సముదరం ముందె ఉన్నది గద. అందుసేత సముదరంవే గనం." అంది నొక్కి పలుకుతూ.

నాకు ఏం అనడానికీ తోచలేదు. సంధ్రాలు వాదన న్యాయమేనా అన్న ఆలోచన లేదు నాకు. సంధ్రాలు తన అభిప్రాయాలని అంత గాఢంగా విశ్వసించడమే నాకు కావల్సింది.

"సరే. అలాగే అనుకుందాం. నువ్వు సముద్రంలో ఈత కొడ్తూ ఏం నేర్చుకున్నావో చెప్పు."

సంధ్రాలు ఆలోచనలో పడింది. మళ్లీ ఓ పది నిముషాలు మాటల్లేవు సముద్రపు

హోరు, ఉండీ ఉడిగీ దూరంగా ఎవరో చెప్పుకుంటున్న కబుర్లలోంచి వినిపిస్తున్న శబ్దశకలాలూ తప్పిస్తే.
హవామహల్ సముద్రవొడ్డున గౌనుల్లో, పరికిణీల్లో, చీరెల్లో తడి ఇసకలో పాదం పెట్టి పిచిగ్గూళ్ళు కట్టి, పిచికలు వచ్చి గుడ్లు పెడతాయని ఎదురు చూసిననాడు, నీళ్ళలో నిలబడి అరికాళ్ళలో అలలు పారుతూ కితకితలు పెట్టిననాడు, తుప్పగా తడిసి ఇసక అంటుకున్న మణుగు బరువైపోయిన పరికిణీ ఈడ్చుకుంటూ ఇల్లు చేరినరోజు ...
డాబామీద చాపమీద వెల్లకిలా పడుకుని గోడమీద 20 క్షణాలకోమారు మెరిసే లైట్ హౌస్ దీపం వెలుగు ఎన్నిమార్లు లెక్క పెట్టేనో బంగాళాఖాతం హోరు పెడుతూంటే, ఆ కెరటాలమీంచి పిల్లవాయువులు పిట్టగోడ దాటి ఎదిగిన చెట్టుమీంచి మోసుకొచ్చిన సంపెంగ వాసనలు ఆఘ్రాణిస్తూ.
"ఇంటన్నవ?" సంధ్రాలు సతాయింపుతో ఉలికి పడ్డాను ప్రస్తుతంలోకి.
సంధ్రాలే అందుకుంది మళ్ళీ, "దోనెలే అగుపిచ్చవ్ ఈడ. నీకూ ఎరికే గద. జాలారిపేటకాడ సీకటితోనె గుడిసెల్లోంచి ఈతలకొత్తె సూణ్ణానికి రొండు కల్లు సాలవు. గుంపులు గుంపులుగ పడవలు. అయి సూస్తనె పానం లేచొస్తది. ఏటి నేర్సుకున్ననని అడగ్తన్నవు. సెప్పినాను గద. మున్నీరు గర్బంలో రాల్లుంటయి. రతనాలుంటయి. రాల్లు ఒగ్గేస్తం. రతనాలు ఏరుకుంతం. మొసల్లనోట బడకుండ కాస్కుంతం. సేపలట్టి మన నోళ్లల పడేస్కుంతం. అదీ సాస్తరం."
"చిన్న చేపని పెద్ద చేపలు గుటకాయస్వాహా చేసేయడమే శాస్త్రం అంటావు!"
"అంతె గద. సంవుందరం అయిన అంతె, పెపంచికంపైన అంతె. మనల్ని ముసల్లు తినికండ కాస్కోవాల. మనం తినీయి పట్టిడం తెల్సుకోవాల."
"సరే గానీ, నీగురించి కొంచెం చెప్పు. నీపాతకతలు* చదివినవారికి కొంచెం తెలుసు కానీ మళ్లీ ఇప్పుడు కొత్తగా మొదలు పెట్టేం కదా," అన్నాను.
"ఏటున్నది చెప్పనానికి. మాం పదకొండు మందిమి. నాను కడసారిదాన్ని. నడక ఒచ్చింకాడ్నించి నీల్లలోనె. మాయమ్మకేంవో బయ్యం "సుడిగుణ్ణంల సిక్కి సస్తవె గుంటా, నీల్లల దిగకే" అని అరస్త ఉండీది. నానింటేనా. ఒప్పుడె కిరస్తానీవోల్లొచ్చి

ఇస్కులెట్టినారు. మాయమ్మ నన్ను ఇస్కులికి తోలింది సదూకో గుంటా అంట. నాకు పదేల్లప్పుడు పెల్లి సేసింది. ఆమీన నీకూ తెల్సు గద. ఆడిమాటా ఈడిమాటా యిని, ఆడితో ఈడితో గడిపి ఈకాడికొచ్చిన. అందుసేత నాకియ్యన్ని పాతకతలె."

మెల్లిగా చీకట్లు కమ్ముకుంటున్నాయి. సూర్యబింబం ఉరువు పెంచుకుంటూ ఎరుపు తిరుగుతోంది.

ఇద్దరం ఇంటిముఖం పట్టేం.

సంద్రాలుమాటే నామనసులో మెదులుతోంది. నీరు ఉప్పయితే ఊరు ఉప్పవుతుందా? అవునూ కాదూ అనిపిస్తోంది. ఉప్పెక్కువయితే ఉప్పు కషాయం అంటాం. అంచేత కాదనే అనిపిస్తోంది. ఉప్పుగల్లు తగుల్తేనే కూరకు రుచి. అంచేత అవునూ అనిపిస్తోంది కూడా.

---------

(అక్టోబరు 30, 2015)

# 32. మౌనవ్రతం

ఈమధ్య నాకు మూగనోము ఎవరు ఎలా చేస్తారా అన్న బృహత్సంశయం కలిగింది. సాధారణంగా నాకు సంశయాలూ రావు. వస్తేమాత్రం వాటికథా కమామీషు ఆసాంతం తెలుసుకునేవరకూ తోచదు. కొందరిని అడిగేక కొన్ని విషయాలు తెలిసేయి. మూగనోము విధిగా పాటించేవారున్నారు.

హెచ్చరిక - ఇక్కడ వెలిబుచ్చిన అభిప్రాయములు కాపీ చేసేసి ప్రచురించేసుకోకండి, కర్తృత్వం నాకు అంటగట్టో గట్టకుండానో. ఇవన్నీ నాకు తోచినవీ నేను సేకరించినవే కానీ విస్తృతపరిశోధన చేసి, ఋజువూ సాక్ష్యాలతో నిరూపింపబడినవి కావు. అంచేత, ఎవరైనా ఈ అభిప్రాయాలను తమబ్లాగులోనో ముఖపుస్తకంపేజీలోనో పెట్టేసుకుంటే నాబాధ్యత లేదు.

ఆంధ్రభారతిలో నోము అంటే వ్రతము చేయు అని ఉంది కానీ నోములకీ వ్రతాలకీ సూక్ష్మమైన తేడా కొంత ఉన్నట్టుంది. నోములు స్త్రీలు నోచేవనీ, లింగబేధం లేకుండా సకలజనులూ చేసేవి వ్రతాలు అనీ ఒక అభిప్రాయం. ఇది సమంజసంగానే తోస్తోంది.

ఏతే, మూగనోము మగవాళ్ళు ఆడవాళ్ళని ఆరళ్ళు పెట్టడానికి వాడేఆయుధం అని మరొక అభిప్రాయం. నాఅభిప్రాయము ఆడువారు కూడా ఈ ఆయుధాన్ని ఉపయోగించుటలో తక్కువ తిన్నవారు కారనే. అసలు సదరు మూగనోము ఆడవాళ్ళతోనే పుట్టిందని జనశ్రుతి. గాంధీగారి సత్యాగ్రహమునకు ప్రేరణ స్త్రీలు అనేక సందర్భాలలో మౌనంతో నిరసన తెలియజేయడమేనని ఎక్కడో చదివేను. "చెప్పడానికి ఏమైనా ఉంటే చెప్పు. అంతేగానీ ఏదోఒకటి చెప్పాలన్న దుగ్ధతో మాటాడకు. ఆయుక్షీణం" అనేది మాఅమ్మ. నాకు ఇది నచ్చింది.

నిత్యవ్యవహారంలో కోపం ఒక్కటే కాదు ఈమౌనానికి ఇతర ఉపయోగాలు కూడా ఉన్నాయి. ఉదారహణకి, మాట తోచనప్పుడు, మాటల్లేవనుకున్నప్పుడు, "ఏదో పెద్దవారు పాపం" అని, "పోనిద్దూ పాపం చిన్నవాడు లేక చిన్నది" అని, చెప్పినా

వినిపించుకోరని, ఎదటివారిని క్షుణ్ణంగా అంటే అపార్థానికి తావులేనంతగా "అర్థం చేసుకున్నప్పుడు" - ఇలా ఎన్నో సందర్భాల్లో మౌనమే శరణ్యం అవుతుంది. జవాబు చెప్పకపోతే, "మాటాడవేం, ఒళ్ళు కొవ్వెక్కిందా," అని కుర్రకుంకల్ని గదమాయించడం కూడా ఈకోవలోకే వస్తుంది. అలాగే, పెద్దవాళ్లు పెదవి కదపకపోతే, అమ్మకో నాన్నకో కోపం వచ్చినట్టుంది అనుకుంటారు పిల్లలు.

ఈ హాస్యాలూ, అపహాస్యాలూ, కోపతాపప్రకటనలూ అలా ఉంచి, పరిశీలించి చూస్తే మనది ప్రధానంగా ఆధ్యాత్మికదేశం కావడం ఒక కారణం అనిపిస్తుంది. దగ్గినా తుమ్మినా కూడా మనవాళ్ళు ఏదో శాస్త్రం చెప్పి, నానా డొంకలూ తిప్పి దానికి ఆధ్యాత్మికమైన టీకాతాత్పర్యాలు చెప్తారు. ఏతావాతా చెప్పొచ్చేదేమిటంటే, ఈ మూగనోము లేక మౌనవ్రతమునకు ఆధ్యాత్మికమైన అనుబంధం ఉందని ద్యోతకమయింది కొంత పరిశోధనలు జరిపిన తరవాత. నేను తెలుసుకున్న మౌనవ్రతము లేక మూగనోముకు సంబంధించిన విషయం సంగ్రహంగా ఇదీ.

ఈ నోము లేక వ్రతానికి భూమిక ఏదో ఒక కార్యం నిర్వహిస్తామని సంకల్పించుకుని, విజయవంతంగా పరిసమాప్తి కావించుట. సాధారణంగా స్త్రీలు చేసేవి నూటికి తొంభై పాళ్లు  భర్తగారి ఆయురారోగ్యైశ్వర్యములఅభివృద్ధికే అయినా, ఆమె కూడా పరోక్షంగా ఆ లాభములు పొందగలదు. వ్రతములు - సత్యనారాయణవ్రతంవంటివి అందరూ చేస్తారు లింగ వయో కులబేధాలు లేకుండా.

ఉపవాసం జీర్ణాశయంవంటి అంతర్భాగాలకి విశ్రాంతి ఇవ్వడానికి అయితే మౌనం నోట్లో నాలుకకీ, తత్సంబంధితనాళాలకీ విశ్రాంతి ఇవ్వడానికి. తాపసులు మౌనం వహించడానికి కూడా అదే కారణం. ఇందువల్ల మానసికారోగ్యం కూడా వృద్ధి పొందగలదు.

మాఘమాసంలో అమావాస్యరోజున మౌనవ్రతం పాటిస్తారు కొందరుట. కొందరు నెలపొడగునా పాటిస్తారు. దీపావళి వెళ్ళిన మర్నాడు మొదలుపెట్టి 15 రోజులు మౌనంగా ఉంటారు కొందరు.

తెవికీ.ఆర్గ్ లో ఉన్నదంతా ఇక్కడ మళ్ళీ తిరిగి రాయను కానీ రమణ మహర్షి, వివేకానంద, రామకృష్ణమహర్షి వంటి మహాజ్ఞానులు కూడా మౌనానికి చాలా ప్రాధాన్యం ఇచ్చేరుట. దైహికంగానూ, మానసికంగానూ కూడా ఆరోగ్యకరం. రమణ మహర్షి అవసరమైతే తప్ప మాటాడేవారు కారుట. అలాగే శ్రీ స్వారాజ్యాశ్రమ వ్యవస్థాపకులు, ప్రస్థానత్రయభాష్యకారులై జగద్గురువులుగా కీర్తి గాంచిన బ్రహ్మీభూత, బ్రహ్మలీన, బ్రహ్మశ్రీ జగద్గురు వేదాంతం లక్ష్మణార్యులు మూడు సంవత్సరాలపాటు (1945-47) మౌనవ్రతం పాటించేరుట. వీరి ఆశ్రమం స్వారాజ్యాశ్రమం అంటే 1947లో స్వరాజ్యం మనకి రావడంకోసం - ఈ రెంటికీ ఏమైనా సంబంధం ఉందేమో నాకు తెలీదు.

తెవికీలో మూడు మౌనములు మూడు విధములు అని ఉంది.

నోరు పెగల్చకుండా పరమనిష్ఠతో మౌనంగా ఉండాలని పెద్దలు భక్తినీ, ఆరోగ్యాన్ని కలిపి ఆచారంగా పెట్టారు. మనం మనకి తోచినప్పుడు విశ్రాంతి తీసుకున్నట్టుగానే శరీరంలో పనిచేసేఅవయావాలకి ఆచారాలూ, సాంప్రదాయం పేరుతో పెద్దలు విశ్రాంతినిచ్చారు అంటున్నారు.

మౌనం మూడు విధాలుగా చెప్తారు.

వాఙ్మౌనం: వాక్కును నిరోధించడమే వాఙ్మౌనం. దీనిసే మౌనవ్రతం అంటారు. ఇలాంటి మౌనంవల్ల పరుషవచనాలు పలుకుట, అబద్ధములాడుట, ఇతరులపై చాడీలు చెప్పుట, అసందర్భప్రలాపాలు అను నాలుగు వాగ్దోషములు హరించబడతాయి.

అక్షమౌనం: అనగా ఇంద్రియాలను నిగ్రహించడం. ఇలా ఇంద్రియాలద్వారా శక్తిని కోల్పోకుండా చేస్తే ఆ శక్తిని ధ్యానానికి, వైరాగ్యానికి సహకరించేలా చేయవచ్చును.

కాష్ఠమౌనం: దీనిసే మానసికమౌనం అంటారు. మౌనధారణలో కూడా మనస్సు అనేక మార్గాలలో పయనిస్తుంది. దానిని కూడా అరికట్టినప్పుడే కాష్ఠమౌనానికి

మార్గం లభిస్తుంది. దీని ముఖ్యఉద్దేశ్యము మనస్సును నిర్మలంగా ఉంచుట. కాబట్టి ఇది మానసిక తపస్సుగా చెప్పబడినది.

నేను కనుగొన్న మరొక మూలం తెలుగువన్.కాంలో మోచేటి పద్మం మౌనవ్రతం అన్న పేరుతో ఉన్న వ్యాసం. దీపావళిఅమావాస్యనుండి కార్తీకపౌర్ణమివరకూ ఆచరిస్తారుట మూడు సంవత్సరాలపాటు.

మౌనం లేక మూగనోము అన్నది కేవలం అలకలకి మాత్రమే కాదని తెలుసుకున్నాక ఇంక చెప్పడానికేం ఉంది? ఇంత చదివేక నాకు తోచిందేమిటంటే - అలిగి మాటాడకపోవడం బలహీనత. నోరు మెదపను అని సంకల్పం చెప్పుకుని మౌనాన్ని పాటించడం మనోదారుఢ్యానికి సూచన.

000

(జనవరి 27, 2015)

# 33. కంప్యూటరురచనలో పదచ్ఛేదం

తెలుగులో కలిపి రాయడం, గొలుసుకట్టు వ్రాత అలా ఉండగా, వ్యవహారంలో మాటాడుతున్నట్టు రాయడం వచ్చేక, కంప్యూటరే వత్తులూ, కొమ్ములూ, గుడిదీర్ఘాలూ చూసుకుంటోంది కనక అవెక్కడ పెట్టాలన్న చింత వదిలిపోయింది. కానీ, అందుకు ప్రతిగా ఈ కీలు కొట్టడలంలో మరో బాధ ఎదురైంది.

రెండో మూడో అంగుళాలు పొడవున్న సమాసం కంప్యూటరుతెరమీద ఎలా కనిపిస్తుంది, ఎక్కడ పదాలు విరిచి రాస్తే కంటికి సుఖం అన్న ప్రశ్న నేను ముఖపత్రంలో అడిగేను. అక్కడ వచ్చిన అభిప్రాయాలు, సలహాలు, సూచనలు సమీకరించి, నా ఆలోచనలు కూడా చేర్చి ఇక్కడ పెడుతున్నాను.

మొదట నాకు ఈ ప్రశ్న ఎదురైంది అనిల్ అట్లూరి justification నా సంకలనాలను పిడియప్లో చేస్తే బాగుంటుందని సూచించినప్పుడు. అప్పట్లో నాకు ఈ సుదీర్ఘ సమాసాలమూలంగా మాటకీ మాటకీ మధ్య ఎడం ఎక్కువై మరింత వికృతంగా ఉందని అనిపించింది. ఇంతకాలం తరవాత కొన్ని సుళువులు తెలిశాయి. విడదీసి రాయడం ఒకటి. లేదా మాటలు ముందూ వెనకా మార్చి గిట్టించడం రెండో పద్ధతి.

ఉదాహరణకి,

**అక్కటికి వెళ్ళి, కొంచెం బెదిరి, మళ్ళీ సర్దుకుని ప్రముఖవిజ్ఞానశాస్త్రవేత్తలనిపించుకున్నవాళ్ళందరిమాటలూ విన్నాను,**

ఇది చూడ్డానికీ బాగులేదు. చదవడానికీ సుకరం కాదు. మొదటి లైనులో ఖాళీజాగాలు మరీ ఎక్కువా, రెండో లైనులో అక్షరాలు కిక్కిరిసిపోయి ఉన్నాయి కదా. అలాటప్పుడు నేను వాక్యం మార్చేను. ఇలా -

**అక్కడికి వెళ్లి ప్రముఖవిజ్ఞానశాస్త్రవేత్తలనిపించుకున్నవాళ్ళందరిమాటలూ విన్నాను, ముందు కొంచెం బెదిరి, తరవాత సర్దుకున్న తరవాత.**

ఒకొకప్పుడు విడదీస్తాను - **ప్రముఖ విజ్ఞానశాస్త్రవేత్తలు అనిపించుకున్నవాళ్ళందరి మాటలు ...**

వ్యాకరణరీత్యా విశేషణం, విశేష్యం కలసి ఒకటే పదం అవుతుంది. కలిపి రాయాలి. పొట్టివాడు అనే కాని పొట్టి వాడు అని రాయడం సరి కాదు. అలాగే సీతారాముడు ఒక్కడే, సీతా రాముడు అని రాస్తే ఇద్దరు అనుకునే అవకాశం ఉంది.  కానీ కంప్యూటరు తెరమీద అక్షరాలు చదవడం అన్నీ స్పష్టంగా ఉండవు. ముఖ్యంగా కొన్ని ఫాంట్స్. నేను గౌతమి ఫాంట్స్ వాడుతున్నాను. గతిలేనివారికి గౌతమి ఖతి అన్నారు వీవెన్ గారు. కానీ నేను గత 30 ఏళ్ళగా అదే వాడుతున్నాను. ఇతర ఖతులు చూసేను కానీ నాకు వీలు పడలేదు. ఆ కష్టాలన్నీ రాయను కానీ ఈ ఖతి నాకు అలవాటయిపోయింది, కానీ ఈ ఖతిలో చా, దా ఇంచుమించు ఒక్కలాగే కనిపిస్తాయి. చెప్తూ అని రాస్తే ప కింద త-వత్తు వెతుక్కోవాలి. ఇలాటి బాధలమూలంగా అన్నమాట సుదీర్ఘ సమాసాలూ కూడా విడదీసి రాస్తే చదవడానికి సుళువు అన్న నిశ్చయానికి వచ్చేను. అయితే ఎక్కడ నప్పుతాయి, ఎక్కడ నప్పవు అన్నది సమస్య.

మనకి ఒక పాతజోకుంది రామునితోక పివరుండిట్లనియె అని. అందరికీ తెలిసిందే. కానీ ఇప్పుడు ఈ కంప్యూటరులిపి వచ్చేక ఇలాటివి కోకొల్లలుంటున్నాయి. ఈ వాక్యంలోనే **కోకొల్లలు ఉంటున్నాయి అని రాస్తే నయం కదా. అయితే** మాటాడేటప్పుడు **కోకొల్లలు ఉంటున్నాయి** అనం. పిల్లలకి కొత్తగా తెలుగు నేర్పుతున్నప్పుడు ఎలా నేర్పాలి అంటే విడదీసి నేర్పడమే సబబు అనుకుంటాను మొదట పదస్వరూపం వాళ్ళకి తెలియాలి కనక. తరవాత మాటాడుతున్నప్పుడు మనం వేరే చెప్పక్ఖర్లేదు నాలుకే నిర్ణయించేస్తుంది ఆ పదబంధం.

అలాగే ఇంగ్లీషు పదాలు తెలుగులో రాస్తున్నప్పుడు వాటిలో ఉండే హల్లులసముదాయంవల్ల తెలుగులో కొంత అసౌఖ్యం కనిపిస్తుంది.  Next time

అన్నపదం కీలు కొట్టుకుంటూ పోతే నెక్స్టం అని కనిపిస్తుంది. నెక్స్ట టైం అని రాస్తే కొంత నయం కానీ అక్కడ కూడా 3 హల్లులు - క స ట - కలిసిపోవడం జరిగింది. మరో ఉదాహరణ - లాప్టాపు అని రాస్తాను నేను. లాప్ టాప్ అని రాయొచ్చు కానీ నాకు అది సరి కాదు అనిపిస్తుంది. లాప్ పేరూ, టాప్ పేరయితే laptop అన్న అర్థం రాదు. సీతారాముడు ఒక్కడే కానీ సీతా రాముడు అని రాస్తే ఇద్దరన్న అర్థం రావచ్చు తెలుగులో. ఇద్దరయితే సీతా, రాముడూ అన్నదే సరిపోతుంది. కానీ ఈరోజుల్లో అనేక రచనల్లో ఈ సూక్ష్మవిషయాలకి అట్టే ప్రాధాన్యం ఉన్నట్టు లేదు. మరొకరితో "మీ రచనలో తప్పులున్నాయండీ" అని చెప్పడానికి తప్ప.

పోతే, విభక్తి ప్రత్యయాలు విడదీయవచ్చా అని మరో సందేహం. నిజానికి విడదీయకూడదు. **రామునితో** అనే కానీ **రాముని తో** కాదు.

ఇంగ్లీషువాడుకవల్ల విడదీయవలసివస్తోంది కొన్నిచోట్ల. నేను సీరియస్గా అని రాసినప్పుడల్లో నాకు అది తప్పుగానే కనిపిస్తుంది. అంచేత సీరియస్ గా అని రాస్తున్నాను. అలాగే, అఫ్కోర్స్. ఈ గుణింతం నాకు of courseలా కనిపించడం లేదు.

మామూలుగా తెలుగులో హలంతాలు లేవు కానీ ఈమధ్య రాహుల్, చరణ్ లాటి హలంతాలు గల పేర్లు వచ్చేయి కనక ఇక్కడ కూడా విభక్తి ప్రత్యయాలతో పేచీ వస్తుంది. రాహుల్కి, చరణ్తో అని రాస్తే చూడడానికి ఇబ్బందిగానే ఉంటోంది. Word లో zero-width joiner (200C in symbols box) అని ఒక వసతి ఉxది. అది వాడితే హలంతానికి విభక్తి ప్రత్యయాలు చేర్చినా రెండు అక్షరాలు విడిగా ఉంటాయి. ఆ 200Cకి నేను ఒక shortcut కూడా సృష్టించుకున్నాను. ఉదాహరణకి పేరు తరవాత ఎడం ఇవ్వకుండా, zero-width joiner (200C in symbols box), అంటే నా shortcut cntl+J టైపు చేస్తే రాహుల్కి అని కనిపిస్తుంది.

ఏతావాతా చెప్పొచ్చేదేమిటంటి, LCD screen, fontsవల్ల కంటికి ఇంపుగానూ, చదవడానికి తేలికగానూ ఉండేవిధంగా పదాలమధ్య విరుపులు చొప్పించడం జరుగుతోంది.

ఎటొచ్చీ ఆ విరుపులు కొంచెం జాగ్రత్తగా చూసుకుంటే బాగుంటుంది, రామునితోక పివరుండు అన్నట్టు కాకుండా.

000

గమనిక - ఈ టపాకి స్పందిస్తు సాంకేతికనిపుణులు ఈ అంశానికి సంబంధించిన కొన్ని ఇతర వసతులు ప్రస్తావించేరు. కొన్ని లింకులు కూడా ఇచ్చేరు. ఆసక్తి గలవారుసౌకర్యార్థం లంకె ఇక్కడ.

(ఏప్రిల్ 5, 2017)

# సమాప్తం

నా ఇతర సంకలనాలు నాబ్లాగు తెలుగు తూలిక లో "నాసాహిత్యం pdfలో" అన్న పేజీలో చూడవచ్చు. మీరు ఉచితముగా download చేసుకుని చదువుకొనవచ్చు. ఇతరత్రా ప్రచురించుట, అమ్ముకొనుట, పుస్తకములు, వస్తువులు మొదలగునవి అమ్ముకొనుటకు, ప్రచారము చేసుకొనుటకు సాధనములుగా గానీ ఉపయోగించరాదు.

ప్రశ్నలు, సందేహములు malathini@gmail.com ద్వారా పంపవచ్చు.

నాసాహిత్యంపిడియఫ్లో పేజీకి లింకు ఇక్కడ

- నిడదవోలు మాలతి

ఏప్రిల్ 10, 2017